# ఆంధ్రసచిత్ర వారపత్రిక

దూరదర్శని కార్యక్రమాలు

21-27, ఫిబ్రవరి, '86
రు. 2-50




• మానవతకి మరోపేరు ఆంటే

# భారతి

## సాహిత్య మాస పత్రిక

### ఫిబ్రవరి 1986 సంచిక వెలువడింది



ముఖచిత్రం బేబి సునీత చౌదరి

**పై సంచికలోనే**
**ఇచ్ఛాపురపు రామచంద్రం**
**సృష్టి**
**సీరియల్ నవల ప్రారంభం**

## కథలు :

చెంగప్ప - గంటి రామలింగం
పూలమనసులు - జనస్వామి కోదండరామశాస్త్రి,
సూర్యదేవర రవికుమార్
గోరోజనం చిలక - రంధి సోమరాజు
మేఘైర్మేదురమంబరం - ఇచ్ఛాపురపు రామచంద్రం

## కవిత్వం :

దశావతార పద్యములు - పప్పు విశాలాక్షి
నిజాయితీ - కాలువశ్రీ
కవి వారసత్వం - నిఖిలేశ్వర్
ఇంద్రగోపము - పెన్మెత్స రాజంరాజు
తూరుపు చిరునవ్వుల చిరంజీవి - జనజ్వాల
రాత్రి - శిఖామణి
కవిత-నవులే - కె. కిశోరుబాబు, కె. అశోకుబాబు
నిన్నే - కావూరి పాపయ్యశాస్త్రి
జీవితం - సడ్లపల్లె చిదంబరరెడ్డి
ఊరంత వెలుగు - అడబాల వి. వి. సత్యనారాయణ
రా నేస్తం-రా - హనీఫ్

## వ్యాసాలు :

నాట్యాకాశంలో మరో తార సునీత చౌదరి - కొత్త కమలాకరం
విమలాదిత్యుడు జైనమతావలంబకుడా? - కొల్లూరు సూర్యనారాయణ
వచన కవిత - వాక్యలయ - వై. కామేశ్వరి
తిలక్ కవిత్వంలో విశ్వసనీయత - విశ్వజనీనత - సోమసుందర్
సారంగధర నాటకం - దీక్షితుల దృక్పథం - జి. వలసయ్య
ఋక్కులలో ప్రాణాయుప్రశ్న - కొండూరు వీరరాఘవాచార్య
ఆధునిక తెలుగు సాహిత్యంలో - 'ఇమేజిస్టు' కవిత - శ్రీరంగం నారాయణబాబు } బి. డి. బి. ప్రసాదరావు
మధుర తెలుగు మాండలికం - చల్లా రాధాకృష్ణశర్మ

## సీరియల్స్ :

సహగమనం - మధురాంతకం నరేంద్ర
సమిధలు - దిలావర్

నిశ్వాస కురుక్షేత్రము - గద్యపద్యాత్మక నాటకము
కన్నడ మూలం - డా. కె. వి. పుట్టప్ప
తెనిగింపు - శంకరగంటి రంగాచార్యులు

---

భారతి సంవత్సర చందా (పోస్టు ద్వారా రు 51/-లు) ఒకేసారి చెల్లించేవారికి రు 11/-ల ముదరా వుంటుంది

**అంటే మీరు కేవలం రు 40/-లు చెల్లిస్తే ప్రతినెలా భారతి పోస్టు ద్వారా మీ ఇంటికే అందుతుంది**

చందా పైకమును ఆంధ్రపత్రిక గాంధినగరం విజయవాడ-3కి మనియార్డరు లేదా డిమాండు డ్రాఫ్టు ద్వారా పంపుతూ ఈ దిగువ కూపను జతపర్చ కోరుతాము

నేను 'భారతి' మాసపత్రికకు చందాదారునిగా చేరదలుచుకున్నాను
చందా పైకము రు 40/- డి డి / ఎం ఒ ద్వారా పంపుతున్నాను

పేరు ______________________

ఊరు ______________________

చందాదారుని సంతకం

ఈనాటి సాంకేతిక నిపుణుల
అత్యంత అధునాతనమైన
మహాద్భుతసృష్టి



లోపరహితమైన పనితనం కోసం
వందసార్లు పరీక్షింపబడింది,
రెండువందల నాణ్యత పరిశీలనలకు గురి
చేయబడింది. సాంకేతిక నిపుణులు
కాలానుగుణ్యంగా రూపొందించిన
అద్భుత సృష్టి – డిజియానా. మిరుమిట్లు
గొలిపే కలర్, బ్లాక్ అండ్ వైట్ రకాలు
అందరికీ అందుబాటులో వున్నై!

# డిజియానా

స్పష్టతకు ప్రాణం! ఉత్కృష్టతకు జీవం!!

kiron/ai/85

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# ప్రచురణకి వెళ్లని ఇంటర్వ్యూ!?

ఈ మధ్యే ఒక మిత్రుడికి తన సహచరుడైన పత్రికా రచయిత వ్రాతబల్ల సొరుగులో ప్రచురితం కానటువంటి రాజీవ్‌గాంధి ఇంటర్వ్యూ ఒకటి కనిపించింది. అది ఏ కారణం చేత ప్రచురింపబడలేదో మనకి తెలియదు. బహుశా ఆయన ఇంటర్వ్యూలు ఇటీవలి కాలంలో చాలా ఎక్కువగా వచ్చినందు వల్లనో లేక ఆ సమాధానాలు అంత ముఖ్యమైనవి కావని భావించడం వల్లనో అలా జరిగి ఉండవచ్చు. కానీ ఈ కింద ఇచ్చిన దానిలోని భాగాలని చూస్తే మాత్రం అది నిజం కాదనిపిస్తుంది:

ప్రశ్న : బొంబాయిలో మీరు విజృంభించి భారిగా కర్చు చేసారు. దేశంలో ఎంతో మంది ఆకలితో అలమటిస్తూ ఉంటే అలా చెయ్యటం మీకు భావ్యంగా కనిపిస్తున్నదా?

జవాబు : ఈ దేశంలో ఎవరూ తిండి లేక మాడటం లేదు. అలాంటి వారి కోసం నేనే దేశం అంతా తిరిగి చూసాను. మధ్యప్రదేశ్‌లోని గిరిజన ఆదివాసులలో కానీ, తమిళనాడులోని జాలర్లలో కానీ ఒక్క వ్యక్తి కూడా పస్తులు ఉండటం నాకు కనిపించలేదు. సౌత్ బ్లాక్‌లో ఉన్న తమ ఎయిర్ కండిషన్డ్ గదిలో కూర్చుని చుట్టుపక్కల ఒక మైలు దూరంలో ఉన్న అన్నార్తుని సైతం కనిపెట్టగలిగినటువంటి మణి శంకర్ అయ్యర్‌కి కూడా అలాంటి వారెవరూ కనిపించలేదు. కాంగ్రెసు లాంటి పార్టీ అప్పుడప్పుడు అలా భారిగా ఎందుకు కర్చు చెయ్యకూడదో నాకు అర్థం కావటం లేదు. మా మిత్రులు కొందరు అయిదు చుక్కల హోటళ్లలో ఉన్నారు. కానీ నేను మాత్రం లేను, గవర్నర్‌తో ఉన్నాను. కిర్లోస్కర్, బజాజ్ వంటి వారే అక్కడ ఉంటున్నప్పుడు మావాళ్లు మాత్రం ఎందుకు ఉండకూడదు? కిర్లోస్కర్‌ల కన్నా వాళ్లే దేశానికి ఎంతో చేసారు.

ప్ర : ఆ ముసలాయన్ని మీరందుకేనా అరెస్టు చేసారు?

జ : మళ్లీ అక్కడికే వెళ్తున్నారు. వయసు, వర్గం, డబ్బు వంటి వాటిని చట్టం గౌరవించదు. వాళ్లు తప్పుడు లెక్కలు చూపిస్తున్నట్లు మాకు సమాచారం అందింది. అందుకే వారి వెంట పడతాము. మా విధానం ఇవ్వటం, దండించడం. ఇవాళ ఇస్తాము రేపు దండిస్తాము. అప్పుడు అది దండనకి తగిన సమయం. శతవార్షికోత్సవాలకి మాకు డబ్బు అవసరమైకాదు. మా డబ్బు మాకు ఉన్నది. దాని సంగతి ఇందిరాజీయే చూసుకున్నారు.

ప్ర : మీ డబ్బు మీకెక్కడ నించి వస్తుంది?

జ : ఓహ్! ఎలాగో అలా సంపాదిస్తాము. అయినా మా ఆర్థిక విషయాల గురించి మీకు ఎందుకు అంత ఆరాటం? దేశం ఆర్థిక విషయాలపై తప్పకుండా మీకింకా ఎక్కువ ఆసక్తి ఉండి ఉండాలి.

ప్ర : ఆ విషయానికే వస్తున్నాను. ఇటీవల ఒక ప్రశ్నావళికి మీరు ఇచ్చిన సమాధానంలో ఆర్థిక వ్యవస్థ దివ్యంగా ఉందని అన్నారు కానీ అలాంటి సూచనలేవీ మాకు కనిపించడం లేదు?

జ: మీరు చూడరు కాబట్టే మీకు కనిపించదు. స్టాక్ మార్కెట్ చూడండి. బ్రహ్మాండంగా ఉన్నది. ప్రపంచంలోని మరే ఇతర షేర్ మార్కెట్ మన దేశంలో లాగా లేదని ఇటాలియన్ మిత్రులు నాతో చెప్పారు. అది ఆర్థిక వ్యవస్థ పెరిగిందనటానికి నిదర్శనం కాదా?

ప్ర : అదొక్కటేనా నిదర్శనం?

జ : ఇంకా ఏమి కావాలి మీకు? ధరలని తీసుకోండి. విపరీతంగా పెరుగుతున్నాయవి కూడా. తాజ్ పాలస్‌లో కప్పు కాఫీ పది రూపాయలు. ఒక సబ్బు ఖరీదు అయిదు రూపాయలు. అంత వెల పెట్టి కొనుక్కునే వాళ్లు ఉన్నప్పుడే కదా షాపు యజమాని ఆ ధరకి అమ్మగలుగుతున్నాడు. అంటే ప్రజలదగ్గర డబ్బు ఉందని అర్థం. జనం దగ్గర డబ్బు ఉన్నదంటే దానికి అర్థం ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందుతున్నదనే కదా!

స్వాతంత్ర్యానికి ముందు, నానా కాలానికి పూర్వం పరిస్థితులు ఎలా ఉండేవో మీకు తెలుసా? ఒక కప్పు కాఫీ అణా ఉండేది, సబ్బు వెల రెండణాలు ఉండేది. ఎందుకో తెలుసా? అప్పుడు జనం దగ్గర డబ్బు



లేదు. మేము దారిద్ర్యాన్ని, పూర్తిగా నిర్మూలించాము.

ప్ర : మీరు ఇంకా ఏదైనా నిర్మూలించారా?

జ : నల్లడబ్బుని నిర్మూలించబోతున్నాము. ఎలా అని అడగవద్దు. అది రహస్యం.

ప్ర : రాజకీయ వాదుల దగ్గరే అందరికన్నా ఎక్కువ నల్ల డబ్బు ఉంటుందని ప్రజలు అంటూ ఉంటారు?

జ : అది అబద్ధం. ఉంటే విశ్వనాథ్ ప్రతాప్ సింగ్‌కి తప్పకుండా తెలియాలి, ఎందుకంటే నల్లడబ్బు విషయంలో ఆయనకి తెలియనిదంటూ లేదు. ఒక్క రాజకీయ వాది , లేదా కాంగ్రెసు రాజకీయ వాది అనండి, ఒక్కరి మీద కూడా దాడి జరగలేదంటే దానికి అర్థం వాళ్ల దగ్గర నల్లడబ్బు లేదనే. నిజంగా వాళ్ల దగ్గర డబ్బు ఉన్నట్లైతే వారి మీద కూడా దాడులు జరిపి ఉండే వాళ్లం.

ప్ర : ప్రభుత్వం నిజంగా నల్ల డబ్బుని వెలికి తీయాలని అనుకుంటే మొట్ట మొదట రాజీవ్ గాంధి ఇంటి మీదే దాడి చెయ్యాలని టైమ్స్ ఆఫ్ ఇండియా సంపాదకుడు గిరిలాల్ జైన్ అంటున్నారు?

జ : ఆయన అలా అన్నారా?

ప్ర : అవును . నాగపూర్‌లో అన్నారు. దానికి అర్థం ఏమిటో ఆయనకి తెలీదు. పత్రికా సంపాదకులకి కూడా కాంగ్రెసువారి లాగే వాళ్లు చెప్పేది తరచుగా వారికే తెలియదు.

జ : అయితే నేను తప్పకుండా జైన్‌లతో మాట్లాడాలి. మేము ఇంకా వారిపై దాడి చెయ్యలేదు. (రాజీవ్ గాంధి తమ కంప్యూటర్ మీద కొన్ని మీటలు నొక్కారు. తెరమీద ఎన్నో పేర్లు కనిపించాయి, వాటిలో ఒక ప్రముఖ వార్తాపత్రిక ప్రచురణ కర్త పేరు కూడా ఉన్నది, కానీ వాళ్లలో జైన్‌లు లేరు)

ప్ర : దేశంలో చెయ్యాల్సిన పని ఇంత ఉన్నప్పుడు మీరు విదేశాలకి వెళ్తారెందుకు?

జ : దేశంలో నేను ఎంతో కష్టపడి పని చేస్తాను. ఒక హెలికాప్టర్‌లో నించి మరో హెలికాప్టర్‌కి మారటం అంటే తమాషాకాదు. నేను ఎక్కడ ఉన్నదీ

ఒక్కొక్కప్పుడు నాకే తెలియదు అంతా ఒక లాగే ఉంటుంది విదేశాలలో నే చాలా బాగుంటుంది మంచి తిండి, ఆ విషయానికి వస్తే

ప్ర కానీ ఏ విషయంలో నూ మీరు సాధించింది అంటూ ఏమీ లేదు కదా?

జ ఏమిటి మీరంటున్నది? కామన్ వెల్త్ దేశాల ప్రభుత్వాధి నేతల సమావేశానికి తటస్థ దేశాల సమావేశానికీ వెళ్ళాను అరాఫత్‌తో సహా వందలాది ప్రపంచ నాయకులతో కరచాలనం చేసాను

ప్ర అరాఫతా? అయనతో కరచాలనం చెయ్యడానికి అయితే మీరు విదేశాలకి వెళ్ళనవసరం లేదు సగానికి సగం రోజులు ఆయన ఇక్కడే ఢిల్లీలో నే ఉంటారు కదా?

జ నా అభిప్రాయం అరాఫత్ ఒక్కరే అని కాదు ఇంకా మిగతా వారు కూడా ఉన్నారు హవానాలో క్యాస్ట్రో, లండన్‌లో స్వరాజ్ పాల్

ప్ర స్వరాజ్‌పాల్ హెబ్రిడ్స్‌లో నో మరొక చోటో ఒక ద్వీపాన్ని కొనుక్కుని దాని మీద తమ కాపరో జెండాని ఎగర వేస్తే తప్ప ఆయన ప్రపంచ నాయకుడు కాలేరు కదా?

జ మనం అంత తేలికగా తీసేయ కూడదు స్వరాజ్ పాల్ భారతదేశానికి గొప్ప మిత్రుడు 2000 కోట్ల రూపాయలతో ఇక్కడ ఆయన ఒక ఉక్కు కర్మాగారాన్ని నెలకొల్పాలను కుంటున్నారు మన పారిశ్రామిక వేత్తలలో ఎంతమంది అంత డబ్బుని భారత దేశంలో పెట్టుబడి పెట్టడానికి సిద్ధంగా ఉన్నారు?

ప్ర ఎందరో లేరు చాలా మంది ఇక్కడినించే డబ్బు తీసుకు వెళ్ళాలన్న తొందరలో ఉన్నారు

జ సరిగ్గా చెప్పారు

ప్ర బహుళ జాతి సంస్థలతో మీరెందుకు అంత స్నేహంగా ఉన్నారు?

జ : బహుళజాతి సంస్థలపై మీ కున్న వ్యతిరేకత ఏమిటో నాకు అర్థంకాదు అవి మానవ జాతి పై కరుణామృతంతో పొంగి పొర్లుతున్నాయి కోట్లాది మంది ఆకలితో అలమటిస్తున్న భారతదేశంలో పెట్టుబడి పెట్టాలని అవి తపించి పోతున్నాయి

ప్ర కానీ మీ రింతకుముందు పేదరికాన్ని పూర్తిగా నిర్మూలించామని, ఆకలితో ఎవరూ అలమటిం చటం లేదని అన్నారు కదా?

జ అవును అయితే బహుళ జాతి సంస్థలకి ఆ విషయం తెలియదు భారత దేశంలో విదేశీయులకి తెలియని విషయాలు ఎన్నో ఉన్నాయి దూర దర్శన్‌తో సహా మన ప్రచార సాదనాలు ఏమీ బాగాలేవు వాటిని ఏమి చెయ్యాలో నాకు తెలియటం లేదు ఇప్పటికి వందసార్లు గాడ్గిల్‌తో చెప్పాను నాకు ప్రచారం ఇవ్వటం ఆపమని కానీ ఆయన కింద పనిచేసే కుర్రవాళ్ళకి ఏమీ తెలియదు (అప్పుడే దూరదర్శన్ విడియో బృందం మొత్తం కెమేరా మొదలైన వాటితో సహా లోపలికి వస్తుంది) క్షమించాలి నేను వెంటనే వెళ్ళాలి (ప్రధానమంత్రి తమ జాకెట్ సర్దుకుని బయటికి వెళ్తారు) □




# ఆ సున్నితమైన అనుభవం మిమ్మల్నొక్క నిట్టూర్పులో ఆఘమేఘాల మీదుంచుతుంది

పొగమంచుకన్నా పల్చన, ఎగిరే ఈకకన్నా తేలిక, అదే మీరు కోరే నిశ్చింత నిస్తుందిక. డ్యూరెక్స్ ఫెదర్ లైట్ అంతఃరరాష్ట్రీయ కాండోము లిప్పుడు ఇండియాలో లభిస్తున్నాయి.

ప్రపంచానికి తెలిసిన అతి తేలికైన, సున్నితమైన సంరక్షతను తెలుసుకోవడానికి మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాము.

అతి పల్చనిది

డ్యూరెక్స్ ఫెదర్‌లైట్

ఇది జగమెరిగిన గొప్ప అనుభవం.

[redacted]

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938 1972)

21-27 ఫిబ్రవరి 86
శ్రీక్రోధన నామ సం మాఘ శు ద్వాదశి
సంపుటము 78 . సంచిక 24

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడి ప్రతి వెల | రు | 2-50 |
| పోస్ట్‌లో 6 నెలల చందా | రు | 71 50 |
| పోస్ట్‌లో 12 నెలల చందా | రు | 143-00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

### ముఖచిత్రం
నటి శ్రీదేవి
ఫోటో పి రవిచందర్

### కథలు


### సీరియల్ నవలలు.


### వ్యాసాలు, శీర్షికలు ·


# ఉత్తరాలు

## ఎందుకు ఆపాలి?

27 డిసెంబర్ 85 2జనవరి 86 సంచికలో ఉత్తరాల శీర్షికలో సత్తెనపల్లి నుంచి యం నాగరాజ్‌రావ్‌గారు రాసిన ఉత్తరం చదివాను ఆయన డా జయ్‌దుబాషిగారి వ్యాసాలిక ప్రచురించవద్దనే ధోరణిలో రాసిన వుత్తరానికి సమాధానమిది జయ్‌దుబాషిగారి వ్యాసాల్లో ఎంతో విజ్ఞానమూ ,విశేషమూ వుంది దేశ విదేశీ రాజకీయాలు ఆచారవ్యవహారాలు సమగ్రంగా తన వ్యాసాల ద్వారా ఆంధ్రులకు ప్రవాసాంధ్రులకు తెలియజేస్తున్నారు ఇటువంటి వ్యాసాల్ని ప్రచురించ వద్దనడం అర్ధరహితం తెలుగులో దారావాహికంగా యిలాంటి రాజకీయ వ్యాసాల్ని ప్రచురిస్తున్నది 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఒక్కటేననడంలో అతిశయోక్తి లేదు ఈ శీర్షికను తొలగించవద్దని కోరుతున్నాను

చికట సుబ్రహ్మణ్యం ప్రొద్దుటూరు

## శోచనీయం!

డిసెంబరు 27 పత్రికలో సత్తెనపల్లి -నాగరాజారావు లేఖ దుబాషి వ్యాసాలు ఎందుకు అనే అక్కసు చదివి వ్రాయక తప్పుటలేదు

దేశంలో విదేశంలో ఏమి జరుగుతుందో దుబాష తన వ్యాసాలలో అరటిపండు వలిచినట్లు చెబుతున్నారు ఈ కటిక నిజాలు నక్కజిత్తు రాజకీయ నాయకులకు మ్రింగుడు పడకపోవచ్చు తనదగు ప్రత్యేక శైలి ద్వారా పత్రిక దుబాషి వ్యాసాలు తెలుగు పాఠకులకు అందిస్తూ పత్రికలన్నింటిలో నెంబర్ వన్‌గా నిలుస్తుంది పత్రికకు మణి కిరీటం అయిన దుబాషి వ్యాసాలు కాలరాస్తాం అనుట కడు శోచనీయం

కొలూరు వెంకటరమణ ఆలేరు

## విమర్శలో వాస్తవం లేదు

27-12 85 ఆంధ్ర వారపత్రికలో త్రివేణి 3డి సీరియల్ చదివాను అందులో ప్రైవేటు డాక్టర్లపై విమర్శలు రచయితగారు చేసారు

డాక్టర్లు తమ ప్రైవేటు ప్రాక్టీసు పెంచుకొనుటకు పనికిరాని (చెడిపోయిన) వాక్సిన్ వేస్తారు అని వాక్సిన్లు (పోలియో ట్రిపుల్ యాంటిజెన్) ఎక్కడబడితే అక్కడ తయారు కావు దేశంలో ఒకటి రెండు చోట్ల తప్ప లేక విదేశాల నుండి దిగుమతి చేసుకొనవలసిందే అవి దేశం నలుమూలలా రవాణా చేయబడతాయి కదలో చెప్పిన కారణాల వల్ల మందు చెడిపోవటం సంభవిస్తే అది పట్టణంలో అయినా పల్లెలో అయినా ఒకటే డ్రాప్స్ వేసే విధానం డాక్టర్ల అనుభవానికి తెలుసు పిల్లలు ఏడుస్తున్నప్పుడు తప్పనిసరిగా మింగించే విధంగా వేస్తారు ఉచితంగా వేసే వాక్సిన్లు ఖరీదు 5 పైసలైనా 50 రూపాయలైనా వైద్యులు తమ స్వంత డబ్బుతో కొని వేస్తారుగాని వారికి ఏవీ ఉచితంగా సరఫరా చేయబడవు అంటువంటి అవకాశాలు ఏవైనా ఉంటే రచయిత మాకు తెలియపర్చ ప్రార్థన

ఒక రచయిత వల్ల మేలు జరగకపోయినా ఈ రకమైన విమర్శలవల్ల వైద్యునికి రోగికి మధ్య కల సత్సంబంధం చెడే అవకాశం ఉందని రచయిత గ్రహించగలరు

మా వైద్యశాలలో గత పది సంవత్సరములుగా ఉచితంగా మా స్వంత డబ్బులతో కొన్ని వేల మంది పసి పిల్లలకు వాక్సిన్స్ వేస్తున్నాము మమ్ములు ఒకరి దగ్గరి నుంచి కూడా మాకు ఎటువంటి వివాదం అందలేదని రచయిత గమనించగలరు

డా ఎ జి ఇందిరారెడ్డి హరిహర హాస్పటల్
గుంతకల్ □

# కొత్త సీరియల్ ప్రారంభం!

రైలు దిగిన విజయ్‌ని వచ్చి ఆప్యాయంగా కౌగలించుకున్నాడు కల్యాణ్. ఇద్దరూ కుశల ప్రశ్నలు వేసుకున్నాక స్టేషను బయటికి వచ్చి అక్కడ పార్కు చేయబడి వున్న కల్యాణ్ కారులో కూర్చున్నారు.

కల్యాణ్ కారు స్టార్టు చేసాడు. విజయ్ స్మోక్ చేద్దామని సిగరెట్ పెట్టె పైకి తీసాడు. ముందుగా కల్యాణ్ వైపు జాపేడు పెట్టెని.... సిగరెట్ తీసుకోమని ఆఫర్ చేస్తూ.

కల్యాణ్ విజయ్ చేతిలోంచీ మొత్తం పెట్టెనే అందుకుని తన పక్క విండోలోంచీ బయటికి విసిరేశాడు! విస్తుపోయాడు విజయ్.

పెదవులమీద చిర్నవ్వుతో కారు షెల్ఫ్ తెరిచి అందులోంచీ ఒక త్రిబుల్‌ఫైవ్ ప్యాకెట్ తీసి విజయ్‌కి ఆఫర్ చెయ్య బోయాడు కల్యాణ్.

విజయ్ మొహం గంభీరంగా మారిపోయింది.

"నో.... థాంక్యూ" అన్నాడు బింకంగా.

"నాకు తెలుసులేవోయ్ నీ ప్రిన్సిపల్స్ సంగతి. ఇంతోటి పెద్ద డి. యస్. పి. అయినంత మాత్రాన డ్యూటీలో లేనప్పుడు కూడ స్మగుల్డు సిగరెట్ తాక్కూడదా ఏమిటి?" అన్నాడు సాగదీస్తూ.

"ఇది స్మగుల్డనుకుంటే అది నీ భ్రమే! ప్రతి ఫారిన్ సరుకుకి ఇండియన్ డూప్లికేటొకటి బొంబాయిలో తయారవుతోందన్న సంగతి నీకింకా తెలీదేమో. ఇదంతా అలాంటి సరుకే" అన్నాడు విజయ్.

"పోనీ అలానే అనుకో.... అటువంటప్పుడు యిది యిండియన్ సిగరెట్టే కదా! కాల్చడానికి నీ కభ్యంతరం ఏమిటి?" అన్నాడు కల్యాణ్.

"మొత్తానికి నువ్వే గెలిచావ్!" అంటూ పెట్టెలోని సిగరెట్టొకటి అందుకున్నాడు విజయ్.

అప్పుడే తెలతెలవారు తూండడంతో వాతావరణం ప్రశాంతంగా వుంది. చుట్టూ పరివేష్టించిన పచ్చని పొలాలని చూస్తూ ఆలోచనల్లో మునిగిపోయాడు విజయ్. వారం రోజులు సెలవుపెట్టి రమ్మని ఉత్తరం రాసేడు కల్యాణ్. అంత అర్జంటుగా రమ్మని ఎందుకు పిలిచాడో అర్థం కాలేదు విజయ్‌కి. అయినా చిరకాల స్నేహితుడి మాట తిరస్కరించ లేక వెంటనే బయల్దేరాడు. కల్యాణ్ పెద్ద జమిందార్. తరతరాల నుంచి సంపాదించిన ఆస్థికి ఏకైక వారసుడు. అంత ఆస్థివున్నా ప్రకృతిరీత్యా కళాహృదయం వున్నవాడు. అందుకే కలుషిత వాతావరణాలతో సతమతమయ్యే పట్నాలకంటే ప్రకృతి సౌందర్యానికి దర్పణం పట్టే పల్లెలంటేనే అతని కిష్టం. అందుకే తనుంటున్న గ్రామంలోనే అన్ని హంగులతో చక్కటి రెండతస్థుల బంగాళా కట్టించాడు. ఇంటి ముందు చక్కటి పూలతోట.

విజయ్ ఆలోచనల్లో వుండగానే పోర్టికోకింద ఆగింది కారు. కారాగిన శబ్దానికి వరండాలోకి వచ్చింది మైత్రేయి. కల్యాణ్ భార్య.

సృష్టిలో అందాన్నంతా మూసబోసి తయారు చేసాడా దేవుడు....



అన్నట్టుగా వుంటుంది మైత్రేయి ఆమె నించి చూపులు మరల్చుకోపడం ఎవరికైనా కష్టమే!

మైత్రేయి విజయ్ పరస్పరం విష్ చేసుకున్నాక లోపలికి నడిచారు ముగ్గురూ మైత్రేయి కిచెన్‌వైపు వెళ్లిపోయింది కల్యాన్ విజయ్ మెట్లవైపు దారితీశారు

విజయ్‌కి ఆ యిల్లు పరిచయమే. ఇంతకు ముందొకసారి చూసాడు దాన్ని. విశాలమైన డ్రాయింగ్ హాలూ దానితో కలిసే డైనింగ్ రూమూ వుంటాయి. డైనింగ్ రూంకి ఒక పక్క కిచెన్ వుంది. డైనింగ్ రూము, కిచెన్ మీద పదడుగుల ఎత్తులో స్లాబ్ వేసి డాబాగా వదిలేశాడు కల్యాణ్. డ్రాయింగ్ హాలు 'రూఫ్' మాత్రం యిరవై అడుగుల ఎత్తులో వుంది. దానిక్కారణం డ్రాయింగ్ హాలుకి ఒక పక్క గ్రౌండ్ ఫ్లోర్‌లో మూడు బెడ్‌రూమ్సూ, సరిగ్గా వాటికి మీదనే ఫస్ట్‌ఫ్లోర్‌లో మూడు బెడ్ రూమ్సూ వున్నాయి. డ్రాయింగ్ హాలుకీ, డైనింగ్ హాలుకి మందడిన మేడమీదకి వెళ్ళడానికి మెట్లున్నాయి.

మెట్లెక్కే వారికి ఆసరాగా వేసిన అల్యూమినియం రైలింగ్ పట్టుకుని మెట్లెక్కసాగాడు విజయ్. ఇద్దరూ మేడమీది వరండాలోకి ప్రవేశించారు. వరండాలో ప్రవేశించిన వెంటనే ఎడమచేతి వైపు ఒక తలుపు వస్తుంది. అది డాబా మీదకి వెళ్ళే మార్గం. వరండాలో కుడిచేతి వైపు వరుసగా ఒక దాని తర్వాత ఒకటి మూడు బెడ్‌రూమ్స్ వున్నాయి. మొదటి బెడ్‌రూం తలుపు లోపలివైపు వేసి వుంది. అంటే లోపల ఎవరో వున్నారన్న మాట. రెండో బెడ్‌రూం తలుపులు బార్లా తెరిచివున్నాయ్. ఆ బెడ్‌రూం గుమ్మానికెదురుగా వరండాలో ఒక డస్ట్‌బిన్ వుంది. అందులో కొన్ని సిగరెట్ పీకలూ ఒక 'డన్‌హిల్' పాకెట్టూ పడి వున్నాయి. గదిలో వున్న డబల్‌కాట్ మీద వెల్లకిలా పడుకుని గుర్రుపెడుతున్నాడో నడివయసు స్థూలకాయుడు అతని గుర్రు వింటూంటే ఏదో ఫ్యాక్టరి పని చేస్తున్నట్టుంది

కల్యాణ్ విజయ్ వంక చూసి చిన్నగా నవ్వేడు

శామ్యూల్ నీకు తెలుసుకదా అడిగాడు విజయ్‌ని తెలుసన్నట్టు చిన్నగా తలూపాడు విజయ్ శామ్యూల్ ఆ దగ్గర్లోనే వున్న నగరంలో బ్యాంకు మేనేజర్ ఇంతకు పూర్వం కల్యాణ్ మేరేజ్‌లో అతన్ని కలిసాడు విజయ్

మొదటి గదిలో డాక్టర్ ఆనంద్ పడుకున్నాడు రాత్రి రెండు గంటల వరకూ గానాబజానాయే అంటూ నవ్వేడు కల్యాణ్ విజయ్ చిన్నగా నవ్వి ఊరుకున్నాడు

చివరి బెడ్‌రూం దగ్గరకి వచ్చారు యిద్దరూ

దీసీజ్ యువర్ బెడ్‌రూం– ప్లీజ్ టేక్‌రెస్ట్ రాత్రంతా ప్రయాణం చేసి బాగా అలసిపోయి వుంటావ్ అన్నాడు కల్యాణ్ బెడ్‌రూం తలుపు తెరుస్తూ

నేను బాగానే రెస్టు తీసుకున్నాను ఎటొచ్చి రెస్టు తీసుకోవలసింది నువ్వేలాగే వున్నావు అన్నాడు విజయ్



## సాక్షి

పోనీ అలాగే అనుకో నేను ఎల్లుండి సెలవు తీసుకుంటాను ఈ లోగా నువ్వు కాస్త కాఫీ గట్రా తాగి బిస్కట్లు బండీలు తియ్యి లేకపోతే ప్రమోషన్ రాకపోవచ్చు అనేసి వెళ్ళిపోయాడు కల్యాణ్

విజయ్ తలుపు దగ్గరగా వేసి బ్రీఫ్‌కేస్ తెరిచాడు

★ ★ ★ ★

విజయ్ బట్టలు మార్చుకునే సరికి తలుపు మీద నెమ్మదిగా చప్పుడయింది వెళ్ళి తెరిచాడు

ఎదురుగా మైత్రేయి!

సెగలు కక్కుతున్న కాఫీకప్పు అందించింది విజయ్‌కి

ఇండియాలో పండిన ప్రశస్తమైన కాఫీ గింజలతోనూ పాలతోనూ పంచదారతోనూ ఇండియాలోనే తయారైన స్టెయిన్ లెస్ స్టీల్ చెంచాతో కలిపి తయారు చేసిన కాఫీ అని చెప్పమన్నారు అంది సన్నగా నవ్వుతూ

విజయ్ కూడ ఆమె నవ్వుతో శృతి కలిపాడు

కప్పూ సాసరూ సంగతి మరచిపోయినట్టున్నాడు అన్నాడు

మరోమారు యిద్దరి నవ్వులూ శృతి కలిపాయి

మరో రెండు కుశలప్రశ్నలు వేసుకున్నాక ఖాళీ కప్పు తీసుకుని కిందకెళ్ళిపోయింది మైత్రేయి టేప్ రికార్డర్ ఆన్ చేసి స్నానం చెయ్యడానికెళ్ళాడు విజయ్

★ ★ ★ ★

ఉదయం పది గంటలకి అందరూ డైనింగ్ టేబిల్ దగ్గర సమావేశమయ్యారు డాక్టర్ ఆనంద్ బ్యాంకు మేనేజర్ శామ్యూల్ కాక మరో మూడో వ్యక్తి కూడ అక్కడ సమావేశమయిన వారిలో వున్నాడు అతను లాయర్ ప్రకాష్ అతను కూడ కల్యాణ్ మేరేజ్‌లో పరిచయమయ్యాడు విజయ్‌కి

ఇక్కడికి పది కిలోమీటర్ల దూరంలో ఒక అందమైన ఫారెస్టుంది లంచ్ అక్కడ తీసుకుందాం అన్నాడు కల్యాణ్ అందరూ బ్రేక్‌ఫాస్టు తీసుకుంటూండగా అందరూ ఉత్సాహంగా ఓ కే అన్నారు

కల్యాణ్ జీపులో వనభోజనానికి కావలసిన సామగ్రంతా తీసుకుని బయల్దేరారందరూ

కల్యాణ్ చెప్పినట్టే చాల అందమైన అడవి అది కొంత దూరం వెళ్ళాక ఒక సన్నటి జలపాతం సెలయేరు కూడ వున్నాయి ఆ అడవిలో వాతావరణం చాల ఆహ్లాదకరంగా వుంది ఒక చెట్టుకింద పోర్టబుల్ డైనింగ్ టేబిలూ కుర్చీలూ సిద్ధం చేసాడు కల్యాణ్ టేబిల్ పక్క ఒక కేసు బీర్ బాటిల్సూ టేబిల్‌మీద అరడజను గ్లాసులూ ఓ డజను ట్రిపుల్‌ఫైవ్ ప్యాకెట్లూ రెండు ఏష్‌ట్రేలూ పెట్టాడు అందరూ కూర్చున్నారు

విజయ్ అందర్నీ పరిశీలనగా చూసాడు

డాక్టర్ ఆనంద్ ఎర్రగా బొద్దుగా వుంటాడు మితభాషి ముక్తసరిగా మాట్లాడతాడు ముక్తసరిగా నవ్వుతాడు మంచి పేరున్న డాక్టర్

లాయర్ ప్రకాష్ చామన చాయ రంగు సన్నగా వుంటాడు కొద్దిగా నిర్లక్ష్యంగా కూడ అతను మంచి ఆర్టిస్టు కూడ చిత్రలేఖనంలో చెయ్యి తిరిగినవాడు

బ్యాంకు మేనేజర్ శామ్యూల్ వయసు నలభై అయిదు వుండొచ్చు నల్లటి శరీరం నిరంతరం తాగుతూండడం వల్ల బాగా ఉబ్బిన కళ్ళు నల్లటి ఫ్రేం కళ్ళద్దాలు కొద్దిగా మొరటుగా మాట్లాడుతాడు

జమిందార్ కల్యాణ్ తెల్లగా చలాకీగా వుంటాడు నొక్కుల జుత్తు అన్ని రంగాలలోనూ అభిరుచి వున్నవాడు అందుకే యింతమంది స్నేహితుల్ని ఆకట్టుకోగలుగుతున్నాడు

మైత్రేయి ఎం ఏ ఎలాగపి చదివింది ప్రస్తుతం వంట పనిలో వుంది ఏ పని చేస్తున్నా అందంగానే వుంటుందామె ఆమె అందాన్ని వర్ణించడానికి భాష చాలదు మనిషి ఎంత అందంగా వుంటుందో మాట కూడ అంత అందంగానూ వుంటుంది మృదువైన మాటల్లోనే అన్ని రసాలు చిందించగలదామె కాని ఈసారి మాత్రం ఎందుకో కొద్దిగా ఉదాసీనంగా కన్పిస్తున్నాది

ఓ కే లెటజ్ స్టార్ట్ అన్న కల్యాణ్ గొంతుతో తన చూపుల్ని టేబిల్ వైపు మళ్ళించాడు విజయ్ అన్ని గ్లాసుల్లో నిండా పోసి వుంది బీరు ఒకొక్కరికి గ్లాసులందించాడు కల్యాణ్ అందరూ చీర్స్ కొట్టి బీర్ సిప్ చెయ్యసాగారు కల్యాణ్ టేప్‌రికార్డర్ ఆన్ చేసి పేకముక్కలు పంచసాగాడు

చుట్టూ చల్లటి వాతావరణం సేవిస్తున్నది చల్లని బీరు టేప్ రికార్డర్ లోంచి మంద్రస్థాయిలో వినిపిస్తున్న పాశ్చాత్య సంగీతం క్షణాల్లోనే ఆటలో నిమగ్నమయిపోయారందరూ

ఈ వాతావరణానికి సెంబర్ త్రీ కూడ వుంటే బాగుంటుంది తనలో తాను గొణుక్కుంటున్నట్టుగా అన్నాడు శామ్యూల్ మూడు బాటిల్స్ పూర్తి చేసాక ఎవరూ ఏం మాట్లాడలేదు వినిపించుకోనట్టు వూరుకున్నారు శామ్యూల్‌లో ఒక ప్రత్యేకతను గమనించాడు విజయ్ పార్టీలో అందరూ ట్రిపుల్‌ఫైవ్ కాలుస్తూంటే అతనొక్కడూ ఛన్‌వాల్ కాలుస్తున్నాడు

రెండు గంటల కల్లా లంచ్ సిద్ధం చేసింది మైత్రేయి ఆట ముగించి భోజనాలు చేసారందరూ రెండున్నర కల్లా తిరిగి బంగళా చేరుకుని ఎవరి గదుల్లోకి వారు దారి తీసారు

విజయ్ కంతా విచిత్రంగా వుంది అర్జంటుగా రమ్మని రాసాడు కల్యాణ్ ఏదో ముఖ్యమైన విషయం చర్చించాలన్నాడు కాని యిప్పటి వరకూ ఆ ప్రసక్తే లేదు చూస్తుంటే ఏదో హాలిడే ఎంజాయ్ చెయ్యడానికి పిలిచినట్టుగా వుంది

సాయంత్రం నాలుగ్గంటలకి మళ్ళీ డ్రస్ చేసుకుని కిందకి బయల్దేరాడు విజయ్ అప్రయత్నంగా అతని కళ్ళు శామ్యూల్ గది ముందున్న డస్ట్‌బిన్ మీద పడ్డాయి అది ఖాళీగా శుభ్రంగా వుంది అంటే పనిమనిషి వచ్చి శుభ్రం చేసి వెళ్ళిపోయిందన్న మాట

టెన్నిస్ ఆడదామా? విజయ్ దిగువుకి రాగానే అక్కడ వెయిట్ చేస్తున్న






కల్యాణ్ ప్రపోజ్ చేసాడు మిగిలిన వాళ్ళు కూడ అక్కడే వున్నారు ఓకే అన్నాడు విజయ్ బీరు తాగి పడుక్కోవడం వల్ల తల బారంగా వుందతనికి

అందరూ యింటిముందున్న లాన్స్‌లోకి నడిచారు బంగళా ఆవరణలోనే ఒక టెన్నిస్ కోర్టు కూడ ఏర్పాటు చేసుకున్నాడు కల్యాణ్ డబ్బుంటే సాధ్యపడనిది ఏమిలేదు

మైత్రేయి కూడ టెన్నిస్ ఆడుతుంది మైత్రేయి డాక్టర్ ఆనంద్ ఒక పార్టీగా కల్యాణ్ విజయ్‌లు అపొజిషన్ పార్టీగా డబల్స్ ఆడారు డాక్టర్ ఆనంద్ నేషనల్ లెవెల్స్‌లో టెన్నిస్ ఆడతాడు మైత్రేయి అంత బాగా ఆడలేకపోయినా అతను మాత్రం విజృంభించి ఆడాడు విజయం వారినే వరించింది

చాలా బాగా ఆడావ్ మీ విజయానికి తగిన బహుమతిని ఒకటి రేపు నీకివ్వాలనుకుంటున్నాను అన్నాడు కల్యాణ్ డాక్టర్‌తో కరచాలనం చేస్తూ

థాంక్స్' అన్నాడు డాక్టరు ముక్తసరిగా మైత్రేయి ఎందుకో హుషారుగా లేదు ఆమె ఈ సంబాషణలో పాల్గొనకుండా అక్కడినించి నిష్క్రమించింది

ప్రకాష్ శామ్యూల్ టెన్నిస్ ఆడలేదు టెన్నిస్ కోర్టు పక్కనే లాన్స్‌లో రెండు గార్డెన్ చెయిర్స్ వేసుకుని టీపాయ్‌మీద చదరంగం ఆడుతున్నారు వాళ్ళిద్దరూ విజయ్ వాళ్ళ వైపు నడిచాడు

నీ రాజు కట్టు అన్నాడు ప్రకాష్ ఒక పాన్‌ని ముందుకి జరుపుతూ

నీకు ఆవేశమే కాని ఆలోచన లేదు ఇదిగో ఈ నైట్‌ని చూడు దీన్ని ముందు పెట్టానంటే ముందు నీ రాజు కట్టయిపోతుంది అన్నాడు శామ్యూల్ నైట్‌ని రాజుముందు పెడుతూ

ప్రకాష్ తెల్లమొహం వేశాడు!

* * * *

ఏడు గంటలప్పుడు విజయ్‌ని కిందకి రమ్మని కేకేశాడు కల్యాణ్ విజయ్ వచ్చేసరికే నాలుగ్గ్లాసుల్లో విస్కీ సర్వ్ చేయబడి వుంది

ఇండియన్ స్కాచ్ ప్లీజ్ హేవిట్ అంటూ విజయ్ కూర్చోగానే అతనికో గ్లాసు అందించాడు కల్యాణ్ మిగిలిన మూడు గ్లాసుల్లో ఒకటి ఆనంద్‌కి ఒకటి శామ్యూల్‌కి యిచ్చి మూడోది తనందుకున్నాడు

అందరూ మదుపానంలో పడ్డారు మైత్రేయి ప్రకాష్ టేబిల్ దగ్గర లేకపోవడం గమనించాడు విజయ్ ప్రకాష్ బెడ్‌రూం వైపు చూసాడు తలుపు కొద్దిగా మాత్రమే తెరిచి వుంది లోపల లైటు వెలుగుతోంది అంటే ప్రకాష్ గదిలోనే వున్నాడన్న మాట

దాదాపు గంట గడిచింది శామ్యూల్ కల్యాణ్ లిద్దరూ ఏవేవో జోకులు చెప్పున్నారు ఆనంద్ విజయ్ లిద్దరూ అవి విని నవ్వుకుంటున్నారు

మరో గంట గడిచింది

మైత్రీ అని కేకేశాడు కల్యాణ్

ప్రకాష్ గది తలుపు నెమ్మదిగా తెరుచుకుంది

మైత్రేయి ఆమె వెనుకే ప్రకాష్ యిద్దరూ టేబిల్ దగ్గరకి వచ్చారు

ఏం యింకా పెయింటింగ్ పూర్తవలేదా? అడిగాడు కల్యాణ్

అయిపోయినట్టే చిన్న చిన్న ఫినిషింగ్ టచెస్ మాత్రమే బాకీ అన్నాడు ప్రకాష్ ఉత్సాహంగా

అవి తర్వాతిద్దురు గాని ముందు ఓ పెగ్గు డ్రింక్ తీసుకోండి కాస్త అలసట తగ్గుతుంది అంటూ మరో గ్లాసులో విస్కీ పోసి అతని కందించాడు కల్యాణ్ ప్రకాష్ గ్లాసందుకుంటూ కూర్చున్నాడు

మిస్టర్ ప్రకాష్ మీరు చేతులు కడుక్కోడం మరచి పోయినట్టున్నారు విజయ్ చేసిన హెచ్చరికతో చేతుల వంక చూసుకున్నాడు ప్రకాష్ నిజమే! వాటినిండా పెయింట్ మరకలున్నాయి

ఓ నాకున్న దురలవాటే యిది సాధారణంగా చేతులు కడుక్కోడం మరచిపోతూంటాను అంటూ లేచి వాష్ బేసిన్ దగ్గరికెళ్ళి కడుక్కుని వచ్చాడు

టేబిల్‌కి ఒక చివర మైత్రేయి కూర్చుని వుంది ఆమె కెదురుగా రెండో చివర కూర్చుని వున్నాడు కల్యాణ్ మైత్రేయికి ఎడంచేతి పక్క విజయ్ కుడిచేతి పక్క ఆనంద్ కూర్చుని వున్నారు ఆనంద్ పక్కన శామ్యూల్ విజయ్ పక్కన ప్రకాష్ కూర్చున్నారు

# సాక్షి

ఏమిటో అందరి బొమ్మలు గిస్తాడు కాని నా బొమ్మ గియమంటే ఎప్పుడూ గియ్యడు ప్రకాష్ అన్నాడు శామ్యూల్ విచారంగా మొహంపెట్టి

నువ్వు చిత్రం గియించుకుంటే సరిపోదు నల్లరాతితో శిలా విగ్రహం చేయించుకుంటే చాల నేచురల్‌గా వుంటుంది అన్నాడు ప్రకాష్ నవ్వుతూ

అందరూ గొల్లున నవ్వేరు

ఉడుక్కుంటున్నట్టుగా మొహం పెట్టేడు శామ్యూల్

అంటే నువ్వెప్పుడూ అందమైన వాళ్ళ బొమ్మలే గిస్తావన్న మాట అన్నాడు ప్రకాష్‌తో

నువ్వెప్పుడు అందగాడివి కావని ఎవరన్నారు' ఎదురు ప్రశ్న వేశాడు ప్రకాష్ మళ్ళీ అందరూ గొల్లున నవ్వేరు

గ్లాసులో వున్న విస్కీ వంక విషాదంగా చూసాడు శామ్యూల్

ఒక రనక్కర్లేదు లేవోయ్ నేనంత అందగాణ్ణి కాదని నాకు తెలుసు కాని నీలాగే అందమైన వాటని ఆస్వాదించే కళాహృదయం నాక్కూడా వుందని తెలుసుకో అన్నాడు నిష్ఠూరంగా

ఎథింగ్ ఆఫ్ బ్యూటీ ఈజ్ జాయ్ ఫరెవర్ అన్నాడు అప్పటవరకూ వారిద్దరి సంబాషణ మౌనంగా వింటున్న ఆనంద్ ఏదో ఆలోచన వచ్చిన వాడిలా

యు ఆర్ రాంగ్ ఎ థింగ్ ఆఫ్ బ్యూటీ ఈజ్ జాయ్ ఫర్ ఎవ్వరిబడి విస్కీని ఒక్క గల్ప్‌లో కొట్టేసి ఖాళీ గ్లాసులోంచి మైత్రేయి వంక చూస్తూ అన్నాడు శామ్యూల్

ఒక్క క్షణం పాటు టేబిల్ దగ్గర పిన్‌డ్రాప్ సైలెన్స్ ఏర్పడింది ఆ ఒక్కక్షణంలో నే విజయ్ చూపులు అందర్నీ నిశితంగా పరీక్షించాయి

శామ్యూల్ ఈ మాట అనగానే మైత్రేయి చూపులు కిందకి వాలిపోయాయి కల్యాణ్ మొహం పాలిపోయింది డాక్టర్ ఆనంద్ చిరాగ్గా శామ్యూల్ వంక చూసాడు లాయర్ ప్రకాష్ కూడ కోపంగా శామ్యూల్ వంక చూసాడు

అందరి కంటె ముందుగా తేరుకున్నవాడు కల్యాణే!

యు ఆర్ పెర్‌ఫెక్ట్లీ రైట్ మిస్టర్ శామ్యూల్ ఎ థింగ్ ఆఫ్ బ్యూటీ ఈజ్ జాయ్ ఫర్ ఎవ్విరిబడీ ఫర్ ఎగ్జాంపుల్ లియొనార్డో వేసిన మోనాలిసా లాంటి పెయింటింగ్ చూసినప్పుడు అందరికీ ఒకే విధమైన ఆనందం కలుగుతుంది అన్నాడు శామ్యూల్‌తో

మన ప్రకాష్ కూడ ఏదో రోజు లియొనార్డో లా పేరు తెచ్చుకుంటాడనే నమ్మకం నాకుంది అన్నాడు శామ్యూల్ ప్రకాష్ వంక ప్రశంసాపూర్వకంగా చూస్తూ




ఎప్పుడో ఎందుకు? యిప్పుడేస్తున్న చిత్రంతో నే ఆ పేరు రావచ్చు ఎందుకంటే లియొనార్డో వేసిన మోనాలిసా బొమ్మకూడ ఒక జమిందారు భార్యదే అన్నాడు ప్రకాష్ మైత్రేయి వంక తిరిగి

మళ్ళీ ఇబ్బందిగా ఫీలయింది మైత్రేయి ప్రకాష్ చేస్తున్నది ఆత్మస్తుతో పరస్తుతో అర్థం కాలేదామెకి

డాక్టర్ ఆనంద్ మూడో పెగ్గు పూర్తి చేసి ఖాళీ గ్లాసు టేబిల్‌మిద పెట్టాడు అతను ఏ సందర్భంలోనూ మూడు పెగ్గుల కంటె ఎక్కువ తీసుకోడు శామ్యూల్ మాత్రం బాగా నిషాగా వున్నాడు ఇందాక ఒకే గల్ప్‌లో గ్లాసులోని ద్రవమంతా తాగేయడం వల్ల కొద్దిగా తూలుతున్నాడు

టుమారో ఎ సర్‌ప్రైజ్ యీజ్ ఎవైటింగ్ అజ్ అన్నాడు కల్యాణ్ ఉన్నట్టుండి

వాటిజ్ యిట్ అన్నాడు ప్రకాష్ ఉత్సాహంగా

ఎ సర్‌ప్రైజ్ అన్నాడు విజయ్ నవ్వుతూ

నంబర్ త్రీ ఏమో అన్నాడు శామ్యూల్ వినీవినబడనట్టుగా

కాదు నెంబర్ ఫోర్ టక్కున అన్నాడు డాక్టర్ ఆనంద్

మళ్ళీ అందరూ గొల్లున నవ్వేరు

కమాన్ ఎనదర్ పెగ్ ఫర్ యువర్ జోక్ అంటూ ఒక చేత్తో సీసానందుకుని రెండో చేత్తో ఆనంద్ ఖాళీ చేసిన గ్లాసునందుకో బోయాడు శామ్యూల్

ఆనంద్ గ్లాసుమిద అరచేతిని మూతలా పెట్టేడు

నేను మూడుకంటే ఎక్కువ తీసుకోను అన్నాడు నిదానంగా

అరె! క్యా బాత్ కర్తేహో! మరో పెగ్గు తీసుకున్నంతలో ఏమయిపోవు లేవోయ్ అంటూ చొరవగా అతని చేతికింద గ్లాసు లాక్కోబోయాడు శామ్యూల్

ప్లీజ్ ఒకమారు చెప్పగానే వినండి నో మోర్ డ్రింక్ ఫర్ మి అంటూ చేతికింద గ్లాసుని మరింత గట్టిగా పట్టుకున్నాడు ఆనంద్

ఫై డోంట్ బి చైల్డిష్ హేవ్ సమ్ టేబిల్ మేనర్స్ అంటూ గ్లాసుని మరింత గట్టిగా లాక్కోబోయాడు శామ్యూల్

చెక్ యువర్ లాంగ్వేజ్! సరియస్‌గా అన్నాడు డాక్టర్

వాడ్యుయు మీన్ బైదట్? గ్లాసుని వదిలేసి డాక్టరు వంక తీక్షణంగా చూసాడు శామ్యూల్

ఆనంద్ కూడ ఏమి తగ్గలేదు

వాట్ డు యు మిన్ బై టేబిల్ మేనర్స్? అంటూ ఎదురు ప్రశ్న వేశాడు శామ్యూల్‌ని

ఇద్దరూ సీరియస్‌గా ఒకరొకరు చూసుకుంటూ చాలసేపుండి పోయారు

మరికొంతసేపు వారినలా వదిలేస్తే పరిస్థితి విషమిస్తుందని గ్రహించాడు కల్యాణ్

వెల్ ఫ్రెండ్స్ లెటజ్ హేవ్ అవర్ డిన్నర్ నౌ అంటూ టేబిల్ మధ్యనున్న పళ్ళబుట్టలోంచి ఏపిల్ పండు నొకదాన్ని తీసి ముక్కలుగా కొయ్యసాగాడు చాకుతో

అతని ఉద్దేశాన్ని గ్రహించిన మైత్రేయి టేబిల్‌మిదున్న బాటిల్స్‌ని పక్కన పెట్టేసి డిన్నర్ సర్వ్ చేయసాగింది

సీరియస్‌గా ముఖాలు తిప్పేసుకుని డిన్నర్ వైపు దృష్టి సారించా రందరూ డిన్నర్ పూర్తయేసరికి రాత్రి పదకొండయింది అందరూ ఎవరి గదుల్లోకి వారు నిష్క్రమించారు

గదిలో ప్రవేశించగానే టవర్ బొల్ట్ బిగించి మంచం మిద వాలిపోయాడు విజయ్ అతనంత ఉత్సాహంగా లేడు ఎన్నో అర్జంటు పనులు వాయిదా వేసి వచ్చాడతను కాని యిక్కడ చూస్తే ఏదో వెరైటి ఎంటర్‌టైన్‌మెంటు కోసం పిలిచినట్టున్నాడు కల్యాణ్ అందరి ఉద్యోగాల్లాంటి ఉద్యోగం కాదు పోలీసు ఉద్యోగ మంటే• అందుకే మర్నాడుదయాన్నే కల్యాణ్‌తో చెప్పి తిరుగు ప్రయాణమై పోదామని నిర్ణయించుకున్నాడు పడుక్కోబోయే ముందు

(ఇంకాఉంది)




# ఆటోమేటిక్ కట్‌అవుట్ రిలే మోటార్ కాలిపోకుండా అతిగా వేడెక్కకుండా జాగ్రత్త వహిస్తుంది








Parade/BE/8544A

**JOHNSON®** వేరిమిక్స్ / వేరిమిక్స్ మార్క్ II

–ధృడమైనవి,పటిష్టమైనవి పూర్తి భద్రత కల్గియున్నవి

---

ప్రత్యేక ప్రవేశ ఆకర్షణ!

## ఉచితం

## ప్రెషర్ పాన్



ప్రతీ **JOHNSON®**

వేరిమిక్స్ / వేరిమిక్స్ మార్క్ II తో

ఈ ఆఫర్ ఆంధ్ర ప్రదేశ్‌లో మాత్రమే, స్టాకులు ఉన్నంత వరకూ పరిమితం

జాన్సన్ వరిమిక్స్/వరిమిక్స్ మార్క్ II లకు ఆంధ్రప్రదేశ్‌లో పంపిణీదార్లు

మహావీర్ కంబైన్స్, 5-9-1115, కాంచనజంగకాంప్లెక్స్, కింగ్‌కోఠిరోడ్, హైద్రాబాద్ 500 001 ఫోన్ 231198 / 235856

బొమ్మల సీరియల్

# సీక్రెట్ ఏజంట్ విక్రమ్

6

ఆ కాపలాదారుతో విక్రమ్-

భూమిలో మందు పాతరలు ఏవైనా ఉన్నాయా?

లేవు

29/6

నిజం చెప్పు!

అ- అవును! మందు పాతరలు ఉన్నాయి

మందు పాతరలు లేని మార్గం చెప్పు నీ నుంచి ఈ సారి మాకు నిజమే కావాలి

దూరంగా కనిపించే ఆ గోపురం వైపు నేరుగా నడవండి ప్రతి 20 అడుగులకి రెండు అడుగుల చొప్పున దూకి వెళ్ళండి






















# మానవతకి మరో పేరు ఆంటి

బాబా ఆంటిగా ప్రపంచ వ్యాప్తంగా పేరుపొందిన శ్రీ మురళీదర్ దేవీదాస్ ఆంటి కుష్టు రోగుల సేవకి తమ జీవితాన్ని నిస్వార్ధంగా అంకితం చేసిన మహావ్యక్తి తమ సేవా కార్యక్రమాలద్వారా ఇప్పటికి ఆయన దాదాపు 2 లక్షల మంది కుష్టువ్యాది పీడితులని ఆరోగ్యవంతులని చేసారు

శ్రీ ఆంటి మహారాష్ట్రలో నాగపూర్‌కి 120 కి మి దూరంలో ఉన్న వరోరాలో 1914లో జాగిర్‌దార్ల వంశంలో జన్మించారు పద్నాలుగేళ్ల ప్రాయంలో ఇల్లు వదలి వెళ్లి గోండులతో నివసించి వేటలో ప్రావీణ్యాన్ని సంపాదించారు ఎన్నో సాహసకృత్యాలు చేశారు అనంతరం న్యాయ శాస్త్ర పరిక్షలో ఉత్తీర్ణుడై న్యాయవాదిగా, వరోరా పురపాలక సంఘం అద్యక్షుడిగా పని చేసారు ఒకనాడు ఆయన అత్యంత దయనీయస్థితిలో ఉన్న ఒక కుష్టురోగిని చూసి తమ జీవితాన్ని కుష్టువ్యాధి పీడితుల సేవకి అంకితం చేయాలని నిర్ణయించుకున్నారు అందుకోసం శ్రీ ఆంటి కుష్టునివారణ సంస్థలో శిక్షణ పొందారు 1950లో శ్రీ ఆంటి మహారోగ్ సేవాసమితిని స్థాపించి తమ ఆడంబర జీవితానికి స్వస్తి చెప్పి వరోరా సరిహద్దులలో ఉన్న ఆనందవన్‌కి కుటుంబంతో సహా ఒక గుడిసెలోకి తమ మకాం మార్చారు తమతో పాటు ఆయన ఆరుగురు కుష్టురోగులని కూడా అక్కడికి తీసుకు వెళ్లారు అలా ప్రారంభమైన ఆనందవన్ శ్రీ ఆంటి నిరంతర కృషి ఫలితంగా నేడు 450 ఎకరాల విస్తీర్ణం కల ఒక సముదాయంగా రూపుదిద్దుకున్నది అందులో పంట పొలాలు

2 500 మంది కుష్టురోగులు, అంగ వికలురైన వారికి నివాస గృహాలు 500 మంది విద్యార్థులు గల ఒక వ్యవసాయ కళాశాల పదమూడు వందల మంది విద్యార్థులు ఉన్న ఒక డిగ్రి కళాశాల ఉన్నాయి

ఈ ఆనందవన్‌కి సమీపంలోనే అశోకవన్ సోమనాద్ అనే మరో రెండు కేంద్రాలని శ్రీ ఆంటి స్థాపించారు కుష్టు వ్యాదినించి విముక్తి పొందిన వారు వాటిని నిర్వహిస్తున్నారు అవి ఆనందవన్ కర్చుని కొంత బరించడానికి అందులోని ఆదాయం లేని పథకాలు ఆసుపత్రులు మొదలైన వాటి నిర్వహణ కోసం నడుపబడుతున్న కేంద్రాలు చంద్రాపూర్‌కి 200 కి మి దూరంలో ఉన్న హేమల్ కాసాలో ఆదివాసుల కోసం ఒక కేంద్రాన్ని నిర్వహిస్తున్నారు పదేళ్ళ కిందట 4 వేల మంది రోగులతో ప్రారంభమైన ఈ కేంద్రం ఇప్పుడు అంతకి పదింతల మంది రోగులకి సేవ చేస్తున్నది

బాబా ఆంటి 1942లో మహాత్మాగాంది ఆచార్య వినోబాబావేలతో కలసి క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్న దేశభక్తుడు ఇప్పుడు ఆయన జాతీయ సమైక్యత కోసం 1985 డిసెంబరు 24న కన్యాకుమారి నించి బారత దేశ యాత్ర ప్రారంబించారు ఈ సమైక్య నవ బారత నిర్మాణ యాత్రలో ఆయన జనవరి 14 నించి 25 వరకు ఆంద్ర ప్రదేశ్‌లో పర్యటించారు జనవరి 23న హైదరాబాదుల ఆయనని ఆం ప్ర గవర్నర్ కుమారి కుముద్ బెన్ జోషి ఘనంగా సత్కరించారు

బాబా ఆంటి నిరుపమాన సేవలకి గుర్తింపుగా ఆయనకి 1971లో పద్మశ్రీ, 1978లో రాష్ట్రభూషణ్ 1979లో బజాజ్ అవార్డు 1980లో నాగపూర్ విశ్వవిద్యాలయం నించి డి లిట్ 1981లో కృషిరత్న 1984లో డామియన్- డట్టన్ అవార్డు 1985లో మెగ్‌సేసే అవార్డు లబించాయి

బాబా ఆంటి సేవా కార్య క్రమాలలో ఆయన బార్య శ్రీమతి సాదనాతాయి కుమారులు డా వికాస్ ప్రకాశ్‌లు కూడా అంకిత బావంతో కృషి చేస్తున్నారు

–ఒ వి

హైదరాబాదులో జనవరి 23న బాబా ఆంటిని సత్కరిస్తున్న ఆంధ్రప్రదేశ్ గవర్నర్ కుమారి కుముద్‌బెన్ జోషి



# ఇదేనా పరిష్కారం

అడివి సూర్యకుమారి

"ఎంత సుదినం రా! రా! ఇంతకాలానికి గుర్తువచ్చానా? స్నేహితురాలిని సాదరంగా ఆహ్వానిస్తూ అంది సరోజ

ఆ మాటే నేనూ అంటే ఏం సమాదానం చెబుతావో చెప్పు చూద్దాం అంది సీత

సరోజ అమె చేతిలోని బాబుని అందుకొని లోపలికి దారితీస్తూ, ఉదయాన్నే వెళితే ఆ బస్సులంది ఇంటికొచ్చేసరికి ఏడవుతోంది ఇంటికి రాగానే పిల్లలకి స్నానాలు వంట భోజనాలు చదివించటం– ఇవన్నీ అయ్యేసరికి తొమ్మిది దాటుతోంది తెలుసా! ఆదివారం శలవన్న మాటేగాని ఈరోజెంత పని ఉందో నువ్వే చూద్దువుగాని మిగతా పిల్లలేరి? వాళ్ళని కూడా తీసుకు రావాల్సింది మీ వారిని కూడా రమ్మనక పోయావా? కూర్చో కాఫీ కలుపుతాను అంటూ కిచెన్‌లోకి దారి తీసింది సరోజ

ఇప్పుడే త్రాగాను కాని కాస్సేపిలా కూర్చొని కబుర్లు చెప్పు మళ్ళీ నేను వెంటనే వెళ్ళిపోవాలి పిల్లలేరి? నిశ్శబ్దంగా ఉన్న ఇల్లు చూస్తూ అడిగింది సీత

గాంధి ఎక్సర్ బాగుంటుంది చూడమన్నారట వాళ్ళ టీచర్ నిన్నటి నుండి ఒకటే గొడవ నన్ను రమ్మని ఈయన గొడవ కాని ఈ పనంతా వదిలేసి ఎట్లా? మళ్ళీ వారందాకా వీలుకాదు అందుకని వాళ్ళ డాడినీ తీసుకొని వెళ్ళిపోయారు నేను ఆగిపోయాను మద్యాహ్నానికి వస్తారుగా, నువ్వీపూట బోజనం చేసిగాన్ని వెళ్లేందుకు వీల్లేదు బాబుని సీత కిచ్చి కాపీ కలపసాగింది

ఏమిటి బాబు వళ్ళు వెచ్చగా ఉంది జ్వరమా? అడిగింది సరోజ

ఔను రెండు రోజులు నుండి జ్వరం విరోచనాలు డాక్టరు దగ్గరికని బయలుదేరిలా వచ్చాను ఆయనింకా రాలేదు సరే మీ యిల్లు యిక్కడే 'గదా ఆయనొచ్చేదాకా కాస్సేపు నీతో మాట్లాడవచ్చని యిలా వచ్చాను

ఊ! అయితే నీ జీవితంలో మార్పేమి లేదన్నమాట మీ ఆయ నెలా ఉన్నాడు?

శుక్రవారం రాత్రి వెళ్ళారు బహుశ రేపుదయం రావొచ్చు అపీసుంది కాబట్టి వస్తారు లేకపోతే అలా ఎన్ని రోజులైనా పేకాడుతూ ప్రపంచాన్ని పెళ్ళాన్ని పిల్లలను ఇంటిని అవసరాలను (మావిసుమా!) మరిచిపోయి అన్నింటికి అతీతంగా ఉండగల స్థిత ప్రజ్ఞులాయన చిరునవ్వుతో అంది సీత అదే సీతలోని ప్రత్యేకత ఎంత ఇబ్బందిలోనైనా కష్టాల్లోనైనా కడుపులో బడబాగ్ని దాచుకొని పైకి చల్లగా నవ్వే వ్యక్తులుంటారనటానికి సీతే నిదర్శనం ఎలాంటి క్లిష్టస్థితినైనా చిరునవ్వుతో ఎదుర్కొగల వ్యక్తిత్వం ఆమెది

అసలు నీ మంచితనం నీ అమాయకత్వం, నీ నెమ్మది యింత దూరంతెచ్చింది నువ్వు గట్టిగా పోట్లాడో ఏడిచో, ఎలాగోలా అతన్నా దురలవాటు నుండి తప్పించలేవూ? జీతం సొంతం యిస్తున్నాడా? లేదా? కాఫీ యిచ్చి తనూ తసుకొని ఎదురు కుర్చీలో కూర్చుంది సరోజ

ఒక్కో నెల సగం యిస్తారు, మరో నెల అదీ యివ్వరు గట్టిగా అడిగితే చీవాట్లు దెబ్బలు నిట్టూర్పుతూ అంది

ఇంకా కొడుతూనే ఉన్నాడా? ఏం మనిషే? నువ్వెందుకు ఎదురు తిరగవో నా కర్థంగాదు నిన్ను తిట్టే తిట్లు కొట్టే దెబ్బలు చూడలేకే నేను మీ ప్రక్క ఇల్లు ఖాళీచేసి యింత దూరం వచ్చింది ఆ రోజు నిన్నలా కొడుతూంటే అడ్డం వచ్చారనేగా మా వారిని అంతమాటన్నాడు నీ మొహం చూసి వదిలేశారు గాని లేకపోతె పోలీసులకి పట్టించేవారు

ఔను ఆయన కారోజు విచక్షణా జ్ఞానం నశించింది అందుకే ఇప్పటికీ అన్నయ్యగారి మొహం చూట్టానికి సిగ్గుగా ఉంది

ఆయనలా పట్టించుకొనే మనిషికాదు ఇప్పటికీ నువ్వు గుర్తువచ్చినప్పుడల్లా బాదపడతారు అంది సరోజ వాడికి పాలు త్రాగిస్తావా? ఉన్నాయి అడిగింది

వద్దు ఇప్పుడే త్రాగాడు ఇంక వస్తామరి డాక్టరు గారొచ్చారేమో! లేస్తూ అంది సీత

ఉండు నేను కూడా వస్తాను అంది సరోజ కప్పులు కడుగుతూ

వద్దు! నువ్వు పని చూసుకో నేను చూపించుకొని వెళ్ళిపోతాలే

పని తర్వాత చేసుకోవొచ్చు! అని గబగబ తలుపులు వేసి చీరె మార్చుకొని బాగ్ తీసుకొని తనూ బయలుదేరింది సరోజ ఇంటికి తాళం వేసి హాస్పిటల్ దగ్గరవటంతో మాట్లాడుతూ నడక సాగించారు

మీ అత్తగారు బాగుందా? అడిగింది సరోజ

ఆహా! నిక్షేపంలా ఉంది ఇంకా నా పెళ్ళిలో మావాళ్ళివ్వాల్సిన డబ్బు గురించి దెప్పుతూనే ఉంది అమ్మా నాన్నని చూసి ఐదేళ్ళయింది నన్నుపంపించలేదు వాళ్ళని రానివ్వలేదు

ఏమిటి? ఆ రెండు వేల గురించేనా! అబ్బ! ఏం మనుష్యులు?

నాన్న పరిస్థితి తెలిసిందేగా పెళ్ళికెదిగిన చెల్లెళ్ళిద్దరున్నారు కాలేజీలో చదివే తమ్ముడు వాళ్ళ పరిస్థితి అంతంత మాత్రంగానే ఉంది డబ్బు సమయానికి సర్దుబాటు కాక యివ్వలేక పోయ్యారు నా మూడుపురుళ్ళ ఖర్చు నాన్నే భరించారు కదా! ఎంత ఖర్చయిందప్పుడు? అవన్నీ లెక్కలోకి రావు అసలు నాన్నని ఇబ్బంది పెట్టలేకే ఆపరేషన్ చేయించుకుంది అప్పుడెంత గొడవ చేశారో వీళ్ళు నీకు తెలుసుగా?

ఔను పాల డబ్బా కొనటానికి టబాణా లేకపోయినా పిల్లల్నింకా కంటానికి మటుకు రెడియే ఛీ! ఛీ! ఇలాంటి మనుషుల్లో మార్పు ఎప్పుడొస్తుందో నాకర్థం కాదు అంది సరోజ

హాస్పిటల్ కొచ్చేశారు ఆదివారం ఉదయంపూట మాత్రమే చూస్తారాయన అప్పటి కద్దరే పెషెంట్లున్నారు వాళ్ళని చూడగానే సీత బాబుని తను కెళ్ళింది బాబుని షరీక్షచేసి ఇంజక్షన్ చేసి మందులు వ్రాసిచ్చారు డాక్టర్

బాబుకి పాలు యిస్తున్నారామ్మా? అడిగాడు డాక్టర్

గేదెపాలండి

వద్దు మానెయ్యండి ఈ డబ్బాపాలు వాడండి అంటూ వ్రాసిచ్చాడు పీజు చెల్లించి బైట కొచ్చారు హాస్పటల్‌కి ఎదురుగానే ఉంది మెడికల్ షాపు అటు వైపు నడిచింది సరోజ

ఇప్పుడు కాదులే తర్వాత తెప్పస్తాలే వెనకాల నుండి అంది సీత అక్కడే నిలబడిపోయి

ఆశ్చర్యంగా వెనక్కి తిరిగింది సరోజ

పిల్లాడికి రోగమలా పెట్టుకొని మందు లెప్పుడో కొంటుందిట ఎప్పుడు వేయాలను కుంటున్నావు? నడు నడు ఆమెరెక్క పుచ్చుకొని మెడికల్ షాపు మెట్లెక్కింది సరోజ

ప్రిస్క్రిప్షన్ చూసి మందులు పాలడబ్బా యిచ్చాడు బిల్లు అరవై రెండు రూపాయల ముప్పై పైసలయింది సరోజ బ్యాగ్‌లో నుండ వంద రూపాయల కాయితం యిచ్చి అవన్నీ ప్యాక్ చేయించింది చిల్లర తీసుకొని బైట కొచ్చారు

ఇప్పుడెందుకు అనవసరంగా నీకంత ఖర్చు? అబిమానంగా బాదగా అంది సీత

చాల్లే ఊరుకో పిల్లాడి కలా జ్వరం విరోచనాలవుతూంటే మందు లివ్వకుండా చంపుతావేమిటి? అసలు రెండు రోజులు నుండి అలా అవుతూంటే వెంటనే తీసుకు రావద్దా! ఇంకానయం డీహైడ్రేషన్ కాలేదు అంటూ రిక్షాకేకేసింది సరోజ

ఇద్దరూ రిక్షా ఎక్కారు.

"నన్ను ఇంటి దగ్గర దింపెయ్యరాదూ?" "భోజనం చేసి వెళుదువుగానిలే" అంది సరోజ. ఇంటికి రాగానే బాబుకి ప్రక్క వేసి పడుకోబెట్టారు. సరోజ వంటపని చేస్తుండగా తానూ సాయం చేసింది సీత. సరోజ బట్టలుతుకుతూంటే అవన్నీ ఆరేసింది. ఒంటిగంటకల్లా పనైపోయింది. భోజనాల కూర్చున్నారిద్దరూ.

"ఊ అయితే అప్పులన్నీ మీ నెత్తినే రుద్దుకున్నారన్న మాట. మీ మరిదిని కూడా కొన్ని తీర్చమనక పోయారా? హక్కులేగాని బాధ్యత అక్కర్లేదా?"

"ఈయన అడగలేదు. అతనివ్వలేదు. ఆడపడుచు పెళ్ళికైన అప్పులన్నీ నిన్న మొన్నటిదాకా తీరుస్తూ వచ్చాం. ఇప్పుడింక మా పిల్లలు, మా ఖర్చులు, మా అప్పులు మొదలయ్యాయి. ఆర్థిక ఇబ్బందులతో మనసులు పాడైపోయాయి. సంసారంలో శాంతి సుఖం లోపించాయి. అసలు నా జీవితంలో ఏనాడైనా శాంతిని, సుఖాన్ని పొందుతానంటావా?" ఆర్తిగా అడిగింది సీత.

ఏం చెబుతుంది తను? నిజమే. మధ్య తరగతి బ్రతుకులిలాగే ఉన్నాయి. భేషజాలకి పోయి "ఘనంగా పెళ్ళి చేశారని" అందరూ అనుకోవాలని అప్పులు చేసి పెళ్ళిళ్ళు చేయటం, అవి తీర్చుకోలేక, ఆ బాధలు తట్టుకోలేక దురలవాట్లకి లోనవటం. సీత భర్త సత్యమూర్తి ఈ కోవకి చెందిన వాడె. చెల్లెలిపెళ్ళికైన అప్పులు తీర్చలేక అతనెన్ని బాధలు పడ్డాడో తమకి తెలుసు. అప్పుల వాళ్ళింటి

Bali

కొస్తారని అతను కొన్ని రోజులు యింటికే వచ్చేవాడు కాదు ఇంట్లో పిల్లలు రోగిష్టి తల్లి వాళ్ళ అవసరాలు అతని జీతం సరిపోయేది కాదు ఈ కలతలకి తట్టుకోలేక అతడు తాగుడికి దాని తర్వాత పేకాటకి బానిసయ్యాడు పేకాటలో అడపాదడపా అతనికి డబ్బులొచ్చేవి అప్పుడు మటుకు ఇంటి కొచ్చేవాడు సోమవారం ఉదయం మటుకుఅతను కన్పిస్తాడు మధ్య రోజుల్లో వస్తే వస్తాడు లేకపోతే లేదు అప్పుల వాళ్ళొచ్చారని చెబితే చాలు అగ్గిమీద గుగ్గిలంలా అయి సీతని బాదేవాడు పిల్లల్ని తిట్టేవాడు సీత ఒంటిమీది బంగారం కాస్తా అప్పుల వాళ్ళకి కట్టేసింది అతనడిగినప్పుడల్లా డబ్బివ్వలేదని సీతని నరకయాతన పెట్టేవాడు అతనిచ్చే జీతం డబ్బుల్లోనే ఎంతో పొదుపుగా సాగించేది సీత సంసారం అయినా చాలేవి కావు అడపాదడపా తను సాయం చేసేది

గతమంతా కళ్ళముందు మెదిలింది సరోజకి నిట్టూర్చింది సీతబ్రతుకులో ఏం మార్పూ లేదు అప్పుడెలా వుందో ఇప్పుడూ అంతే!

అరె! అప్పుడే మజ్జిగ పోసుకున్నావేం? వద్దు ఇంక చాలు పిల్లలేం చేస్తున్నారో యింట దగ్గర గబగబ తినేసి చెయి కడుక్కుంది సీత కంచాలవీ తీసేసి వంటిల్లు సర్ది హాల్లో కొచ్చారిద్దరూ పిల్లాణ్ణి తీసుకొంది సీత వెళ్తానంటూ లేచింది

ఉండు ఒక్క క్షణం! రిక్షా పిలుస్తా అంది సరోజ

అక్కర్లేదు ఎంత దూరమని! గట్టిగా నడిస్తే ఎది నిముషాలు

నీ మొహం ఇంత ఎండలో జ్వరంతో ఉన్న పసివాణ్ణి వేసుకొని నడుస్తావా? వద్దు వాకిట్లో కెళ్ళి రిక్షా కేకేసింది పాలడబ్బా మందుల పాకెట్టు రిక్షాలో పెట్టింది సీత రిక్షా ఎక్కగానే ఆమె చేతిలో వంద రూపాయిలు పెట్టింది ఎందుకిది? తిరిగి ఆమెకి యివ్వబోయింది సీత వద్దు ఉండనీ తర్వాతిద్దువుగానివిలే! ఉంచుకో అంది సరోజ

# ఇదేనా పరిష్కారం?

సీత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి కృతజ్ఞతా భారంతో ఆమె పెదవులు వణుకుతున్నాయి నన్నెంత కాలం ఋణగ్రస్తురాల్ని చేస్తావు? నీ దగ్గర తీసుకోవటమే గాని నేనేనాడైనా తిరిగిచ్చానా? అసలిలా ఎన్నిసార్లిస్తావు? ఎంత కాలం యిస్తావు? కళ్ళు తుడుచుకుంటూ అంది సీత

నీ మొహం మన మధ్య ఋణాలేమిటి? అదేం మనసులో పెట్టుకోకు పిల్లవాడు జాగ్రత్త వుంటాను చెయ్యి ఊపుతూ అంది సరోజ రిక్షా మలుపు తిరిగే దాకా వాకిట్లో నిలబడింది

తను చేసే సాయం ఏ మూలకి? అయినా తను మాత్రం ఎంతని ఇవ్వగలదు? ఈ జీవితాలింతేనా యింక? అతనిలో మార్పు రాదా? ముద్దబంతిలాంటి సీత ఎలా మారిపోయింది? నల్లగా గొగు కాదలా ఉందిప్పుడు ఆ ఎల్లాడు కూడా ఆరు నెలల ఎల్లాడిలా లేడు పీలగా ఏ మూడు నెలల ఎల్లాడో అంటే నమ్మేట్టున్నాడు ఏమ్మనుషులు? ఏం బ్రతుకులు? ఆలోచనలతో తానింకా రోడ్డు ప్రక్క అలా నిలబడిన సంగతే మరిచిపోయింది సరోజ

ఏమిటీ? ఎందుకిలా ఎండలో నిలబడ్డావ్? భర్త భుజం మీద చేయి వేయటంతో ఉలిక్కిపడి చూసింది సరోజ ఎల్లలిద్దరూ అప్పుడే లోపలి కెళ్ళారు తన పరధ్యానానికి నవ్వుకుంటూ అతని వెనకాలే లోపలికి నడిచింది సరోజ

ఆ! ఏం లేదు సీత వస్తే రిక్షా ఎక్కించ

ఆవిడ గురించి ఆలోచిస్తూ రోడ్డు మీదిలాగే ఎంత సేపటి నుండి నించుచున్నావో నవ్వుతూ అడిగాడు సరోజ భర్త సుధాకర్

మీరు మరిను రిక్షా అలా వెళ్ళింది మీరిట్లా వచ్చారు కాళ్ళు చేతులు కడుక్కురండి వడ్డించేస్తున్నాను! వంటింట్లోకి వెళ్ళింది సరోజ

వారం రోజులు గడిచాక ఆ రోజు ఆఫీసు నుండి ఇంటి కొచ్చిందప్పుడే సరోజ పిల్లలిద్దరూ పుస్తకాలు ముందు పెట్టుకొని చదువుకుంటున్నారు గబగబ స్టౌ అంటించి వాళ్ళిద్దరికీ ముందు పాలు వేడి చేసిచ్చింది కుక్కర్ పెట్టి మొహం కడుక్కొని వచ్చి కాఫీ కలుపుకుంటుండంగా సుధాకర్ కూడా వచ్చాడు అతన్ని చూసి కాఫీ అతనికి కలిపిచ్చింది సరోజ అతను రాగానే పిల్లలిద్దరూ పుస్తకాలు వదిలేసి తండ్రి మీద పడ్డారు కాఫీ కప్పు భార్య చేతికిచ్చి అతను వాళ్ళిద్దరినీ ఎత్తుకొని గదిలోకి వెళ్ళిపోయాడు

కాస్త కాఫీ అయినా ఆయన్ని తాగనివ్వరా? అంది సరోజ వాళ్ల వెనకాలే నడుస్తూ

సరోజగారూ! వాకిట్లోంచి పిలవటంతో బైటికి చూసింది సరోజ ప్రక్కింటి మీనాక్షి

ఎమిటండీ? హాల్లోకి వచ్చింది సరోజ

ఇది విన్నారా? మీ స్నేహితురాలు సీత ఎలుకల మందు మింగింది ప్రొద్దున ఆ మొగుడు ముండా కొడుకు చచ్చేట్టు కొట్టాట్ట భరించలేక త్రాగేసిందిట హాస్పటల్లో చేర్చారు మా మహిళా మండలి వాళ్లమంతా సాయంకాలమే వెళ్ళాం అతని మీద కేసు పెట్టించి జైల్లోకి తోయిస్తాం చూడండి

సరోజ చేతిలో కాఫీ కప్పు క్రింద పడింది తను వింటోంది నిజమా! మీరు వెళ్ళివచ్చారా?ఎలా వుంది సీత యిప్పుడు? ఎలాగో గొంతు పెగుల్చుకొని అడిగింది

స్టమక్ వాష్ చేశారనుకోండి ప్రమాదం తప్పింది అతని మీద కేసు పెట్టించి జైల్లో పెట్టించాలని మా ప్రెసిడెంటుగారు చాలా పట్టుదలగా ఉన్నారు భగవంతుడి దయవల్ల బ్రతికింది గాని లేకపోతే ఆ త్రాష్టుడామెను పొట్టన బెట్టుకొన్నట్లేగా! ఇంకా ఈ మగవాళ్ల దౌర్జన్యం ఎంత కాలం ఇలా సాగుతుందో! ఒక్కడికి కనక తగిన శాస్తి జరిగితే మిగతా వాళ్లకి బుద్ధి రావొచ్చు నేను హాస్పటల్కి వెళ్తున్నా మీరు వస్తారేమోనని

అలాగే వస్తాను మీరు పదండి అంది సరోజ మీనాక్షి వెళ్ళిపోయింది

ఆటో పిలిచి తలుపులు వేసి పద అన్నాడు సుధాకర్ కలలో నడిచినట్లుగా అతని వెనకాలే వెళ్ళి ఆటో ఎక్కింది సరోజ హాస్పటల్ కొచ్చారు హాల్లో పోలీసులున్నారు

సీత అత్తగారు ఆవిడ చేతిలో పసివాడు ఆడపిల్లలు సరోజని చూడగానే ఆంటీ అంటూ ఏడుస్తూ దగ్గరి కొచ్చారు వాళ్లని చూడగానే సరోజకి దుఃఖం ఆగింది కాదు ముసలావిడ బుడి బుడి దీర్ఘాలు తీస్తోంది పోయేదేదో గుట్టు చప్పుడు కాకుండా పోక ఈ రబస ఏమిటీ? ఈ పోలీసు లేమిటి? నా బిడ్డ నేం చేస్తారో? సరోజమ్మ తల్లీ అంది

ఆ స్థితిలో కూడా కోడలి గురించి ఆలోచించని



# పోస్టాఫీస్ పొదుపు పుస్తకంలో మీకూ చోటుంది



## ఈ ప్రయాణంలోని సుఖాన్ని, శుభాన్ని చూడండి :

* ఏ రకమయిన సర్టిఫికెట్ల అవసరం లేకుండా పోస్టుకార్డు కొనుక్కున్నంత సులభంగా ఈ పత్రాల్ని కొనుక్కోవచ్చు
* బ్యాంకుల కన్నా హెచ్చువడ్డీ లభిస్తుంది
* దాచిన డబ్బుకు భారత ప్రభుత్వం రక్షణ గడువు పూర్తి కాగానే పూర్తిగా చెల్లించే ప్రభుత్వ హామీ ఉన్నాయి
* మీకు నచ్చిన పోస్టాఫీసులో కొని మరి ఏ ఇతర పోస్టాఫీసులోకైనా మార్చుకోవచ్చు
* సులభ నామినేషన్‌తో ఎవరికైనా సంక్రమింప చేసుకోవచ్చు
* గడువు ముగిసే లోపే డబ్బు పొందవచ్చు ఏ బ్యాంకులోనైనా కుదువ పెట్టుకొని ఋణం పొందవచ్చు
* డబ్బు బంగారం పోతే తిరిగి లభించవు కాని ఈ సర్టిఫికెట్లను పోగొట్టుకున్న వెంటనే నకళ్ళను పొందవచ్చు
* దురదృష్టం కాటువేస్తే ఏ ధృవపత్రాల అవసరం లేకుండా పూర్తి సొమ్ము వారసులకు ఇవ్వబడే బీమా సౌకర్యం ఒక్క పోస్టాఫీసు పొదుపు పత్రాల్లోనే ఉంది
* పోస్టాఫీసు సేవింగ్స్ ఖాతాలో లక్ష రూపాయలు లాటరీ గెల్చుకోవచ్చు




Vaisakha/NSO/86-1

**మరి ఆ చేతిని అందుకోండి!**



వివరాలకు

**కమిషనర్ స్మాల్ సేవింగ్స్‌ను**

లేదా అన్ని పోస్టాఫీసుల్లోనూ జిల్లా కలెక్టర్ కార్యాలయాల్లోనూ, జాతీయ పొదుపు సంస్థ అధికారులను ఏజంట్లును సంప్రదించండి






**జాతీయ పొదుపు సంస్థ**

మీ భద్రతే మా లక్ష్యం

## కొరత!

మా ఊర్లో
కరెంటు ఉంది
రోడ్డు కూడా వేశారు
బడి వైద్యశాల కూడా
మొన్ననే వచ్చాయి
కాని –
మానవత్వమున్న
మనుషులే లేరు

— ఈతకోట సుబ్బారావు

## ఇదేనా పరిష్కారం?

ఆమెని చూస్తే అసహ్యమేసింది సరోజకి

అసలేమైంది' అడిగింది సరోజ అక్కడే వున్న నత ప్రక్కనుంటావిణ

ఏముందండి మామూలే ఆయన ఉదయం డబ్బు గురించే అనుకుంటా కొట్టినట్లున్నాడు మందు వేసుకుంది సాయంకాలం మూడున్నర అవుతోంది అమ్మ మెలికలు తిరుగుతోందాంటు అంటూ ఆడవాళ్లొచ్చారు వెళ్లి చూద్దును గదా ఇది పరిస్థితి వెంటనే ఆటోలో హాస్పటల్కి తెచ్చాం అప్పుడు మా యింట్లో వనజగారున్నారు ట్రీట్‌మెంటు వెంటనే జరిగిందిలెండ లేకపోతే ప్రాణం పోయేదే అందావిడ–

అరగంటకి సూపర్నెంటు గదిలోంచి సుధాకర్ వచ్చాడు సత చెప్పే సమాధానంపై సత్యమూర్తి బ్రతుకు ఆధారపడి వుంది సతకేం ఏర్పాటేదు ఆవిడకి స్పృహ రాగానే స్టేటుమెంటు తీసుకొంటారు అని ఇంత జరిగినా అతనిక్కడకి రాలేదేం? అన్నాడు

ఎక్కడో తాగో పేకాటలోనో ఉంటాడు అసహ్యమేసింది సరోజకి సత అతని గురించి చెప్పాలని పోలీసులతని ఒళ్ళు హూనం చేసి జైల్లో పడేయ్యాలని అలా చేస్తే బాగుండునని అన్పించింది సరోజకి

ఆమెకి స్పృహ వచ్చింది అంది నర్స్ బైటకి వచ్చి

సరోజ సుధాకర్ ప్రక్కంటావిడ మీనాక్షి గబగబ అంపరూ లోపలికి వెళ్లారు సరోజని చూడగానేసత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి సిగ్గుతో అభిమానంతో అపమానంతో మొహం తిప్పుకుందామె ఆమె తలపై చెయి వేసి ఎందుకింత అమాయిత్వానికి తల పెట్టావ్! ఆ పసివాళ్ళేం కావాలనుకున్నావ్' అంది రుద్ధకంఠంతో సరోజ సత ఏం మాట్లాడలేదు ఆమెతో స్టేటుమెంటు తీసుకోవటానికి లోపలికొచ్చాడు సబ్ఇన్‌స్పెక్టరు

చెప్పండమ్మా! మీ రెందుకు ఎలుకల మందు వేసుకున్నారు? మీ భర్త కొట్టారా? ఆయన మిమ్మల్ని హింసిస్తున్నారా' మిమ్మల్ని కట్నం గురించిగాని మరేదైనా ఇతరత్రా విషయాల గురించి మిమ్మల్ని బాధిస్తున్నారా' ఏ కారణంచేత మీరు ఆత్మహత్యకు తలపడ్డారు'

సత సమాధానం కోసం నిరీక్షించాలా చెపులు వేసుకొంది సరోజ

చెప్పు సతా! ధైర్యమిస్తున్నట్లుగా తలపై చెయివేస్తూ అంది సరోజ

సత గొంతు విప్పింది మెల్లగా

ఆయన ఎంతో మంచివాడండ నేనంటే ఎంతో ప్రేమగా ఉంటారు కట్నాల గొడవలేమి లేవు నాకు ఈ మధ్య బాగా కడుపులో నొప్పి వస్తోంది ఈరోజది మరీ ఎక్కువై భరించలేనంత బాధగా అన్పించింది ఆ బాధకి తట్టుకోలేక అసలు నేనేం చేస్తున్నానో నాకే తెలియక ఎలుకల మందు వేసుకున్నాను ఎందుకు వేసుకున్నానో నాకే అర్థం కావటం లేదిప్పుడు ఆ బాధ అట్లా నాచేత చెయించింది అంతేగాని ఇందులో ఆయన ప్రమేయం లేదసలు ఆయన క్యాంపుకి వెళ్ళారు ఊళ్ళోనలేరు వారం రోజుల నుండి అంది

ఇన్‌స్పెక్టర్ చెప్పిందంతా వ్రాసుకున్నాడు వెళ్ళిపోయాడు సరోజకి కోపంతో ఒళ్ళు తెలియలేదు

నీకసలు బుద్ధుందా? ఇంత మంచి అవకాశం పోగొట్టుకుంటావా' నిజం చెప్పివుంటే ఈ పాటికి జైల్లో తోసి ఒళ్ళు హూనం చేసేవాళ్ళు నిన్ను కొట్టిన దెబ్బల బాధేమిటో తెలిసొచ్చేది అంది

వనజ మీనాక్షి మరో నలుగురూ విసురుగా లోపలికొచ్చారు

చూశారా! మీ స్నేహితురాలెలా చెప్పిందో? ఇలాంటి వాళ్ళని మేంకాదు గదా దేవుడు కూడా బాగు చేయలేడు రెండు రోజులకొకసారైనా అతడివిణ కొట్టటం మేం చూస్తూనే ఉన్నాం అయినా

# జీవితం చాలా అపురూపమైనది జీవించండి దర్జాగా



బ్రిల్‌క్రీమ్, మీ వ్యక్తిత్వానికి కొత్త అందం తెచ్చేందుకు ప్రత్యేకంగా తయారు చేయబడింది. జిడ్డుగా ఉండని ఈ క్రీమ్, మీ జుట్టుకి కొత్త రూపు సమకూర్చి రోజంతా పొందికగా ఉండేలా చేస్తుంది




బ్రిల్ క్రీమ్ హెయిర్ డ్రెసింగ్ మీ జీవనశైలికి వన్నె తెస్తుంది

ఈవిడింకా పతి భక్తి చూపిస్తూ అతడిలోని క్రిమినల్ని పెంచి పోషించి కాపాడుతోందంటే అబ్బ! ఇంక ఈ జాతికి ఈ యుగంలో విమోచనం రాదేమో! చ! మా శ్రమంతా నిముషంలో బూడిదలో పోశారు అంది వనజ

వీళ్ళ మానసిక ఎదుగుదలకి మనం ఎన్ని బోధించినా ఎంత చెప్పినా వీళ్ళ సెంటిమెంట్సుని వదలనంతకాలం మనం ఎంత శ్రమపడినా ఎన్ని రకాలుగా ప్రయత్నించినా ఉపయోగం లేదు ఎవరో ఏదో చేయలేదని అణగ త్రొక్కుతున్నారని ఏడపటం దేనికి? వీళ్ళకి వీళ్ళే అన్యాయం వేసుకుంటున్నారు ఈ రకం మనుషులింతే వీళ్ళ నెవరూ బాగు చేయలేరు ఆవేశంగా అంది మీనాక్షి

మీరంతా నన్ను క్షమించి వెళ్ళిపోండి చేతులు జోడించి అంది సీత

వెళ్ళక నీలాంటి దానికోసం ఇంకాయిక్కడ టైమ్ వేస్ట్ చేస్తామా! నడవండి మీలాంటి వాళ్ళ గతి యింతే చీవాట్లు చెప్పుదెబ్బలు తినటమే మీ మొహాన రాసుంది అనుభవించాల్సిందే అనేసింది వనజ

మరుక్షణంలో వాళ్ళంతా వెళ్ళిపోయారు సీత నీరసంగా కళ్ళు మూసుకుంది సుదాకర్ ఎల్లలకి అన్నాలు పెట్టించి ఇంట్లో పడుకోబెట్టి వచ్చాడు దాదాపు పన్నెండు దాటుతుండగా వచ్చాడతడు

ఎలా వుంది? అడిగాడు మెల్లగా

పడుకుంది అంది సరోజ ఆమెకు స్నేహితురాలిపై ఏవగింపు లాంటి బావం కలిగింది వాళ్ళన్నట్లుగా దీనిలాంటి వాళ్ళు బాగుపడరు అనుకుంటోంది

అతను తాగేసి ఇంట్లో పడుకున్నాడు నేనంతా చెబితే విని వూరుకున్నాడు రేపు పేకాటలో తప్పకుండా డబ్బు వస్తుందిట అది పెట్టి బార్యకి మందులు కొంటాట్ట ఏమిటేమిటో మాట్లాడుతున్నాడు ఇంక అలాంటి స్థితిలో అతన్నిక్కడికి తీసుకురావటం ఇష్టంలేక వచ్చేశాను అన్నాడు

అలాంటి మనిషిని వెనకేసు కొస్తోంది మూర్ఖురాలు సరోజ కోపంగా అంది

సీత మెల్లగా వెల్లకిలాతిరిగింది సరోజని దగ్గరికి రమ్మని సైగ చేసింది కూర్చోమంది

నామీద కోపంగా వుంది కదూ! మీరంతా చెప్పినట్లుగా అనుకున్నట్లుగా నేనాయన మీద చెప్పలేదు ఎందుకో చదువుకున్న దానివి నకు తెలీదూ నేను ఆయనమీద చెప్పగానే ముందాయన్ని జైల్లో పెడతారు ఆ తర్వాత ఉద్యోగం పోతుంది అప్పుడు నేను నా పిల్లలు ఏం కావాలి? ఆయన జైలు నుండి వచ్చాక మళ్ళీ నా మొహం చూస్తాడా? నన్ను నా పిల్లల్ని జీవితాంతం ఎవరు పోషిస్తారు? ఈ సంఘంలో నాకు రక్షణని ఎవరు కల్పిస్తారు? వంటరిగా ఈ ఎల్లలతో నేనెలా ఉండగలను? నువ్వు పోషిస్తావా మమ్మల్ని జీవితాంతం? లేదా ఆ మహిళా మండలి వాళ్ళు నన్ను నా ఎల్లల్ని పోషించి మాకు రక్షణ కల్పిస్తారా? ఎవరు మా బాద్యత తీసుకుంటారో చెప్పు? టెన్త్ క్లాసు తప్పిన నాకు

# ఇ వేమన పద్యాలు




భాగ్యహీనునకును పరుసవేది దొరుక
నతని కనువుపడదు అరసిచూడ
వానతో డవచ్చు వడిగండ్లు నిలుచునా
విశ్వదాభిరామ వినురవేమ

...ఉద్యోగం పోయికుతుంది? నేను చనిపోయివుంటే ఆ దారి వేరు నేను బ్రతికి వుండి ఆ పిల్లలని తండ్రికి దూరం చేసి వీదుల్లో వాళ్ళు అడుక్కొనే పరిస్థితి కల్పించమంటారా? కొట్టుకున్నా తిట్టుకున్నా నా యింట్లో నేనుంటాను భర్త అనే వాడుంటాడు కాబట్టి నాకు సాంఘిక రక్షణ ఉంటుంది సంసారం ఇల్లు ఉన్నాయి కాబట్టి సంఘంలో ఒక స్థానం ఉంటుంది ఆయన్ని జైలుకే పంపించాక ఈ రోజు ఓహో అన్న నల్గురూ రేపు నా వెనకాలే మొగుణ్ణి జైలుకి పంపించింది ఎంతకైనా తగింది అని వాళ్ళే అంటారు ఎదుటే అన్నా ఆశ్చర్య పడాల్సింది లేదు ఆడపిల్లలున్నారు వాళ్ళ మొహాలు చూసైనా నేనాయన్ని క్షమించాలి అన్నీ ఆలోచించే నేనలా చెప్పాను ఆయినలో ఏమాత్రమైన మానవత్వముంటే కనీసం ఇప్పటికైనా కృతజ్ఞతతో నాపట్ల జాలైనా చూపుతారేమో! బాగా నీరసంగా ఉందా గొంతు

నిరుత్తరు రాలయ్యింది సరోజ ఒక రకంగా ఇదీ నిజమే తమ సాక్ష్యాలు సీత ఒంటిపైని వాతలు ఆమె పరిస్థితి అతన్ని జైలుకి పంపటానికివి చాలు కానీ సీత అన్నట్లుగా ఆ తర్వాత ఆమె పరిస్థితి? అప్పుడప్పుడూ పది పరకా యివ్వగలదేగాని తను మాత్రం ఆమెనెలా ఆదుకోగలదు? ఎవరు మటుకు ఒక కుటుంబాన్ని ఎల్లకాలం పోషించ గలరు? ఇంక ఈ పరిస్థితి యింతేనా? ఈ సమస్య కింక పరిష్కారమిదేనా? అనుకుంది సరోజ □

# ఆదిత్య నిలయం – అరసవెల్లి

"మయ్యా వేశ్య మనోయేమాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతా.

భక్తియోగంలో శ్రీ కృష్ణపరమాత్మ ఎవ్వరు నా యందు ఎల్లవేళల శ్రద్ధతో మనస్సు నిల్పి ఉపాసించెదరో అట్టివారు నా కత్యంత ప్రియులు అని ప్రవచించేరు ఉపాసన – సగుణోపాసన నిర్గుణోపాసన యని రెండు విదములు ఆరాదన ఏ రితినైనా ఆరాదకుని నిశ్చల మనస్సు అనివార్యం

రక్తాంబరం రక్తవర్ణం రక్త నేత్రాబ్జయుగ్మకమ్
సప్తాశ్వరద మారూడం బ్రహ్మ విష్ణు మహేశ్వరమ్
మహాపాపహరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్'

రక్తవర్ణ శోబితుడైన ఆ ఆదిత్యుడు త్రిమూర్తుల రూపమేయని ఆదిత్య హృదయం సూర్యాష్టకంలో ఆర్యులు ఆరాదించేరు

అణువునుండి బ్రహ్మాండము వరకు గల సమస్త చరాచర బూతరాశిని ఆవరించిన పరమాత్మకు మానవుడో రూపునేర్పరుచుకొని రోజుల్లో మానవునికి గల ఏకైక ప్రత్యక్షదైవం శ్రీ సూర్య బగవానుడంటే నిర్వివాదవచనమే సూర్యోపాసన వేదకాలము నుండి ఆచరణీయమై ప్రబలుతోంది ఋగ్వేదమందలి మహాసౌర ఋక్కులలో ఉద్యన్నద్యమిత్ర మహః అనెడి ఋక్కులు కేవలం సూర్య తేజోద్యాన పూర్వకముగనే వ్యావృతము గావింపబడినవి

ఆరోగ్యం మహాబాగ్యం – ఆరోగ్యం బాస్కరాదిచ్చేత్

అయురారోగ్య విబవాదులకు శ్రీ సూర్యారాదన ప్రాముఖ్యత వహించినది తొలి శ్రీ మయూరకవి సాంబుడు మున్నగువారు రవి ప్రీతితోనే వ్యాది విముక్తులైనట్లు శ్రీ సూర్య శతకము, సాంబపురాణము లలో గమనించగలము సత్రాజత్తునకు శమంతకమణి, దర్మజానికి అక్షయ పాత్ర సూర్య వరప్రసాదితాలే దైవంగా కాకపోయినా శాస్త్రజ్ఞులు దృవీకరించినట్లు మానవునికి వలయు డి విటమిను, జీవనగమ్యాన్ని నిర్దేశించు రేయింబవళ్ళును ప్రసాదించు ప్రకృతి శక్తిగా నాస్తికులు కూడా కాదనలేని నిర్వివాదాంశుడు ఆది దేవుడు

అయితే జగమెరిగిన బ్రాహ్మణునికి జంద్యమేల యన్నట్లు ఈ ప్రత్యక్ష దైవానికి మన దేశంలో దేవాలయాలు అరుదుగానే వున్నవి అట్టి అరుదైన వాటిలో ప్రఖ్యాతిగాంచినది అరసవెల్లిలో గల శ్రీ సూర్యనారాయణుని ఆలయం. భక్తులు తమ కోర్కెలు ఈడేరగా, హర్షభరితులై వెడలుదురుగాన, ఈ క్షేత్రానికి "హర్షవెల్లి" అన్న పేరు సార్థకమై, కాలగతిన "అరసవెల్లి"గా మారినది. ఆంధ్రప్రదేశ్, శ్రీకాకుళం జిల్లాలో గల ఈ దేవాలయం, శ్రీకాకుళానికి రెండు కి. మి. దూరంలో నెలకొని యున్నది. ఇతిహాస పూర్వకంగా, చారిత్రాత్మకంగా ఈ దేవాలయం ప్రసిద్ధి గాంచినది.

## స్థలపురాణం

శ్రీకాకుళంలో నాగావళీనది తీరాన వెలసిన "శ్రీ రుద్రకోటీశ్వరుని", అర్ధరాత్రియందు వేళకాని వేళ "వేలుపు రేడు" వివేకహీనుడై వీక్షింపగోర, నందీశ్వరునిచే నద్దగింపబడి, జరిగిన ఘర్షణలో శక్తిహీనుడై, నందీశ్వరునిచే దూరంగా నెట్టి వేయబడెను. గర్వాంధకారం వీడిన "శచీప్రియుడు" ప్రత్యక్ష దైవమైన ఆదిత్యుని వేడుకొని, భగవదనుగ్రహంతో ఆరోగ్యవంతు డయ్యెను.

సంతుష్టాంతరంగుడైన యా "సురపతి" అభ్యర్థన మేరకు శ్రీ సూర్యభగవానుడు అక్కడ వెలసి, భక్తుల నాదరించుట కంగీకరించెను దేవేంద్రునిచే స్వయంగా వజ్రాయుదంతో త్రవ్వబడిన పుష్కరిణిలో (ప్రస్తుతం సూర్య పుష్కరిణి గా పిలువబడుతోంది) సూర్యబగవానుని దివ్య మంగళ విగ్రహం ఆవిర్భవించింది అమరాదిపతి బృహస్పతి పర్యవేక్షణలో ఆది దేవుని ప్రతిష్ఠించి పూజలు సల్పెను పిదప రుద్రకోటీశ్వరుని దర్శించి సూర్యనారాయణ క్షేత్రానికి రామలింగశ్వర స్వామి క్షేత్ర పాలకునిగా యుండునట్లు వరమడిగి రామలింగేశ్వరుని ప్రతిష్ఠించి పునీతు డాయెను

## చరిత్ర

క్రీ శ 7వ శతాబ్దంలో గాంగవంశ రాజులలో దేవేంద్రవర్మ, ఈ ఆలయ నిర్మాణాబివృద్ధి కార్యక్రమములు చేపట్టినట్లు ఇక్కడగల శిలాఫలకాలు వెల్లడి చేస్తున్నాయి 16వ శతాబ్దంలో మత దురహంకారుల చేతిలో ఆలయ రూపురేఖలు మాపునొందగా 1778 సం లో శ్రీ ఎలమంచిలి పుల్లాజీపంతులుగారు ఆలయాన్ని పునరుద్ధరించేరు తదుపరి ఇప్పిలి వంశస్థులు దర్మకర్తలుగా ఆలయాన్ని అబివృద్ధి చేస్తున్నారు

## క్షేత్ర విశేషం

ఉషాచాయా పద్మినీ సహితుడై ముఖ్య సేవికలు

శ్రీ సూర్యబగవానుని నిజస్వరూపం



అలంకార శోబితుడైన ఆదిదేవుడు



ఎంగళ మాదిరులు దనుర్బాణాలతో చెరొక ప్రక్క పువ్వుల వర్షంతో పూజిస్తుండగా, లోక కళ్యాణార్థం సప్తాశ్వ రదారూఢుడై బయల్దేరుతున్నట్లు వుండే ఈ క్షేత్ర స్వామివారి దివ్యమంగళ చరణాలపై ఉత్తరాయణ దక్షిణాయణ పర్వదినము లందు సూర్య కిరణములు ప్రబాత సమయాన తాకి బక్తులకు కనువిందు చేస్తాయి

## ఉత్సవరోజులు

ప్రతీ సంవత్సరం ఛైత్రశుద్ధ ఏకాదశినాడు స్వామి వారి కళ్యాణోత్సవము కార్తీక శుద్ధ ద్వాదశినాడు తెప్ప తిరునాళ్ళు రదసప్తమి నాడు శ్రీసూర్యజయంతి, పాల్గుణ శుద్ధ త్రయోదశి పూర్ణిమనాడు కామదహనోత్సవము డోలోత్సవములు ఇక్కడ పేరెన్నిక గన్నవి ప్రతి ఆదివారం ఆదిత్యుని ఆరాదన దినమే

## ఆదాయవ్యయాలు

ప్రస్తుతం ఎండోమెంట్సువారి అదినంలో నున్న ఈ ఆలయం బక్తుల విరాళాలతో ఎన్నో నూతన శోబలు నొందుతోంది సుమారు మూడు లక్షల రూపాయల వ్యయంతో ముఖమండపం చుట్టూ బేడా మండపం గాలిగోపురం పునరుద్ధరింపబడినవి సూర్య పుష్కరిణి చుట్టూ ప్రాకారం నిర్మింపబడుతోంది



నూతనముగా పునరుద్ధరింపబడిన గాలి గోపురం

ఆలయ దర్మకర్తచే సుమారు ఒకటిన్నర ఎకరాలు స్థలం సత్ర నిర్మాణానికి దానం చెయ్యబడింది అందులో వసతి నిర్మాణానికి బక్తులు బూరి విరాళాలు సమర్పిస్తే బాగుంటుందన్న అబ్యర్ధన గమనింపదగినదే

టి టి డి వారి దర్మసత్రం కళ్యాణ మండపం బక్తులకు అందుబాటులో వుంది

వ్యాసం ఫోటోలు నిడమర్తి ఆదిలక్ష్మి ప్రసాద్

(విషయ సేకరణకు సహకరించిన ఆలయ దర్మకర్త శ్రీ ఇప్పలి జోగారావు ఎగ్జిక్యూటివ్ ఆపీసర్ శ్రీ కె ఎల్ నారాయణాచార్యులకు కృతజ్ఞతలు)

— వ్యాసకర్త

సీరియల్

# చైతన్య స్వరూపం

కంచుమర్తి వెంకటేశ్వర రావు

(గత సంచిక తరువాయి)

రోజులు చాలా సాఫీగా గడుస్తున్నాయి బాబు పేరు కిరణ్ అప్పుడప్పుడు నాన్నగారు వచ్చి చూసి వెళుతున్నారు ఆయన బిజినెస్‌లో బిజీగా ఉన్నప్పుడు లెటర్లు రాసేవారు ముగ్గురన్నయ్యలు వాళ్ళు మంచి వాళ్ళే కానీ వదినలు హై సొసైటిలో ఉన్నా బుద్ధి పరిపక్వత చెందని సామాన్య స్త్రీలు

మొగుడ్ని జైలుకు పంపించింది చాలక నీవు నాకు వద్దు పొమ్మంటూ బయటకు గెంటేసింది

ఆడదై పుట్టాక కాస్తంతయినా జాలి, దయ క్షమాగుణం ఉండాలి నేను మారానని మొగుడు ఎంత బ్రతిమాలినా వినిపించుకోలేదు

ఎంతయినా చదువుకుంది కదా ఆ మాత్రం ఆశయాలు ఉండాల్లే అయినా పిల్లల గురంచయినా పౌరుషం తగ్గించుకోవాలి

పాపను తీసుకెళ్ళాక గర్వం తగ్గించుకుని మొగుడి దగ్గరకు వెళ్ళ వచ్చు కదా

ఎందుకెళుతుంది ఉత్తమ పౌరుడిగా తీర్చిదిద్దితుందట

ఆ ( మనకు పిల్లలే లేరా మనం పెంచడం లేదా

మాద్దాం గారాల కొడుకును ఏ దేశానికి ప్రసిడెంటును చేస్తుందో ఏ రాష్ట్రానికి ముఖ్యమంత్రిని చేస్తుందో.

ఇలా సూటి పోటి మాటలు

ఆ మాటలు వినలేక వదినల దగ్గర కెళ్ళడం మానేసాను అన్నయ్యలు చూసి వెళుతున్నారు ఆ సంవత్సరం నాన్నగారు గుండెపోటు వచ్చి చనిపోవడంతో

**జరిగిన కథ– 6.** తల్లిలేని సీత, నళినిలను తండ్రి మన్మదరావు అల్లారు ముద్దుగా పెంచాడు సీత తను ప్రేమించిన బార్గవ మోసగాడని తెలుసు కొని తండ్రి తెచ్చిన సంబందానికి ఒప్పుకుంది సీత పెళ్లి రామారావుతో జరిగిపోయింది బార్గవ రాసిన అబద్ధపు ఉత్తరం వల్ల రామారావు సీత విడిపోయారు క్లబ్ డాన్సర్ డాలీ ఆశ్రయంలో సీత చేరుతుంది సీత తన పేరు జ్వాలగా మార్చుకుంది జ్వాల క్లబ్బులో సింగర్‌గా ఉద్యోగంలో చేరుతుంది జ్వాలకు బార్గవ కనిపిస్తాడు డాలీ/జ్వాల పెట్టిలోని ఆల్బమ్ చూసి జ్వాల అసలు పేరు సీతని ఆమె రామారావ్ బార్య అని తెలుసుకుంటుంది, డాలీ రామారావుని కలుసుకుని బార్గవ్ గురించి చెపుతుంది బార్గవ్‌ను చంపాలని వేసుకున్న సీత ప్లానును డాలీ పడనీయలేదు బార్గవ్‌ను పోలీసులు పట్టుకుపోయారు బార్గవ బార్య స్వరూప బర్తకు విడాకులు ఇచ్చేస్తుంది రామారావు బార్గవ అసలు స్వరూపం తెలుసుకుంటాడు బార్యను చేరదిసాడు– హరిత స్వరూప చెప్పిందంతా వినింది హరిత గాయత్రిని కలుసుకోవాలనుకుంటుంది హరిత బలవంతంపై స్వరూప చెప్పసాగింది –జైలు నుండి విడుదలైన బార్గవ తన తప్పు తెలుసుకుని మనిషిగా మారి బార్యను విడాకులు ఉపసంహరించుకోమంటాడు కానీ స్వరూప ఒప్పుకోలేదు బార్గవ స్వరూప ఇంట్లో లేనప్పుడు పాపను తనతో తీసుకు వెళ్లిపోతాడు

ఒంటరిదాన్నయ్యాను అన్నయ్యలు రావడం తగ్గించేసారు ఉత్తరాలు రాయడమే గగనమయింది

నాలుగో సంవత్సరంలో కిరణ్‌ను కాన్వెంటులో చేర్పించాను

ఆ సమయంలో

మా కాలేజికి వర్మ అనే కొత్త లెక్చరరు వచ్చాడు ముప్పై ఆరేళ్ళ వాడయినా నిండైన విగ్రహంతో పాతికేళ్ళ కుర్రాడిలా ఉంటాడు నవ్వుతూ, జోకు లేస్తూ అందరినీ నవ్వించే మనస్తత్వం గల వర్మ నా వైపు మొదటిసారిగా అదోలా చూసాడు ఆ చూపులో ఎన్నో బావాలు

స్వరూపగారూ మీరు మౌనంగా ఉన్నప్పుడే అంత అందంగా ఉంటారు కదా నవ్వితే ఇంకెంత అందంగా ఉంటారో కాస్తంత నవ్వు ముఖానికి పులమండి

అతని మాటలకు నవ్వకుండా ఉండలేకపోయాను

వాళ్ళ ద్వారా, వీళ్ళ ద్వారా నా కథ తెలుసుకున్న వర్మ ఒకరోజు స్టాఫ్ రూంలో నేను బుక్ రీపర్ చేస్తుంటే వచ్చి ఎదురుగా కూర్చున్నాడు

స్వరూపగారూ జీవితంలో పోగొట్టుకున్న వాటి గురించి బాద పడడం కంటె ఇంకా ఏవేవి పొందాలో ఆలోచించడం మంచిదని నా అబిప్రాయం

పుస్తకం మూసాను

వర్మగారూ , నేను జీవితంలో అన్నీ పొందాను బర్త సంసారం కష్టాలు సుఖాలు పిల్లలు, పెళ్ళయి ఇద్దరు పిల్లలు పుట్టింతర్వాత కూడా ఆ ఆడదానికి ఇంకేం కావాలో మీరే చెప్పండి

ఖంగు తిన్నాడు వర్మ

చూడండి మనం టీచర్లం పిల్లలకు పాఠాలు చెబుతున్నాం ఎందుకంటారు? వారి బవిష్యత్తును తీర్చి దిద్దాలనేగా పరాయి పిల్లలను సక్రమమైన రితిలో నడిపించాలనే కర్తవ్యం కొసం కృషి చేస్తుంటే మన సొంత పిల్లలను తీర్చిదిద్దడంలో ఇంకా ఎంతో శ్రమిస్తాం ప్రస్తుతం నేను అదే చేస్తున్నాను ఇక కోరికలంటారా అవి మన అదీనంలో ఉంటాయి ఆశయాలకు అవి అడ్డు రావనే నమ్మకం నాకుంది యామై కరెక్ట్

వర్మ మరిక మాట్లాడలేక పోయాడు

వర్మకు నా అందం పిచ్చెక్కిస్తుంటే పాపం అతనేం చేయగలడు ముప్పై ఏళ్ళొస్తున్నా ఇంకా పెళ్ళి కాని అమ్మాయిలా ఉంటానని అందరూ అంటుంటారు అది నాతప్పా అప్పటికి నేను పెద్దగా అలంకరించుకోను పేషన్లకు పోను సింపుల్‌గా ఉండడానికి ప్రయత్నిస్తుంటాను

రెండ్రోజులకు వర్మలో మార్పొచ్చింది

నా దగ్గర అతిగా మాట్లాడడం తగ్గించేసాడు

హలో అంటే హలో తూచి తూచి మాట్లాడుతున్నాడు

ఒక ఆదివారం

కొలీగ్స్ పిక్నిక్ అరెంజ్ చేసా..

దగ్గర ఉన్న తోటలో గెస్ట్‌హౌస్ కూడా ఉంది

టిఫిన్లు కాఫీలయిం తర్వాత కొందరు వంట మనిషికి తోడుగా ఉంటి మరి కొందరు గ్రూపులుగా చేరి పేకాటలో. కూర్చున్నారు ఆ వాతావరణం నాకు మహా బోరనిపించి ఒక పుస్తకం తీసుకుని వెళ్ళి గెస్ట్‌హౌస్‌లో కూర్చున్నాను

ఇంతలో వర్మ లోపలకు వచ్చాడు

ఆ సమయంలో అతను రావడం ఇబ్బందిగా అనిపించి బయటకు వెళ్ళ బోయాను

స్వరూప గారూ మీతో మాట్లాడాలి

కూర్చున్నాను

స్వరూపగారూ నా గురించి ఇంతవరకూ ఎవరికి తెలియదు ఇంతవరకూ నేను పెళ్ళి చేసుకోక పోవడానికి కారణం నాకు నచ్చిన అమ్మాయి కనిపించక పోవడమే ఈ వయసులో పెళ్ళి మీద మనసు పోతుంది వయసు తెలిసిన అమ్మాయిలు మూతి విరుస్తున్నారు

మిమ్మల్ని చూసేక మీ గురించి అంతా తెలుసుకున్న తర్వాత మీరెంత ఉన్నతమైన మనస్తత్వం గలవారో గ్రహించాను పిల్లల శ్రేయస్సు కొసం ఎంత

త్యాగం చేసారో తెలుసుకుని ఆశ్చర్య పోయాను మికు చేయూత నివ్వాలని నా మనసు ఉవ్విళ్ళూరుతుంది

వర్మ అలా మాట్లాడతాడని నేనూహించలేదు ఎందుకంటె అతనికంత చనువెప్పుడూ ఇవ్వలేదు

మి ఉద్దేశ్యం

మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలను కుంటున్నాను

ఒళ్ళు మండి పోయింది నాకు

కోపాన్ని కంట్రోలు చేసుకుని చిన్నగా నవ్వేను

చూడండి వర్మ గారూ భర్తకు విడాకులిచ్చి తన కాళ్ళ మిద తను నిలబడగలుగుతున్న ఏ ఆడదాన్ని చూసినా అయ్యో ఆమె కోరికలను చంపుకుని జీవచ్ఛవంలా బ్రతుకుతుందే అని భ్రమపడి తమేదో త్యాగం చేస్తామన్నట్లుగా ముందుకు వచ్చి వలలు విసురు తారెందుకు మి మగవాళ్ళు ఆమె ఏ పరిస్థితిలో ఒంటరిగా ఉంటుంది? ఆమె కద ఏమిటి? తెలుసుకుని తండ్రిగా అన్నగా తమ్ముడుగా మిత్రుడుగా సహాయం చేయరెందుకు? అటువంటి ఆడవాళ్ళను మిరెందుకు చులకనగా చూస్తారు

చాలాసేపటి వరకు వర్మ మాట్లాడలేదు

టేకిట్ ఈజీ బయటకు వెళ్ళండి – అన్నాను

మాట్లాడకుండా వెళ్ళి పోయాడు

అరగంట అలాగే కూర్చుండి పోయాను

★ ★ ★ ★

మర్నాడు కాలేజీకి వెళ్ళేసరికి అక్కడ కొందరు నాకు వర్మకు ఏదో సంబంద ముందని గుసగుస లాడు కోవడం కనిపించింది నేనంత పట్టించుకోలేదు లోకరీతే అంత

వర్మ నాతో మామూలుగానే మాట్లాడుతున్నాడు

నేను కూడా అంతే

అప్పుడప్పుడు కొలీగ్స్ నన్ను వర్మను పరిశిలనగా చూడడం నవ్వుకున్నాను రెండ్రోజులయింతర్వాత ప్రిన్సిపాల్‌ను కలిసి వర్మ వివరాలు ఊరు అన్నీ తెలుసుకున్నాను ప్రక్క ఊరే వర్మది

ఒక రోజు సెలవు పెట్టి ఆ ఊరు వెళ్ళాను

వర్మ గురించి విన్న నిజాలు ఆశ్చర్యాన్ని కలిగించాయి

అన్ని కోణాల్లో మగవాడు ఆడదాన్ని వాంఛిస్తున్నాడనే నిజం రూఢి అయింది వర్మలాంటి ముసుగు మనుష్యుల నిజస్వరూపాలను లోకానికి చూపించాలనే ఉద్దేశ్యంతో నే వర్మ ఊరు వెళ్ళాను అంతకు మించి మరేం లేదు సూటిగా తన దారిలో తను పోయే వాళ్ళను చూసి ప్రక్కనున్న వాళ్ళు వెన్నుపోటు పొడవడానికి ప్రయత్నాలు చేస్తే ఎప్పటి కప్పుడు ఖండించకపోతే ఇంకా మితి మిరుతారు

వర్మకు బుద్ధి చెప్పాలి?

అతని గురించి అందరికి తెలిసేలా చెయ్యాలి

ఆలోచించాను

ఒక వారం రోజుల తర్వాత



# చైతన్య స్వరూపం

వర్మతో నవ్వుతూ అతన్ని నవ్విస్తూ కవ్విస్తూ అందరి ముందు తిరుగుతుంటే అందరిలో అనుమానపు సెగలు రేగడం స్పష్టంగా గ్రహించాను ఆ సాయంత్రమే కొలీగ్స్‌ను టీకి పిలిచాను ఇంట్లో కూడా వర్మతో చనువుగా ప్రవర్తించాను

డియర్ ఫ్రెండ్స్ ఇప్పుడు టీకి మిమ్మల్ని పిలిచింది ఒక ముఖ్యమైన విషయం చెప్పడానికి దగాపడి జీవితంలో అన్ని ఆశలును చంపుకుని బ్రతికే ఒక ఆడదాని బ్రతుకులో వసంతం వస్తుందని ఆమెలో వెలుగు రేఖలు విచ్చుకుంటాయని చెప్పడానికి

అయ్యో అయ్యో!

కొంపదీసి ఈమె వర్మను ప్రేమించేసిందా

వర్మగారి లాంటి మంచి మనిషి నాకు చేయూత నిస్తానని అనడం నాకెంతో ఆనందంగా ఉంది అని ఆగాను

స్వరూప వర్మ వలలో పడిపోయింది

వర్మను పెళ్ళి చేసుకుంటది

అందరూ బుర్రలు గోక్కుంటున్నారు

బుగ్గలు నొక్కుకుంటున్నారు

డియర్ ఫ్రెండ్స్ మరి అంతటి పెద్ద మనిషి నాకు అందమైన జీవితాన్ని అందించడానికి ముందుకు వస్తే నేను కాదనగలనా అయితే ఈ అమ్మాయి గురించి ఏమిటి

ఆయా గదిలోంచి ఒక అమ్మాయిని తీసుకొచ్చి అందరి మధ్య నిలబెట్టింది ఆ అమ్మాయి నీరసంతో ఊదితే గాలికి పడిపోయేలా ఉంది

ఎవరిమె?

అందరి ముఖాలు క్వొశ్చన్ మార్కు లు

వర్మ ముఖం వెల వెలబోయింది

ఫ్రెండ్స్ ఈమె ఎవరో కాదు మన వర్మగారి భార్య నేనలా చెప్పగానే అందరూ తెల్లబోయారు

పెళ్ళి కాలేదని చెప్పాడే

చూసారా మనం ఆడవాళ్ళం మగవాడి ఆటలకు ఆటబొమ్మలం వర్మగారు తన భార్య జబ్బు పడి మంచం ఎక్కితే ఆ పల్లెటూరులోనే నీ చావేదో నువ్వు చావు అని పడేసి నెలకో రెండొందలు ముష్టి పడేస్తున్నాడు గట్టిగా అడగలేని ఆమె తల్లితండ్రుల బలహీనతను ఆధారం చేసుకుని ఇక్కడ పైలా పచ్చీసుగా తిరుగుతున్నాడు ఎంత తొందరగా చచ్చిపోతే అంత తొందరగా మరో పెళ్ళి చేసుకోవచ్చనే ఆశతో ఆమెను అలాగే ఉంచేసాడు ఈ మహరాజా ఈ ఉద్దేశ్యంతో ఉంటే ఈతని తండ్రి కొడుక్కి రెండో పెళ్ళి చేస్తే మళ్లీ కట్నం వస్తుందనే దురాశతో ఎదురు చూస్తున్నాడు అంతేకానీ జబ్బుతో ఉన్న భార్యను ఈ ఊరుకు తీసుకు వచ్చి డాక్టర్లకు చూపించి మందులు వాడి ఆమెను ఆరోగ్యవంతురాలిని చేయాలనే ఆలోచన ఏ మాత్రం కూడా లేదు ఇటువంటి మాయల మగాడు నన్ను ఉద్ధరించడానికి నేనేదో నరకం అనుభవిస్తున్నానని నాకు స్వర్గం చూపిస్తానని ముందుకు వచ్చాడు ఇతని ప్రవర్తన వలన లోకం నన్ను హేళనకు గురి చేయడానికి ప్రయత్నించింది ఇటువంటి మగ పురుగులున్నంత కాలం నా లాంటి స్త్రీలకు నిందలు నిష్ఠురాలకు కొదువలేదు ఈ వర్మ గురించి మీరే చెప్పండి

ఆవేశం ఉద్రేకం కోపం నాలో సమానంగా విజృంభించాయి

వర్మ ముఖం పాలిపోయింది

అందరి ముందు తల వంచాడు

ప్రిన్సిపాల్ వర్మను నిలదీసారు

మిష్టర్ వర్మా స్వరూపగారు చెప్పిదంతా నిజమేనా ఆ అమ్మాయి నీ భార్యా

వర్మ మాట్లాడలేదు

ప్రిన్సిపాల్ మళ్లీ అడిగారు

వర్మా జరిగిందానికి క్షమాపణ చెప్పుకుని నీ భార్యను ఇక్కడే పెద్ద ఇల్లును తీసుకుని ఉంచి డాక్టర్లకు చూపించు చూడు అగ్నిసాక్షిగా పెళ్ళాడిన భార్యను ఎందుకంత నిర్లక్ష్యం చేస్తావ్ రోగాలు వస్తే భార్యలను విడిచి పెట్టేయడమేనా నీ కేదైనా వస్తే నీ భార్య అలా చేయగలదా కొద్దిగా తలనొప్పి జ్వరం వస్తేనే ఆ ఆడది ఎంత తల్లడిల్లుతుందో ఎంతగా సేవ చేస్తుందో ఎప్పుడైనా ఆలోచించావా ఎమ్మేలు చదివారు పైగా లెక్చరర్లు చదువే తప్ప సంస్కారం నేర్చుకోలేదా నీ భార్యతో కాపురం చేస్తే సరేసరి లేకపోతే కేరక్టర్ బాగా లేదని సస్పెండ్ చేస్తాను ఎక్కడా జాబ్ దొరక్కుండా చేయగలను బి కేర్

ప్రిన్సిపాల్ గట్టిగా వార్నింగ్ ఇచ్చారు

వర్మ సిగ్గుతో మా ముఖాలు చూడలేక అయాం వెరి సారి సర్ ఇకపై అలా చేయను అన్నాడు భార్య చేతులు పట్టుకుని

అందరూ నన్ను అభిమానంగా చూసి వారి ప్రవర్తనకు సిగ్గుపడి అభినందించారు వర్మ భార్య కన్నీటితో కృతజ్ఞత చెప్పింది సాటి స్త్రీ జీవితం బాగుపడిందన్న ఆనందం అందుకు కొంత తన చేయూత ఉందనే తృప్తి ఆ రోజు నాకు రిలీఫ్ నిచ్చాయి

* * * * *

రోజులు నెలలు సంవత్సరాలు గడుస్తున్నాయి

ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా సాఫీగా సాగుతుంది జీవితం భార్గవ జ్ఞాపకాలను పూర్తిగా మరచిపోయినా పాప ఎలా ఉందో అనే ఆలోచన వచ్చినప్పుడల్లా దుఃఖం ఆగేది కాదు

కిరణ్ ప్రతి సంవత్సరం పరీక్షల్లో ఫస్టుక్లాసు వాడికిస్తున్న నా తర్ఫీదు ఎక్కడా శృతి తప్పదని నా నమ్మకం నేనంటే ఎంతో గౌరవం వాడికి వాడంటే నాకు ప్రాణం

మమ్మీ పుస్తకాలు కొనాలి లిస్టు ఇచ్చేవాడు నీవు కొనుక్కో అని డబ్బులిచ్చినా తీసుకోడు వాడంతట వాడు ఒక రూపాయి కూడా ఖర్చు పెట్టడు నేను వాడికిచ్చే పాకెట్ మనీ సేవింగ్ బ్యాంక్‌లో వేసేవాడు పదో తరగతి నుండి ఇంటర్ మీడియట్ వరకూ రెండు వేలు పొదుపు చేసాడు అలా బుద్ధిమంతుడిలా నా కను సన్నలలో పెరుగుతుంటి నా ఆనందం అంతా ఇంతా కాదు

కిరణ్ డిగ్రీ పాసయ్యాడు

నూనూగు మీసాలు, పొడుగరి ఆ నవ్వు అంతా భార్గవే కిరణ్‌లో భార్గవ పోలికలు అచ్చు గుద్దినట్లుంటాయి

నా ఆశల ప్రతినిది కిరణ్

ఊహ వచ్చినప్పటి నుండి ఏ రోజైనా తండ్రి గురించి అడుగుతాడేమోననుకునేదాన్ని కాని ఏ రోజు కూడా అసలు ఆ ప్రస్తావనే ఎత్తేవాడు కాదు అడగాలనిలేదా లేక భయంతో అడగలేక పోతున్నాడా!?

ఒక రోజు

వరండాలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు కిరణ్ తలనొప్పిగా ఉందని సెలవు పెట్టి ఇంట్లోనే ఉన్నాను సెలవుల్లో నేను ఇంట్లో ఉంటే మాత్రం వంట నేనే చేసేదాన్ని మిగిలిన రోజుల్లో ఆయా

బాబూ

పేపరు మూసాడు

ఏదో చెప్పాలనే తాపత్రయం అది పసిగట్టిన కిరణ్ ఏమిటి మమ్మీ అన్నాడు

బాబూ ఒక ప్రశ్న వేస్తాను జవాబు చెబుతావా

ష్యూర్ సోషల్ సైన్సు మేత్స్ ఇంకా జనరల్ నాలెడ్జి ఏదయినా సరే అడుగు మమ్మీ జవాబులు ఠకీమని చెప్పేస్తాను

వాడి మాటలకు నవ్వొచ్చింది

సబ్జక్టులు గురించి కాదు నేనడిగేది లైఫ్ గురించి

ఇబ్బందిగా ముఖం పెట్టాడు

సారీ మమ్మీ  దాని గురించి ఏ సబ్జక్టులో నూ చెప్పలేదు

జీవితం నీవు చదివే పాఠాల్లో కనిపించదు జీవితాన్ని జీవితంలో జీవించి చదవాలి తెలుసుకోవాలి అప్పుడే అదంటే ఏమిటో తెలుస్తుంది

వాడికేం అర్థం కానట్లు ముఖం పెట్టాడు

మమ్మీ నీవు అంతా చదివేసావా

కిరణ్ ప్రశ్నకు నవ్వకుండా ఉండలేకపోయాను

జీవితం అంటే కష్ట సుఖాల కలయిక అంతా చదివి ముగింపు అధ్యాయంలో ఉన్నాను ఈ అధ్యాయంలో ఇంకా చాలా పేజీలున్నాయి బాబూ నీకెందరో స్నేహితులు ఉండక పోవచ్చు ఉన్న ఆ కొద్ది మందితో నువ్వెంతో సరదాగా గడిపే ఉంటావు స్నేహితుల ఇళ్ళకు ఎప్పుడైనా వెళ్ళావా వెళ్ళితే అక్కడ నీకు తెలిసిన, నీవు గ్రహించిన వాతావరణం ఎలా ఉండేది

నేనెందుకు ఈ రోజు ఇలా మాట్లాడుతున్నానో వాడికి ఏ మాత్రం అర్థం కావడం లేదు

ఏముంది వెరి సింపుల్ అమ్మా నాన్న అన్నయ్యలు తమ్ముళ్ళు అక్కలు చెల్లెల్లుంటారు అందరూ మాట్లాడుకుంటారు

ఆ ఇళ్ళకు మన ఇంటికి తేడా ఏమైనా కనిపించిందా

కిరణ్ చాలా సేపు మాట్లాడలేదు

మమ్మీ నీవు దేని గురించి అడగదల్చుకున్నావో తెలుసుకున్నాను పిల్లల దగ్గర మమ్మీ డాడీ ఉంటారు నాకు మమ్మీ ఉంది గానీ డాడీ లేరు ఎందుకు లేరు? అసలు ఉన్నారా ఉంటే ఎక్కడున్నారు? ఇవే ప్రశ్నలు వీటి గురించి నేనెందుకు అడగలేదనేగా నీ ప్రశ్న

కిరణ్ అలా సూటిగా నేనడగబోయే దాని గురించి వాడే చెబుతుంటే ఆశ్చర్యమనిపించింది

మమ్మీ జీవితం అంటే ఏమిటో నాకు తెలియక పోవచ్చు కానీ సినిమాలు నవలలు జీవితం గురించి కొన్ని చెప్పాయి తండ్రి లేకపోతే పిల్లలు అమ్మను అడగడం అమ్మ కరువైతే ఆ ప్రేమకు నేనెందుకు నోచుకో లేదని మారాం చేయడం జవాబులు దొరికితే అలాగని ఊరుకోవడం ఇవన్నీ తెలుసు మమ్మీ గాజులతో మంగళ సూత్రంతో బొట్టుతో మూర్తీభవించిన మాతృ మూర్తివి నీవు డాడీ లేకపోతే ఆ రూపం ఎలా ఉండేదో నేను ఊహించగలను కానీ నేనెప్పుడూ ఊహించ లేదు ఎందు కంటే కంట పాపలా, అల్లారు ముద్దుగా క్రమ శిక్షణలో నన్ను పెంచి పెద్దవాడిని చేస్తున్నావు నాకు ఏ లోటు ఉందని ఆ ప్రశ్న వేయగలను అమ్మ వైనా, నాన్నవైనా నువ్వే అయితే మమ్మీ డాడీ ఎక్కడ ఉన్నారు? అని అడగాలని అప్పుడప్పుడు అనిపించినా నీకు ఎక్కడ కోపం వస్తుందనే భయం నన్ను బాధ పెట్టిన వాడినవుతాననే ఆలోచనతో ఆగిపోయే వాడిని డాడీ ఎందుకో మమ్మీకి దూరంగా ఉన్నారు లేదా మమ్మీయే డాడీకి ఎందు చేతనో దూరంగా ఉంది అనే జవాబుతో నే నన్ను నేను సరిపెట్టుకుంటున్నాను

కిరణ్‌లో ఇన్ని ఆలోచనలున్నాయని అంతవరకూ నేను తెలుసుకో లేక పోయాను కిరణ్ నాదృష్టిలో ఇంకా పసిపిల్లవాడే ఆ ఉద్దేశ్యంతోనే ఆ చిన్న మనసుకు ఎన్నో విప్పి చెప్పాలని ప్రయత్నించాను కానీ వాడు నాకంటే తెలివైన వాడని గ్రహించ లేక పోయాను

బాబూ అయితే మీ డాడీ గురించి నీకు తెలుసు కోవాలని ఉందా

ఉండేది మమ్మీ కాని ఇప్పుడు లేదు ఏదో బలమైన కారణం ఉంటేనే తప్ప తల్లి తండ్రులు విడిపోవడం జరగదని తెలుసు ఆలోచన తెలివి తేటలు అన్నీ నీ సొంతం ఏ పని చేసిన ఎంతో ఆలోచించే చేస్తావు డాడీకి దూరంగా ఉండడంలో నీవు తప్పు చేయ లేదనే నా నమ్మకం డాడీకి ఎందుకు దూరంగా ఉన్నావని నేనడగను గతంలో ఎన్నో సమస్యలు ఎదుర్కొని ఉంటావు వాటిని వెలికి తీసి నిన్ను బాధ పెట్టడం నా కిష్టంలేదు ఇప్పుడు డాడీ లేని లోటు నాకేం లేదు అన్నీ నువ్వే నాకు మమ్మీ చాలు మమ్మీయే నాలోకం

ఆ మాట అంటున్నప్పుడు కిరణ్ కళ్ళు తడయ్యాయి

కిరణ్ మాటలకు నా హృదయం పొంగిపోయింది

తల్లిగా నాకింకేం కావాలి

బంగారం లాంటి కొడుకు

కిరణ్ యూనివర్సిటీ మెట్లెక్కాడు స్కూటరుకొన్నాను

ఆదివారం

బాబు, నేను వరండాలో చెస్ ఆడుతూ కూర్చున్నాం చదరంగంలో బాబు ఎప్పుడూ ఫస్ట్ డిగ్రీలో చాలా సార్లు ప్రైజు లొచ్చాయి యూనివర్సిటీలో కూడా చాంపియన్ షిప్ గెలుచుకోవాలని వాడి తాపత్రయం బాబు చెస్‌లో అంత ప్రావీణ్యం సంపాదించడానికి కారణం నేనే నాకు చిన్నప్పటి నుండి చెస్ అంటే ఎంతో ఇష్టం నా తర్ఫీదు వలన చురుకుగా ఎత్తులు వేయడం నేర్చుకున్నాడు

మమ్మీ నిన్ను గెలవడం నాతరంకాదు

అన్నాడు వాడి రాజును నేను కొట్టగానే

బాబూ నువ్వు గెలిచినా, ఓడినా నాకు ఆనందమే ఏ ఒక్క రి కోసం కాదు నా గెలుపు జీవితంలో అందరూ గెల్వాలి

చాలా సేపు ఆటలో మునిగి పోయాం

ఇంతలో వరండా ముందాగింది కారు

ఆట ఆపి చూసాను

కార్లోంచి దిగుతున్న పరాంకుశం, భార్గవ నాన్న గారిని చూసి ఆశ్చర్య పోయాను పండు ముసలి వాడయినా డబ్బు అతన్ని ఇంకా ఆరోగ్య వంతుణ్ణి చేస్తుంది ఇరవై సంవత్సరాల తర్వాత ఇప్పుడు అతనెందుకు వస్తున్నాడు మరో యుద్ధానికి నాంది పలుకు తాడా!

'రండి మామయ్యా గారు

మామూలుగా రిసీవ్ చేసుకున్నాను

పరాంకుశం బాబును కొన్ని క్షణాలు కళ్ళార్పకుండా చూసి ఎదురుగా కూర్చున్నాడు కిరణ్ ఫ్రెండింటికని స్కూటరు తీసుకుని బయటకు వెళ్ళి పోయాడు

నిన్ను చూస్తుంటే కొంచెం బాధని పించినా గర్వంగా ఉందమ్మా

నేనేం మాట్లాడ లేదు

భార్గవ ఎలా ఉన్నాడు?

పాప ఏం చేస్తుంది?

అడగాలను కున్నాను గానీ నా నోట్లోంచి మాటలు రాలేదు

భార్గవ నీకు అన్యాయం చేసాడన్న మాట వాస్తవమే ఆ రోజుల్లో కొడుకు దూరమయ్యాడనే బాధతో నిన్ను అనరాని మాటలన్నాను ఈ రోజు నిజానిజాలు తెలుసుకున్నాక నా అనే వాళ్ళందరూ దూరమయ్యారు భార్యా భర్తలిద్దరం జీవశ్చవాల్లా బ్రతుకుతున్నాం

అతని కళ్ళల్లో తడి

ఆయాను కాపీ తసుకురమ్మన్నాను



# చైతన్య స్వరూపం

కాపీ త్రాగింతర్వాత అతను ఏదో చెప్పబోతుంటే నలుగురు స్టూడెంట్సు లోపలకు వచ్చారు ఏవైనా డౌట్స్ ఉన్నా పాఠాలు అర్థం కాక పోయినా ఆదివారం ఇంటికి వస్తారు నేను కూడా విసుక్కోకుండా చెప్పడం వలన వాళ్ళు ఫ్రీగా వస్తారు

గుడ్ మోర్నింగ్ మేడమ్

గుడ్ మోర్నింగ్

పరాంకుశం గారిని చూసి మేడమ్ మీరేదో మాట్లాడు తున్నట్టున్నారు మళ్ళీ కలవమంటారా అన్నారు

పరవాలేదు కూర్చోండి

డౌట్స్ క్లియర్ చేసి పంపించాను

అప్పటికే మధ్యాహ్నమయింది

పరాంకుశం గారిని బోజనం చేసి వెళ్ళమన్నాను

ఆయన కాదనకుండా డైనింగ్ టేబిలు దగ్గర కూర్చున్నారు నన్ను కూడా కూర్చోమన్నారు బాబుతో తప్ప ఒంటరిగా బోజనం చేయడం నాకు అలవాటు లేదు

స్వరూపా ఇన్నాళ్ళకు తృప్తిగా తింటున్నానమ్మా ఎంత డబ్బు ఉండి ఏం లాభం మీ అత్తయ్య నేను బోజనాలకు వచ్చేసరికి అందరూ గుర్తొస్తారు మెతుకులు కెలకడమే తప్ప కడుపునిండా తినలేం

ఆయన దేనికో బాగా బాధపడుతున్నట్టు తోచింది

కోడలు ఇలా కొసరి కొసరి తినిపిస్తుంటే ఏ అత్తా మామయ్యలకు తృప్తిగా ఉండదమ్మా

బోజనం చేసి వరండాలో కూర్చున్నారు

కిరణ్ ఇంకా రాలేదు

ఒక ఊరులో ఈ చివరన నీవు ఆ చివర్లో మేము పగతో కోపంతో నువ్వు మాకేదో అన్యాయం చేసావన్న బాధతో నిన్ను దూరంగా ఉంచాం అలా చేసినందుకు ఇప్పుడు బాధ పడుతున్నాం

బార్గవ జైలు నుండి వచ్చింతర్వాత నువ్వు వాడితో పూర్తిగ బంధం తెంచుకుని దూరంగా పొమ్మన్నావు ధైర్యంగా ఆ నిర్ణయం తీసుకున్నా ప్రశాంతంగా ఆలోచించ వలసింది వాడు మారానని అన్నప్పుడు కూడా నీవు వినలేదు రాక్షసుడు అతని తత్వాన్ని పోగొట్టుకుని మానవత్వంగా బ్రతుకుతానంటే అతని కొక అవకాశం ఇచ్చి చూడాలి నిజంగా మారాడా లేదా ఆ అవకాశం కూడా వాడికివ్వకుండా గెంటేసావు

అని ఆగిపోయాడు పరాంకుశం

ఈ మాటలు చెప్పడానికే వచ్చాడా ఇతను




నామనసు మార్చాలనేగా ఇతని ప్రయత్నం

మార్చినా ఏం లాభం?

అనుభవించ వలసిన జీవితంలో అన్నిటికి దూరమై బ్రతుకు తున్నాను ఇంకా ఏం మిగిలాయి అంతలో బార్గవ ఛాలెంజ్ గుర్తొచ్చింది తను ఓటమిని ససేమిరా పొంద కూడదు తను గెలవాలి

ఏంటమ్మా ఆలోచిస్తున్నావు

ఏం లేదు మామయ్యగారూ గతించిన కాలాన్ని కలగా ఎప్పుడో మరచిపోయాను ఆ జ్ఞాపకాలు నాకు ఆనందాన్ని గాని బాధను గాని ~ వ్వడం లేదు రొటీన్ లైఫ్‌లా సాగిపోతుంది

చూడమ్మా నీ ధైర్యం నాకు తెలుసు ఇంత వరకూ బాధలు అనుభవించావు ఈ వయసులో కూడా ఇలా ఒంటరిగా నా అనే వాళ్ళకు దూరంగా ఉండడం నాకిష్టం లేదు రెపో మాపో అన్నట్టున్న మా ముసలి ప్రాణాలకు తోడుగా ఉంటే చాలమ్మా

అంటే వీళ్ళు తనను ఇంటికి రమ్మని చెప్పడానికే వచ్చాడా ఈ బుద్ధి ఈ ముసలి వాళ్ళకు పుట్టిందా లేదా బార్గవే రమ్మన్నాడా నాకు ముఖం చూపించడానికి ధైర్యం చాలక ఇలా నాటకం ఆడిస్తున్నాడా అదే అడిగాను

చూడమ్మా నిన్ను తీసుకు రమ్మని చెప్పడానికి కూడా వాడు మా దగ్గర లేడు

అతనలా అనగానే ఆశ్చర్యంతో కళ్ళప్పగించాను

బార్గవ తల్లితండ్రుల దగ్గర లేడా!

ఎక్కడ ఉన్నాడు?

పాప ఎలా ఉంది?

ఏ రోజైతే నువ్వు సంసారం చేయనని మొండిగా చెప్పావో ఆ రోజే బార్గవ మమ్మల్ని విడిచి వెళ్ళిపోయాడు నీకు వాడే అన్యాయం చేసాడో వాడికి నువ్వే ద్రోహం తలపెట్టావో తెలియదు కానీ జీవితాంతం బాధపడే శిక్ష మాకు వేసి వెళ్ళిపోయాడు ఎంత బ్రతిమాలినా వినిపించుకోకుండా మా ముసలి ప్రాణాలను మానసిక క్షోభకు గురిచేసి వాడిదారి వాడు చూసుకున్నాడు ఇలా ఎందుకు జరిగింది?

ఇంకా ఏం జరగాలనో ఇలా అయిందో తెలియడంలేదు ఇంటి నుండి డబ్బు తీసుకెళ్ళి ఎక్కడో వ్యాపారం చేసుకుంటున్నాడని మాత్రం తెలిసింది నెలకు రెండు నెలలకు వచ్చి చుట్టం చూపుగా చూసి వెళ్ళిపోతున్నాడు వాడు అలా అయిపోయాడు కనీసం నువ్వయినా బాబుతో ఇంటికొచ్చి మాకు ఆసరాగా ఉంటావని నా ఆశ

పరాంకుశం కళ్ళు చెమ్మగిల్లాయి

నేనేం మాట్లాడలేదు

లక్షాధికారులు

డబ్బుతో సర్వం కొనుక్కోగల శ్రీమంతులు

సిరిసంపదలుండి ఏం లాభం

ప్రేమాభిమానాలు కరువైనప్పుడు

బార్గవ

దుర్మార్గుడు రాక్షసుడు

తనతో నే కాదు తల్లి తండ్రులతో కూడా ఆడుకుంటున్నాడు

ఎన్ని సంవత్సరాలు గడచినా భర్తగా అతన్ని వూహించలేక పోతుంది నా మనసు ఎవరు గెలుస్తారు? ఎవరు ఓడిపోతారు? అన్నదే మా ఇద్దరి మధ్య ఉన్న చాలెంజ్

ఎవరు గెలిచినా!

ఎవరు ఓడినా! ఫలితం

ఎడారి జీవితం

మామయ్యగారూ బాబును చూసుకుని బ్రతుకుతున్నాను ఈ జన్మకిది చాలు ఏ బంధాల మీద బంధుత్వాలమీద మమకారం లేదు

ఖచ్చితంగా చెప్పేసాను

పరాంకుశం నిరాశగా వెళ్ళిపోయాడు

(ఇంకా ఉంది)



# దూరదర్శన్ కార్యక్రమాలు



రావినూతల
సువర్ణా కన్నన్

**టి. వి.** అన్నా టి వి ప్రోగ్రామ్ అన్నా అందరికి ఇష్టమే సిన్మిమా ల్లాంటివి వేరె థియేటర్స్‌కి వెళ్ళకుండా హాయిగా మనింట్లో కూర్చునే చూడచ్చు నలు మూలల్నించి ప్రసారం అయ్యే రకరకాల డ్రామాలు నృత్యాలు సంగీతాలు న్యూస్‌లు చూడచ్చు వినోదాన్ని విజ్ఞానాన్ని పొందచ్చు

ఇవి టి వి రాబోతోందన్నప్పటి మా ఉద్దేశాలు అయితే ఆ టి వి వచ్చిం దగ్గర్నించి మా అంచనాలన్ని తారుమారైపోయాయి మా కృష్ణా జిల్లా వారికి

కారణం టి ఎ లో ప్రసారమయ్యేవి దాదాపు అన్ని హింది కార్యక్రమాలె నేషనల్ ప్రోగ్రామ్స్ మొత్తం హిందివే నాటకాలు సినిమాలు పాటలు డాన్సులు దాదాపు అన్ని హిందివే

హమ్‌లోగ్ ఏజో హై జిందగి రజని సిరియల్స్ వస్తున్నాయి అవి బాగానే వున్నా చాలామందికి అర్థంకావు

హింది మిద కేంద్రానికి అబిమానం వుండచ్చు అయితె భాష అర్థంకాని వాళ్ళ మిద ఆ భాష



బలవంతంగా రుద్దితె జరిగెది ఆ బాష మిద మరింత వెగటుతప్ప అబిమానం మాత్రం కాదు

శ్రిలంక ప్రోగ్రామ్స్ అప్పుడప్పుడు వస్తూ వుంటాయి వాతావరణాన్ని బట్టి అందులో సింహళం ఇంగ్లిష్ తమిళం అన్ని సమపాళ్ళలో వుండి - అక్కడున్న ప్రజలందరికి తృప్తిని కలిగిస్తాయి

అంతెందుకు మన తమిళనాడులో కూడా నేషనల్ ప్రోగ్రామ్స్ టైమ్‌లో కొంత హిందిని తొలగించి తమిళ్ చేర్చారు మనకి మాత్రం హింది తప్ప మరొకటిలేదు

క్విజ్ లూసి లాంటి ఇంగ్లిష్ ప్రోగ్రామ్స్ కొంతలో కొంత నయం

చైనా లాంటి దేశాల నుంచి ప్రసారం అయ్యే ప్రోగ్రామ్ కూడా హిందివే విదేశియుల దృష్టిలో ఇండియా అంటే హింది' అనేలా చేసేశారు కేంద్రంవారు మనది పదమూడు అదికార బాషలు 200 లకి పైగా అనదికార బాషలు కల దేశం ఇన్ని బాషలు ప్రసారంచెయ్యడం కష్టం అందుకే స్థానికంగా వున్నవారి మెజారిటిని బట్టి ప్రోగ్రామ్స్ పెడితే అందరికి అర్థం అవుతుంది అందరి పట్లా న్యాయం చేకూర్చిన వారవుతారు

దేశంలో నూట ఇరవై పట్టణాలకి పైగా 100 వాట్స్ రిలే కేంద్రాల్ని ం నిర్మించింది ప్రభుత్వం అందుమూలంగా ఆయా పట్నాలవారూ పరిసరాల వారూ టి వి ప్రోగామ్స్ ఏదో ఒకటి స్పష్టంగా చూడగలుగుతున్నారు కాని కృష్ణా జిల్లా దురదృష్టం ఏమిటంటె ఇటీవల విజయవాడలో వన్ కె వి రిలే కేంద్రం పెట్టి చుట్టుప్రక్కల వున్న బందరు గుడివాడ గుంటూరు ఎలూరు లాంటి పట్నాలని ఫ్రింజ్ ఎరియాగా చేసేశారు

అందువల్ల టి వి ఖరిదులో సమారు సగం యాంటినా నిర్మించడానికి ఖర్చవుతోంది సామాన్యులు టి వి కొనాలని అనుకొన్నా కొనలేకపోతున్నారు

ఇటీవల ఉపగ్రహం ద్వారా కొన్ని తెలుగు ప్రోగ్రామ్స్ రిలే చేస్తున్నారు అవి చూస్తుంటే టి వి అంటేనే ఒక రకమైన విరక్తి కలుగుతోంది

గేదెలు ఆవులు వాటి సంరక్షణ పురుగుల్ని చంపడం ఎలా' బుర్రకథలు లాంటివి వస్తున్నాయి ఆదికాక పోతే కర్ణ కఠోరమైన లలిత సంగీతం

ఇంక చిన్నపిల్లల ప్రోగ్రామ్స్'

అవి ఉదయం సరిగ్గా వాళ్ళు ఇంటికి స్కూల్‌కి మద్యలో వుండగా ప్రసారం అవుతాయి కొన్ని రాత్రి పదకొండు గంటలకి వుంటాయి అవి ఏ పిల్లలు చూడగలుగుతున్నారు?

ముఖ్యంగా ఇంత పెద్ద ఆంధ్రప్రదేశ్‌క ఒకే ఒక్క టి వి కేంద్రం వుండడం చాలా విచారించవలసిన విషయం అందుకే కొండపల్లిలో నిర్మించాలనుకున్న 10 కె వి టి వి కేంద్రం త్వరలో నిర్మిస్తే కొంత మెరుగవచ్చు

నిజానికి దూరదర్శన్ ప్రసారం చేసే ప్రోగ్రామ్స్ కన్నా స్పాన్సార్డ్ ప్రోగ్రామ్సే కాస్త బావుంటున్నాయి ఇవన్ని దృష్టిలో పెట్టుకొని టి వి అదికార్లు ప్రోగ్రామ్స్ విషయంలో మరి కాస్త శ్రద్ధ వహించాలి

టి వి ప్రోగ్రామ్స్ టి వి చూసే వార్కి ఆసక్తికి అనుగుణంగానూ దేశ విదేశాల్లోని మంచి చెడ్డల్ని తెలియజేసే విదంగానూ విజ్ఞానా వినోదాన్ని అందించేదిగాను వుండాలి' అందుకు తెలిసిన భాష అయ్యి వుండాలి కనీసం స్థానిక బాషల్లో వరసక్రమంగా ప్రోగ్రామ్స్ వచ్చేలా ప్లాన్ చేసుకోవాలి సమయానికి తగ్గట్టు ప్రోగ్రామ్స్ బ్రాడ్‌కాస్ట్ చెయ్యాలి'

అప్పుడె అందరికి న్యాయం చేసిన వారవుతారు అందుకు తగిన విదంగా టి వి స్టూడియోలు ఎక్కువగా నిర్మించాలి నేషనల్ ప్రోగ్రామ్స్ మినహా మిగతా టైమ్‌ల ప్రాంతీయ బాషల్లో ప్రోగ్రామ్స్ వచ్చేలా చెయ్యాలి అప్పుడు గాని టి వి యొక్క పూర్తి ఉపయోగం వుండదు □






### సి హెచ్ ఎస్ బొంబాయి

★ మీ జవాబులు కొన్ని వాస్తవానికి దగ్గిరగా వున్నా మగజాతిని కించపరిచేవిగా ఉంటాయి

● ఏం వాళ్ళనెవరూ ఎందుకూ నిజం చెప్పి కించపరచకూడదా?!

### పి ఎం.ఎమ్ కూనవరం

★ ఒకే రక్త సంబందంగల అక్కాతమ్ముళ్ల పిల్లలు మేనరికంగా పెళ్లి చేసుకుంటే సంసారిక జీవితంలో పరిణామా లెలా వుంటాయి?

● ఇదమిద్ధంగా చెప్పలేంగాని శాస్త్రవేత్తలు యిటువంటి సంబంధాలు- వంశపారంపర్యంగా జరుగుతూ వస్తున్న కుటుంబాలలో- జన్మించే పసివాళ్లలో ఇంబ్రీడింగు ఫలితంగా బుద్ధి మాంద్యం, వికలాంగ ప్రమాదాలు రావచ్చునని అంటున్నారు

### ఎ ఆర్ పాల్వంచ

★ ఒకమ్మాయి ఒక ఆఫీసరుతో లవర్స్‌డెన్‌కు వెడుతుంది ఎక్కడో అపవిత్రం జరిగి పోయిందని బెంగెట్టుకు చావడం అనవసరం గుండె వుండాలి గుబాళించాలి అంటుంది దీని అర్థం?

● నా ఏడుపు నేను ఏడుస్తాను మీ ఏడుపు మీరు ఏడవండి- అని

### జి ఏ ఆర్ ఆర్ విజయవాడ

★ రహస్యం?

● ఆయుధమే కాదు- ఫ్రెండ్ కూడా మనిషి దేవుని రహస్యం- మనిషి రహస్యం అతని శక్తి స్త్రీ రహస్యం ఆమె సెక్సు

### ఎస్ వి సంగం జాగర్లమూడి

★ అందం మంచి అనే రెండు గుణాలూ చాలా తక్కువమంది ఆడవారిలోనూ చాలా ఎక్కువ మంది మగవారిలోనూ కల్పించి దేవుడు సమాజానికి చాలా మేలు చేశాడు- అన్న వ్యక్తి ఏవరో తెలుసా?

● అడగాలి కూడానా!! మగాడు మగవాని యీగో దెబ్బ తింటుందని స్త్రీ తన తెలివి దాచుకుంటుంది మగవాడది గ్రహించలేక అనేక మార్లు ఫూలవుతూ వుంటాడు!

### టి ఎమ్ హెచ్ ఏ మండపేట

★ అసలు బగవంతుడున్నాడా? మరో జన్మ వుందా? అసలు దేవుడే లేడు అనుకుంటున్నాను మీ సమాధానం?

● వద్దు మీరలాంటివి పైకంటే పబ్లిక్‌గా నాలుగు కొరడా దెబ్బలు అంటూ శిక్షిస్తారు?అప్పుడు మళ్ళీ మీరే దేవుడున్నాడు మా దేవుడే- అసలు దేవుడు అనాలి

### బి ఏ ఆర్ రాయగడ

★ స్త్రీ మనసు గొప్పదా? పురుషుని మనస్సు గొప్పదా?

● మనసంటూ వుంటే- ఎవరికున్నా గొప్పే కద!

### ఎస్ ఎస్ పి పొద్దుటూరు

★ అక్కగారూ మేనరికాలు చేసుకొంటే బద్ధలు అనారోగ్యవంతులవుతా రంటారే- యిది నిజమేనా?

● ఇటువంటి అనుమానాలు మీ కుటుంబ వైద్యునితో సంప్రదించాలి ఆయన సలహాలు విని- పాటించాలి

### బి ఆర్ కోరుకొండ

★ డాక్టర్ల బోర్డులకి ఎర్రలైటు ఎందుకు పెడతారు?

● ఎరుపు ఎమర్జెన్సీకి చిహ్నం కదా- అవసరంలో - తప్పిపోకుండా - గుర్తు పట్టడానికే- ఆ ఎర్రకాంతి

### ఎన్ బి నారాయణపేట

★ వేరువేరు కులముల వారు పెళ్లి చేసుకున్నారు ఇప్పుడు వారి పిల్ల యుక్త వయస్కురాలైంది ఏ కులం వాడిని పెళ్లి చేసుకోవాలి?

● ఏం? ఆ పిల్ల తేల్చుకోదా?!

### డి ఎల్ ఏ లింగాల

★ నింగి నేల కలిసే చోట నువ్వు నేను ఒకటౌదాము అన్నారొక ప్రముఖ సినీకవి ఈ విశాల ప్రపంచంలో నింగి నేలా ఎక్కడేనా కలిసిందా?

● అవి కవి సమయాలు కవి అంటే అసంబవం కూడా సంబవమవుతుంది- అని కాబోలు అంటున్నాడు సినీ గీతానికి బొమ్మ ఎలా తీయాలనే చూస్తాడు గాని- నిజా నిజాలు కాదు- కెమెరా కన్నుకే పని

### ఎమ్ ఎ ఆకివీడు

★ మిమ్మల్ని పెళ్లాడాక ఆరుద్రగారు 'పేరడైజ్ లాస్టు' లాంటి కవితా సంపుటి ఏదైనా రాశారా?

● లేదు! కనీసం 'పేరడైజ్ రిగైన్డ్' అనేనా రాయలేదు అన్యాయం కదూ?!

### ఎం ఎన్ కె కాకినాడ

★ మన దేశంలో వాక్ స్వాతంత్రం వుంది కాని విద్యార్థులు నిరుద్యోగులు నేటి సమాజంలో జరుగుతున్న అన్యాయము అరి కట్టండి అంటే నక్సలైట్లుగా చిత్రిస్తారెందుకు?

● మనకి కొన్ని చోట్ల వినే స్వాతంత్రమే వుండాలని అదికారుల ఆశ అంచేత అలా అంటారు

### సి హెచ్ ఎన్ ఆర్ సబ్బైనపల్లి

★ రామలక్ష్మిగారూ పుకార్లు వదంతులు ప్రచారం చేయడంలో స్త్రీలు ప్రథమస్థానం వహిస్తారని నేను అంటాను

● అంకెలూ లెక్కలూ అంచనాలూ ప్రచురించండి- ఇప్పుడది కదా పాషన్!

★ ఈనాడు బారతమాత స్థితి ఎలా వున్నది?

● ఎలావుందని అనుకునే ఓపిక కూడా లేకుండా వున్నట్టనిపిస్తోంది నాకు! □

## అక్కినేని నాగార్జున తొలి చిత్రం విక్రమ్ ఫిబ్రవరి 16న విడుదల

విశాఖపట్నం ప్రాంతాలలో రెండు సాంగ్స్‌ను బొంబాయి ఫైటర్ మాణిక్ ఇరానీతో హీరో నాగార్జున తలపడే సన్నివేశాలను ఎక్సరైజ్ చేశాక జనవరి 1 నుండి 6 వరకు హైదరాబాద్‌లో చివరి షెడ్యూల్ పూర్తి చేశాం ఫిబ్రవరి 16న విడుదల చేయడానికి సన్నాహాలు చేస్తున్నాం అన్నారు వెంకట్ అక్కినేని ఈయన నిర్మించే అన్నపూర్ణ స్టూడియోస్ విక్రమ్ చిత్రంలో శోభన చంద్రమోహన్ సత్యనారాయణ సుదాకర్ రమాప్రభ పుష్పంతో ఇతర తారాగణం సుభాష్ గై కథకు సత్యానంద్ సంభాషణలకర్త చక్రవర్తి సంగీతం సుందరం ఛాయ అక్కినేని సంజీవి కూర్పుతో శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించే ఈ చిత్రానికి వి మదుసూదనరావు దర్శకుడు

## క్రాంతికుమార్ నాగార్జున కాంబినేషన్‌లో అరణ్యకాండ

జనవరి 20 నుంచి ఫిబ్రవరి 20 వరకు రాజమండ్రి దగ్గరున్న మారేడుమిల్లి అడవుల్లో షూటింగ్ అన్నారు క్రాంతికుమార్ ఈయన దర్శకత్వంలో కొమ్మనాపల్లి గణపతిరావు నవల అరణ్యకాండ

# సినిమా

## విశేషాలు - జి వి జి

ఆదారంగా ఉషాదయా మూవీస్ అదినేత ఎస్ సుదాకరరెడ్డి నిర్మించే ఫై చిత్రంలో అక్కినేని నాగార్జున సరసన ఓ నవనటి నాయిక చరణ్‌రాజ్ రాదిక తులసి అన్నపూర్ణ ఎ ఎల్ నారాయణ వేలు సంయుక్త శ్రీలక్ష్మితో పాటు ఒక పులి కూడా పాల్గొంటుంది గణేశ్‌పాత్రో మాటలు చక్రవర్తి సంగీతంహరి అనుమోలు ఛాయ రంగారావు శిల్పం జయబాబు– నాగేశ్వరరావు ప్రొడక్షన్ కృష్ణ కూర్పు తెర వెనుక హంగులు

## శోభన్‌బాబు మిస్టర్ బరత్ గా జయకృష్ణ నిర్మించే చిత్రం

కన్నతల్లికి అన్యాయం చేసిన తండ్రి మీద తనయుడు తీర్చుకునే ప్రతీకారం శోభన్ తండ్రిగా చరణ్‌రాజ్ నటిస్తున్నారు సుహాసిని నాయిక సెంటిమెంట్‌తో పాటు పుష్కలంగా యాక్షన్ ఉంటుంది ఫిబ్రవరి నెలాఖరుకు షూటింగ్ పూర్తవుతుంది అన్నారు జయకృష్ణ ఈయన నిర్మిస్తున్న ముద్దు ఆర్ట్ మూవీస్ మిస్టర్ భరత్ చిత్రంలో సత్యనారాయణ గొల్లపూడి రాజశేఖర్ శారద రజని కె విజయ ఎంధూరి ఇతర పాత్రధారులు గణేష్‌పాత్రో మాటలు ఇళయరాజా సంగీతం కె ఎస్ హరి ఛాయ చలం శిల్పం ఎమ్మెస్ సహదర్శకత్వం ఎం రామారావు ప్రొడక్షన్ రాధాకృష్ణ – నానాజీ సహకార దర్శకత్వంతో రాజాచంద్ర స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాద్యతలు వహిస్తున్నారు

## ఎన్ బి చక్రవర్తి దర్శకత్వంలో సి వి ఎన్ ప్రొడక్షన్స్ చిత్రం

గొల్లపూడి మారుతిరావు సమకూర్చిన కథ అన్నారు ఎన్ బి చక్రవర్తి ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాద్యతలు వహిస్తున్న ఫై సంస్థ చిత్రంలో అర్జున్ రజని గొల్లపూడి ముచ్చెర్ల అరుణ రాళ్ళపల్లి వేలు వై విజయ శ్రీ లక్ష్మి సుదాకర్ వగైరా నటవర్గం సత్యానంద్ సంభాషణలు వేటూరి గీతాలు చక్రవర్తి సంగీతం ఎస్ సుదాకర రెడ్డి ఛాయ శాయికుమార్ శిల్పం వెంకటరత్నం కూర్పు ఎస్ వెంకటేశ్వరరావు ఉదయకుమార్ ప్రొడక్షన్ గణేష్ సహదర్శకత్వంతో ఎ వి నర్సింహా రెడ్డి నిర్మాత

కెప్టెన్ నాగార్జున లో స్రవంతి



మాదవి శపదం లో









## "బండ రాముడు"

జనవరి 1 నుంచి 10 వరకు తొలి షెడ్యూల్ పూర్తి చేశాం ఫిబ్రవరి 1 నుంచి నెలాఖరు వరకు జరిగే మలి షెడ్యూల్‌తో షూటింగ్ ముగుస్తుంది, అన్నారు రవీంద్రబాబు ఈయన కథ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డేలిశ్రీ రామమోహనరావు, మండవ వెంకటరావు నిర్మిస్తున్న లక్ష్మి గణపతి మూవీస్ వారి పై చిత్రంలో రామకృష్ణ హెగ్డే ఆనంద్‌బాబు కె ఆర్ విజయ అర్చన కోట శ్రీనివాసరావు రాళ్ళపల్లి వేలు, పి ఎల్ నారాయణ, మంజు అన్నపూర్ణ శ్రీ లక్ష్మి, పి ఆర్ వరలక్ష్మి, అనూరాధ ఆదిగాగల వారు

## సినిమా

పాల్గొంటున్నారు కొంపెల్ల విశ్వం సంభాషణల కర్త వి ఎస్ నరసింహన్ స్వరకల్పనలో ఆత్రేయ వేటూరి గీతాలు రాశారు ఎన్ ఆర్ కె మూర్తి చాయ రంగారావు శిల్పం, సాహుల్ సాహసాలు మల్లికార్జునరావు ప్రొడక్షన్ నిర్వహిస్తున్నారు

## "పదహారేళ్ళ అమ్మాయి"

వసుందర నవల –'పదహారేళ్ళ వయసు ఆదారం అన్నారు పి ఎస్ కృష్ణ మోహన్ రెడ్డి ఈయన గతంలో దాసరి పి సి రెడ్డి వద్ద పలు చిత్రాలకు సహకార దర్శకుడుగా పని చేశారు ఈయన దర్శకత్వంలో శ్రీ శైలజ ఫిలిమ్స్ అధినేత ఆర్ డి రెడ్డి నిర్మించే పై చిత్రంలో రాజేంద్ర ప్రసాద్ చిత్ర వేలు నూతన్ ప్రసాద్ పి ఎల్ నారాయణ వీరభద్రరావు రాజ్‌కుమార్ నటిస్తున్నారు గణేష్ పాత్రో మాటలు శివాజీ స్వరకల్పనలో ఆత్రేయ వేటూరి గీతాలు రాశారు దివాకర్ బాబు చాయ తోట యాదు శిల్పం కె రామగోపాల్ రెడ్డి కూర్పుతో సత్యారెడ్డి సమర్పిస్తారీ చిత్రాన్ని



LAKSHMI PUBS

## "రక్త తర్పణం"లో ఇన్‌స్పెక్టర్ సంకటం

పోలీస్ స్టేషన్ ఇన్‌స్పెక్టర్ (వేలు) ఎదురుగా చంద్రం (చంద్రమోహన్), రాద (తులసి) శేషయ్య (మిక్కిలినేని) కూర్చొనున్నారు అందోళనగా ఇన్‌స్పెక్టర్ లారితో తల మీద కొట్టుకుంటూ ఒప్పుకున్నాను ఒప్పుకున్నాను బారతదేశంలో బందిపోట్లు, ఆంధ్రదేశంలో అరాచక శక్తులు చెలరేగిపోతున్నట్టే – ఈ పారెస్ట్‌లో గందం చెక్కల దొంగతనంతో పాటు ఇప్పుడు మర్డర్లు కూడా జరిగిపోతున్నాయని ఒప్పుకుంటున్నాను సరా?" అన్నాడు

మాక్కావల్సింది మీరు బిప్పుకున్నారా – లేదా అని కాదండి నిన్న రాత్రి మా అమ్మాయి అల్లుడు అని శేషయ్య వాక్యం పూర్తి చేసే లోగా ఇన్‌స్పెక్టర్ షికారు కెళ్ళి, చట్టవిరుద్ధమైన నేరం చేశారు ఒక వేళ కుర్రతనం కొద్ది షికారు కెళ్ళినా ముందుగా మాతో పోన్ కొడితే తగినంత బందోబస్తు ఏర్పాటు చేసే వాడ్ని కదా? అన్నాడు

ఘోరం జరిగిపోయిందని మేం రిపోర్టివ్వడానికొస్తే, నేరం మేం చేశాం అంటారేమిటండి? ఈ దారుణం చేసిన వాళ్ళు ఎస్టేట్ ఓనర్ విక్రమ్ వాడ స్నేహితులూ అని చెప్పాం కదండి' అన్నాడు చంద్రం చిరాగ్గా

చెప్పారు గాని వాళ్ళేమైనా అషామాషి మనుషులా అర్జంట్‌గా వెళ్ళి అరెస్ట్ చేయడానికి? వాళ్ళ పేర్లు వదిలేసి మరో ముగ్గురి పేర్లు చెప్పండి అన్నాడు ఇన్‌స్పెక్టర్

అలా అయితే మేం పట్నం వెళ్ళి ఎస్ ఎ గారితో నే చెప్పుకుంటాం అంటూ లేచాడు చంద్రం

ఇన్‌స్పెక్టర్ తృళ్ళి పడినా వెంటనే తమాయించుకుంటూ అబ్బా ఎమిటండి ఇంత చిన్న విషయానికి ఎస్. పి. గారి దగ్గర కెళ్తానంటారు? నేను డిటెక్టివ్ యుగంధర్ని సి. ఐ. డి. సికిందర్ని చంపి పుట్టానని తెలియక మీరలా అంటున్నారు మేం వాళ్ళకి బయపడి పోతున్నాం అనుకోకండి మాతో 'లా అంటే 'లా యే; ఆర్డరంటే 'ఆర్డరే' ఈ రాత్రికే మేం వెళ్ళి వాళ్ళని చీల్చి చెండాడేస్తాం అంటూ రివిగా లేచాడు

తాతినేని ప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వి సుబ్బరాజు సమర్పించే సాయికృష్ణ ఆర్ట్స రక్త తర్పణం చిత్రానికి రామచంద్రరాజు సత్యనారాయణరాజు నిర్మాతలు

## ఎ ఎన్. ఆర్ హీరోగా దాసరి దర్శకత్వంలో జయసుధ స్వంత చిత్రం "ఆది దంపతులు"

ఎవరు ఎవరికి ఎలాంటి సహాయం చేసినా అది అవతలి వారికి అత్యావశ్యకమైన సమయంలో చేస్తేనే సార్థకముంటుంది అనే ప్రాతిపదికపై అనూహ్యమైన మలుపులతో అల్లబడిన కథ అన్నారు దాసరి నారాయణరావు ఈయన మాటలు పాటలు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నిదిన్‌కపూర్ నిర్మాతగా జయసుద సమర్పించే జె ఎస్ కె కంబైన్స్ చిత్రంలో ఎ. ఎన్. ఆర్., జయసుధ "ఆది దంపతులు". చంద్రమోహన్, నరేష్, త్రినాధ్, తులసి రాజ్యలక్ష్మి పూర్ణిమ రాజసులోచన తతిమ్మా తారాగణం సత్యం సంగీతం, సెల్వరాజ్ ఛాయ, బి చలం శిల్పం రవికుమార్ సహదర్శకత్వం, అరవింద్ ప్రొడక్షన్ కృష్ణ కూర్పుతో ప్రతిబాశాస్త్రి నిర్మాణ సారది జనవరి 19 నుంచి ఫిబ్రవరి 4 వరకు అన్నపూర్ణా స్టూడియోలో మొదటి షెడ్యూల్ పూర్తయింది మార్చి 20 నుంచి 31 వరకు ఔట్‌డోర్‌లో జరిగే షెడ్యూల్‌తో చిత్రీకరణ ముగుస్తుంది



# "నేను స్క్వాష్‌లూ, సిరప్‌లూ మానేసి రుచికరమైన రస్న వాడటం మొదలెట్టాను... అంతే, ఇక రికరింగ్ డిపాజిట్ ఎకౌంటు కూడా తెరిచాను!"

మొదట్లో నేను సాఫ్ట్ డ్రింక్స్‌కు ఎంతో డబ్బు అనవసరంగా ఖర్చు పెట్టేదాన్ని మరి ఇంట్లో ప్రతి ఒక్కరికీ కావాలాయె— ప్రతి నెలా ఎంతో ఖర్చయ్యేది కాని, రుచికరమైన రస్న గురించి నాకు తెలిసాక, ఇప్పుడు ఆ వృధా ఖర్చు మరి లేదు




అవును, రుచికరమైన రస్నలోని గొప్పతనం అదే ఎంతో పొదుపైనది, పైగా, ఎంతో రుచిభరితమైనది రస్న ఎందుకంటే విడివిడిగా వచ్చే రెండు కాన్సంట్రేట్ల మేళనంతో తయారయ్యేది ఇదొక్కటే పౌడరు ద్రవ రూపాల్లోని రెండు కాన్సంట్రేట్ల మేళవింపు వల్ల, అసలైన కమ్మని రుచి అలాగే నిలిచి మరింత పసందుగా ఉంటుంది తక్కువ ఖర్చుతో ఎంతోమందికి పానీయం అందించవచ్చు— ఒక్కొక్క ప్యాక్‌తో 32 గ్లాసుల చవులూరించే పానీయం తయారవుతుంది మరి పైగా, ఎంచుకొనేందుకు 10 రకాల చిక్కటి రుచులు !

ఫలితంగా, రుచికరమైన రస్నతో ఇంటిల్లిపాదీ మరింత కమ్మని పానీయాలు తాగవచ్చు తక్కువ ఖర్చుతో ఎక్కువ మజా, ఎంతో ఆదా ! అలా ఆదా అయ్యే డబ్బుని రికరింగ్ డిపాజిట్ ఖాతాలో వెయ్యవచ్చు—ప్రతి నెలా కొద్ది నెలల్లోనే ఆ డబ్బుతో మీరు ఓ కొత్త ప్రెషర్ కుక్కర్ కొనుక్కోవచ్చు, లేదా ఇంకేదైనా వస్తువు కొనుక్కోవచ్చు ఏమంటారు ?

సిఫారసు చేయబడిన గరిష్ట చిల్లర అమ్మకం ధర రూ 6/-




**రస్న రుచిభరితం. కేవలం పౌడర్ కన్నా ఎంతో రసమయం.**

Mudra A PI 2973 TEL



భారతదేశపు అత్యధికంగా అమ్ముడవుతున్న
సాఫ్ట్ డ్రింక్ కాన్సంట్రేట్

బ్రిటన్, నార్వే, మాలవి, సుడాన్, కెన్యా, సౌదీ అరేబియా, మారిషస్, ఈజిప్ట్, దుబాయ్, కువైత్, బహ్రెయిన్, ఫిజీ దేశాల్లో కూడా దొరుకుతోంది

**పయోవమా ఇండస్ట్రీస్,** అసార్వా, అహ్మదాబాద్ 380 016



రాక్షసప్రేమ
-రాధిక-

# సినిమా

## కృష్ణ, ప్రభాకరరెడ్డి కాంబినేషన్‌లో "ప్రతిభావంతుడు" మూడో షెడ్యూల్ ముగింపు

పెడ్డదారి పట్టి కుటుంబ విచ్ఛిన్నానికి పూనుకున్న వారిని తన తెలివితేటలతో మంచిదారిన పెట్టే ఒక విశిష్టమైన పాత్రలో కృష్ణ అసమాన చాతుర్యంతో నటిస్తున్నారు జనవరి 21 నుంచి 31 వరకు మూడవ షెడ్యూల్ పూర్తి చేశాం ఫిబ్రవరి 20 నుంచి నెలాఖరు వరకూ జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తయి పోతుంది అన్నారు నటుడు కథకుడు డాక్టర్ ఎం ప్రభాకరరెడ్డి ఈయన తొలుదొల్త దర్శకత్వం వహిస్తున్న ఎస్ ఆర్ ఫిలిమ్స ప్రతిభావంతుడు చిత్రంలో కృష్ణ సరసన బానుప్రియ తొలిసారిగా నాయికగా నటిస్తోంది శ్రిదర్, గుమ్మడి, ప్రసాద్‌బాబు రాజ్‌వర్మ అల్లు రామలింగయ్య వేలు షావుకారు జానకి, శుభ కె విజయ సంయుక్త అన్నపూర్ణ తక్కిన నటవర్గం మద్దిపట్ల సూరి మాటలు సత్యం స్వరకల్పనలో ఆత్రేయ సి నారాయణరెడ్డి గోపి గితాలు రాశారు పుష్పాల గోపీకృష్ణ చాయ బాస్కరరాజు శిల్పం, రామ్‌సూరి- గారసత్యం సహదర్శకత్వం, ఎస్ వెంకటేశ్వరరావు నిర్వహణ కోటగిరి గోపాలరావు కూర్పుతో ఎస్ రామచంద్రరావు నిర్మాత

## "కొంటి కాపురం"లో చీరల సుత్తి

కల్యాణరావు (గొల్లపూడి) కాలు కాలిన పిల్లిలాగా గదిలో ఇటు అటు పచార్లు చేస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు అతనేం చెప్తాడోనని ఆత్రుతతో ఎదురు చూస్తూ నిలుచోనుంది అతని భార్య శ్రీమతి (రమాప్రభ).

"అటు చూస్తే పెళ్ళొద్దంటున్నాడు సుందరం. ఇటు చూస్తే రాజీ పడనంటుంది రాజీ. ఏ ఐడియా సూట్ అవుతుందో ఐడియా రావడం లేదు అంటూ ఆగాడు కల్యాణరావు.

"ఓ సారి నేను కూడా ఇలాగే అటు చూస్తే పట్టు చీరలు, ఇటు చూస్తే ఫాన్సీ చీరలు... ఏవి కావాలో తేల్చుకోలేక పోయాను," అంది శ్రీమతి తన సహజమైన చీర భాషతో.

"నో ప్రాబ్లమ్. సుందరం సెంటిమెంట్ అర్థమైంది. అతనితో పెద్ద ట్రబుల్ లేదు."

"అంటే, వాషబుల్ శారీ లాంటి వాడన్న మాట!"

కల్యాణరావు విసుగ్గా చూశాడు. "చూడు, శ్రీమతీ! భర్త దాపుడు చీరలాంటి వాడు. ఇలా చీటికి మాటికి ఉతికేస్తే చిరిగిపోతాడు. అప్పుడు శారీలేని బ్లౌజ్ అయిపోతుంది. నీ జీవితం."

అబ్బ మన పెళ్ళయ్యాక మీరు మాట్లాడిన ముద్దుమాటిదొకటే!"

"ఇక, రాజీ తప్పుదారి పట్టించే నవలలే చదివిందో, లేక ఆ అమ్మాయి స్వబావమే అంతో – మగాళ్ళంటే ఓ విధమైన ఎలర్జీ డెవలప్ చేసుకుంది

అయితే డ్రైక్లీనింగ్‌కి వేయాల్సిందే!

శ్రీమతి! నీ చీర బాషతో నా మతి పోగొట్టకు అంటూ కల్యాణరావు రహస్యంగా శ్రీమతి చెవిలో ఏదో చెప్పాడు

ఆహా! ఈ ఆలోచన కంచిపట్టు చీరలా ఉంది బెనారస్ చీరలా బ్రహ్మాండమండీ ఏమండీ! మిది బుర్ర కాదు సరిగ్గా సరిపోయిన రెడిమేడ్ బ్రా! అంది శ్రీమతి పరమానందబరితురాలై

కల్యాణరావు ఇబ్బందిగా ముఖం పెట్టాడు స్తుతించకు సుస్తి చేస్తుంది గుర్తుంచుకో!

అంటూ మళ్ళీ పచార్లు చేయసాగాడు

ఫిబ్రవరిలో విడుదలయ్యే పి వి ఎస్ పిలిమ్స కొంటి కాపురం చిత్రాన్ని రేలంగి నరసింహారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మిద్దె చంద్రకుమార్ నిర్మించారు

## "కనకదుర్గ వ్రత మహాత్యం"

శివ పార్వతులుగా రామకృష్ణ ప్రభ నారదుడుగా నూతన్‌ప్రసాద్ మాంత్రికుడుగా వంకాయల నటించడం విశేషం అన్నారు బి విరలాచార్య శ్రీనివాస్ ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో కే మహేంద్ర కె ప్రకాష్ నిర్మించే శివశక్తి ఆర్ట్స్ వారి ఫై చిత్రంలో నళిని నరసింహరాజు నాయికా నాయకులు వీరబద్రరావు నర్రా వెంకటేశ్వరరావు జీవా జయమాలిని అనూరాధ తక్కిన నటవర్గం జనవరి 5 నుంచి 11 వరకు మళ్ళీ 20 నుంచి 28 వరకు రెండు షెడ్యూల్స్ జరిగాయి ఫిబ్రవరి 1 నుచి 10 వరకు హొగెన కల్‌లో 11 నుంచి మార్చి 2 వరకు మద్రాస్‌లో జరిగే తదుపరి షెడ్యూల్స్‌లో చిత్రీకరణ ముగుస్తుంది పేరాల కథ మాటలు రాశారు రాజశ్రీ గీతాలకు శంకర్ గణేష్ బాణీలు కూర్చారు డబ్ల్యు ఆర్ చంద్రు ఛాయ నాగరాజన్ శిల్పం శివశంకర్ నృత్యాలు బి ప్రసాద్ ప్రొడక్షన్, దిలీప్ సహకార దర్శకత్వం నాయని మహేశ్వరరావు కూర్పు జి ఉదయకుమార్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు

## వేజెళ్ళ దర్శకత్వంలో హాస్య ప్రధాన చిత్రం

సరదాగా నవ్వించే చిత్రం ఇదొక తాతా మనవళ్ళ కథ తాతగా కోట శ్రీనివాసరావు మనవడుగా నరేష్ నటిస్తున్నారు ఫిబ్రవరి 1 నుంచి 17 వరకు హైదరాబాద్‌లో మొదటి షెడ్యూల్ మార్చి 1 నుంచి 15 వరకు రెండవ షెడ్యూల్ అన్నారు సందేశ సమస్యాత్మక చిత్రాలను రూపొందించడంలో దిట్ట అయిన వేజెళ్ళ ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో జడ్ నవనాదరావు ఎ వెంకురెడ్డి నిర్మిస్తున్న సాహిత్య మూవీస్ చిత్రంలో నరేష్ సరసన మల్లె మొగ్గలు సాగరిక నాయిక వేలు డాక్టర్ శివప్రసాద్ రావి కొండల రావు సుబ్బరాయశర్మ విద్యాసాగర్, బ్రహ్మానందం చంద్రిక ఇతర పాత్రదారులు ఆదివిష్ణు కథ మాటలు రాశారు కన్నబాబు స్వరకల్పనలో కోపల్లె శివరాం ఒలేటి పార్వతీశం పాటలు రాశారు హరిదాస్ ఛాయ ఎ ఎర్రయ్య-శశిదర్ సహకార దర్శకత్వం మురళి కూర్పుతో కృష్ణారెడ్డి- శైలేష్ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు




మి చిత్రానిక యు గానీ ఏ గాన సర్టిఫికెట్ ఇవ్వటానికి వీల్లేదు-ఇక 'ముసలివారికి మాత్రమే' అన్న కొత్త సర్టిఫికెట్ సృష్టించి ఇవ్వటానికి పరిశీలిస్తాం!

## ఎ ఎన్ ఆర్, సుహాసినిలతో మధుసూదనరావు దర్శకత్వంలో రామానాయుడు నిర్మించే "పసిడి కిరణాలు"

శ్యామలారెడ్డి నవల పసిడి కిరణాలు ఆదారం మార్చి నెలలో ముహూర్తం అన్నారు సురేష్ ప్రొడక్షన్స్ అదినేత డి రామానాయుడు ఈయన చిత్రంలో ఎ ఎన్ ఆర్ సుహాసిని కార్తీక్ ఆదిగా గల వారు పాల్గొంటారు వి మదుసూదనరావు దర్శకుడు






## చిత్రీకరణ ముగిసిన "హంతకుడి వేట" సినిమాస్కోప్ చిత్రం

"ఒక నర్సు కి మూలంగా తన కుటుంబం సర్వనాశనమవడంతో మానసికాందోళనకు గురైన ఓ యువకుడు డాన్సర్ల పట్ల జుగుప్స, కసి, కక్ష పెంచుకుంటాడు. ఐతే, అతను ప్రేమించిన ఒక లేడీ డాక్టర్ కూడా నర్సే. ఆద్యంతం ఉత్కంఠ కలిగించే ఇతివృత్తం. జనవరి 1 నుంచి 20 వరకు ఆఖరి షెడ్యూల్‌ను ముగించాం," అన్నారు నటుడు ప్రసాద్‌బాబు. ఈయన కథ సమకూర్చిన సాయిబాబా మూవీ క్రియేషన్స్ "హంతకుడి వేట" చిత్రంలో పోలీసు అధికారిగా, విలన్‌గా భానుచందర్ రెండు విలక్షణమైన పాత్రలను పోషించారు. రజని, నూతన్‌ప్రసాద్, ఈశ్వరరావు, పద్మనాభం, వేలు, స్మిత, జ్యోతిలక్ష్మి, అనూరాధ, విజయలలిత, జయమాలిని, కె. విజయ, నిర్మల ఇతర పాత్రధారులు. ఆరుద్ర, సి. నారాయణరెడ్డి, విజయరత్నం గీతాలకు చంద్రశేఖర్ బాణీలు కూర్చారు. లలితాబాలు సహదర్శకత్వం, పి. వి. శివరామయ్య నిర్వహణ, రంగారావు శిల్పం, పి. సి. మోహన్ కూర్పుతో ఎ. రామచంద్రరావు సమర్పించే ఈ సస్పెన్స్ థ్రిల్లర్‌కు ప్రముఖ ఛాయాగ్రాహకుడు నివాస్ ఛాయ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో తన ప్రతిభను చూపారు. సి. హెచ్. చంద్రశేఖరరెడ్డి నిర్మాత ఫిబ్రవరి విడుదల.



## కృష్ణ, సుహాసినిల "శాంతి నివాసం"

"ఏప్రిల్‌లో షూటింగ్ ప్రారంభించి, జూలైలో ముగిస్తాం," అన్నారు రాజ్యలక్ష్మి మూవీస్ అధినేత అంగర సత్యం. ఈయన నిర్మించే "శాంతి నివాసం" చిత్రంలో కృష్ణ, సుహాసిని నాయకా నాయికలు. భీశెట్టి కథ, చక్రవర్తి సంగీతం, కె.ఎస్. హరి ఛాయ, అంగర విజయకుమార్ నిర్వహణ, సత్యానంద్ మాటలు, వేటూరి పాటలు, డి. రాజగోపాల్ కూర్పు, జూడో రత్నం సాహసాలతో స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలను రాజాచంద్ర వహిస్తారు. ఈయన దర్శకత్వంలో కృష్ణ నటించే మొదటి చిత్రమిది. మార్చిలో పాటలు రికార్డవుతాయి. ఏప్రిల్– జూలై మధ్య ప్రతి నెలలోనూ చివరి పది రోజుల షూటింగ్ ఉంటుంది.

## సుబ్బరామిరెడ్డి, శశిభూషణ్‌ల తదుపరి చిత్రాలు

"కమలహాసన్‌తో ఒకటి, చిరంజీవితో ఒకటి – రెండు చిత్రాలు ప్లాన్ చేశాం. ఒక దానికి ఎ. కోదండరామిరెడ్డి డైరెక్టరు. ఒక దానిలో విజయశాంతి నాయిక," అన్నారు పి. శశిభూషణ్. ఈయన నిర్మాణంలో "జీవనపోరాటం" అనంతరం తిక్కవరపు సుబ్బరామిరెడ్డి సమర్పించే చిత్రాలివి.

శ్రీ సారథి స్టూడియోస్ 19వ చిత్రం ఫిబ్రవరిలో సెట్స్‌కు వెళ్తుందనీ, ప్రముఖ తమిళ రచయిత కలైమణి రాసిన కథ ఆధారమనీ, రాధిక నాయికగా నటిస్తుందని కూడా పి. శశిభూషణ్ తెలిపారు.

(66వపేజీ చూడండి)







శ్రీ ధైర్యలక్ష్మీ పిక్చర్స్



LAKSHMI PUBS

# బ్రహ్మాస్త్రం

జి.రామ్మోహనరావు

లక్ష్మీఫిలింస్

వియత్నాం వీడు సుందరం సత్యానంద్ చక్రవర్తి • వి యస్ ఆర్ స్వామి • కోటగిరి గోపాలరావు
తోట హేమచందర్ సలీం జూడో రత్నం

# అభిమాన తారలపై అభిప్రాయం !

నా అబిమాన తార శ్రీదేవి నేడు తెలుగు నేసీరంగంలో కన్న హింది సినిమా రంగంలో తారాపదంలో ఉన్నందుకు నాకే కాదు నా లాంటి అబిమానులకు గర్వించ తగ్గ విషయమని చెప్పటములో సందేహము లేదు నేను ఎవరినో తానెరుగక పోయినను తనపై గల అబిమానముతో ఎంతో ఆసక్తిగా తనను కలిసిన వారి నందరిని విసుగుకోకుండ పలుకరించి సమాదానము చెప్పే మేటి తార శ్రీదేవి

బిజీ తారలలో అగ్రశేణిలో ఉన్న శ్రీదేవి ఇప్పటిలాగే క్రమశిక్షణ వీడక మునుముందు పరిశ్రమలో రాణిస్తూ ఉండాలి అశ్లీల చిత్రాలలో నటించడము వలన తనపై గల అబిమానమునకు ప్రేక్షకులు దూరమై ద్వేషించడము బాగుండదు ఎందుకంటే చాలామంది తారలు అనుకుంటారు నేను అగ్రశ్రేణి తారను నేను ఎలా నటించినా సరే నాకు ఎదురు లేదు అని అలాంటి ప్రవర్తన బావుండదు ఎల్లప్పుడు తారాపథంలో ఉండాలంటే క్రమశిక్షణ ముఖ్యం. ఒళ్ళు పెరగకుండ



అదుపులో పెట్టి, అర్థనగ్నముగా దుస్తులు దరించిన పాత్రలను పోషించడముకన్న మానుకోవడము మరి మంచిది అశ్లీల చిత్రాలను నిర్మాతలు ప్రోత్సహించినప్పటికి ప్రేక్షకులు ఏమాత్రం అంగికరించరు ఎన్నో రోజులు ఆడగలదన్న చిత్రం వారం రోజులలో తిరిగి వచ్చిన స్థానాన్ని చేరుకోవచ్చును దీనివలన లాబపడేవారు ఎవరు? అటు నిర్మాతకు నష్టం మరియు నటించిన వారలకు కూడ చెడ్డ పేరు రావడం తథ్యం

ఈ మధ్య కొన్ని హింది చిత్రాలలో శ్రీదేవి (పాత్రలు) వేషదారణ చూస్తుంటే హద్దులు దాటుచున్నారని సందేహించక తప్పదు కావున మునుముందు జాగ్రత్తగా మెసలుకోవాలని మనవి చేయుచున్నాను

ఊషిగారి బాలరాజు గంగపుత్రవీది, గంబీరావుపేట

★ ★ ★

కాలానిక కళ్ళెం వేసి వ్యసనాలకు లొంగక, వయసుకు కృంగక తెరపై ప్రతి నిత్యకళ్యాణాలతో నిత్యము పెంచుకొని అశేష ఆంధ్ర ప్రజానీకాన్ని విశేషంగా ఆకర్షించిన నేటి మేటి ఉత్తమ నటుడిగా ఎన్నికైన, ఆంధ్రుల అందాల నటుడు "నటభూషణ" శోభన్‌బాబు గారు నటించిన చిత్రాలంటే నేను ఎంతగానో ఇష్టపడతాను.



నేటి రాజకీయాలకు దూరంగ ఉండి, తెలుగు చలన చిత్ర పరిశ్రమ రంగం యందే సిన్సియర్ నటుడిగా గుర్తింపు పొందిన శోబన్‌గారు కుటుంబ కథ చిత్రాలకు విజయసారధిగా మహారాజు చిత్రం ద్వారా మరోసారి నిరూపించుకొని తనకు తానే సాటి అనిపించుకున్నారు

"దేవాలయం లో పూజారి పాత్రకు జీవంపోసిన శోబన్ ఏలాంటి పాత్రలనైన పోషించి మెప్పించ గలడు అనడంలో అతిశయోక్తి లేదు త్వరలో శ్రీ శోబన్‌బాబు గారిని బుద్ధుడు పాత్రలో చూడాలని నా యొక్క ఆకాంక్ష

ప నరసింహులు గౌడ్, దుబ్బాక

★ ★ ★

నటన అనేపదానికి అర్థాన్ని నొక్కి చెప్పగల సమర్థవంతులైన నటులు యస్ వి రంగారావు గారు కథాపరంగా తన పాత్రకు ప్రాధాన్యత ఉన్నా లేకపోయినా తనకు ఇచ్చిన ప్రతి పాత్రకు పూర్తి న్యాయం చేయగలుగుట వారొక్కరికే సాధ్యము ఆ కోవకు చెందిన నటులు బహు తక్కువైనప్పటికి, వారిలో కృష్ణంరాజు గారొకరు కావటం విశేషం నటనలో సామర్థ్యం వదనములో గంబీరత చూపుల్లో ఆకర్షణ ఇతోధికంగా ఇముడ్చుకున్న నటుడు కృష్ణంరాజు క్లిష్టతరమైన పాత్రలను సైతం పోషించి మెప్పించగల సమర్థుడు ఆయన స్వంత బేనర్‌పై నిర్మితమై, విజయవంతమైన



చిత్రాలు కృష్ణవేణి అమరదీపం మనవూరి పాండవులు బొబ్బిలి బ్రహ్మన్నలే ఆయన నటనా సామర్థ్యానికి నిదర్శనాలు ఇటీవలి కాలంలో ఆయన చిత్రాలు పరాజయం పొందుటకు కారణం ఆయన కథల ఎన్నికపై ప్రత్యేక శ్రద్ధ కనబర్చక పోవుటయే అయినప్పటికి ఆయన నటించిన చిత్రాలలో మూడింట రెండు సందేశాత్మక చిత్రాలు కావటం గర్వించదగిన విషయం తను నటించే చిత్రాల కథల ఎన్నికలో ప్రత్యేక శ్రద్ధ కనబరుస్తూ చారిత్రక పౌరాణిక చిత్రాలలో కూడా నటిస్తూ నటనలో తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని నిల్పుకొన గలిగితే నటనలో నటరత్నకు వారసుడు కృష్ణంరాజు అన్న పలువురి మాటలు వాస్తవమయ్యే అవకాశం కలదు

షేక్ మొయినుద్దీన్ కృష్ణలంక విజయవాడ

ప్రతిఘటన చూచిన అశేష ప్రజానీకంలో అనేకులు నటి విజయశాంతి అబిమానులుగా మారి వుంటారనటం అతిశయోక్తి మాత్రం కాదు ఆ చిత్రంలో ప్రతి ఫ్రేంలోనూ నటి విజయశాంతి చూపిన హావబావాలు నటన నన్ను ముగ్ధుణ్ని చేసింది. వీర, కరుణ, హాస్య, శృంగార రసాలను



సమపాళ్ళతో తన నటనద్వారా అందించి అత్యంతానుభూతిని సంతృప్తిని కల్గించటమే గాక నన్నూ ఆమె అబిమానిగా చేసినది బహు చక్కని నటన కొన్ని సన్నివేశాల్లో నా కళ్ళు అప్రయత్నంగా చెమ్మగిల్లాయి నా మానసగగనంలో ఆమె వన్నె తగ్గని అబిమాన తార నాడు నేటి భారతం లో నటన ఆమెకు ఎందరో అబిమానుల్ని శ్రేయోబిలాషుల్ని సంపాయించి పెట్టింది దేవాలయం లో ఒక ప్రత్యేకతను నిల్పుకొంది దేశంలో దొంగలు పడ్డారు లో అబిమానాన్ని దోచుకొంది ఆమె నటన వందేమాతరం లో అశేష ప్రేక్షకాబిమానుల అబినందనా సుమవర్షంలో ప్రశంశా పరవళ్ళలో మునిగి తేలియాడటం ఆమెకు కళామతల్లి ఒసగిన దివ్య వరం మంచి అందం చక్కని హావబావ ప్రకటన సమయోచిత నటన పాత్రపట్ల సంపూర్ణ అవగాహనను ప్రేక్షకాబిమానుల విమర్శలను పొగడ్తలను చిరునవ్వుతో స్వీకరించే సుగుణం ఆమె అబిమానిగా నేను మారటాన్కి కారణాలు నటి విజయశాంతి కేవలం హీరోయిన్‌గా పాటల్లో చిందులు వేయటాన్కి అసబ్యకరమైన మాడరన్ దుస్తులు

దరించడాన్కి నామ మాత్ర హీరోయిన్‌గా కొన్ని చిత్రాల్లో (ఇటీవల వస్తున్న) కన్పించటం శోచనీయం మహానటిగా ఆమె వెలుగొందే కాలం ఎంతో దూరం లేదు యశో శిఖరాగ్రంలో ఆమె విరాజిల్లే రోజులు ఎంతో దూరం లేవు పాత్రల ఎంపికలో శ్రద్ధ వహించి మహానటి గా రూపొంది ఎందరో మహానుబావుల ప్రేక్షకాబిమానుల ఆశీస్సుల్ని, ఆదరణను మన్ననలను పొందాలని ఆమె అబిమానిగా నిండు మనసు తో ఆశిస్తున్నా

వై చంద్రశేఖర రెడ్డి రెడ్స్‌పేట చిత్తూరు-1

* * *

ఒక నటి లేక నటుడు నటనలో చూపే ప్రతిబమిద ఆదారపడి వుంటారు అబిమానులు అలాగే నేను సహజంగా అందరు నటించే చిత్రాలు చూస్తుంటాను కాని చిరంజీవి హీరోగా నటించిన యమకింకరుడు చిత్రం చూస అతని అబిమానిగా మారాను యీ చిత్రంలో చిరంజీవి నటన ఎప్పటికి మరచిపోలేనిది యీ చిత్రం తర్వాత దాదాపు చిరంజీవి నటించిన అన్ని చిత్రాలు చూస్తున్నాను అతను నటనలో చూపే స్పీడు పోరాటములలో చూపే ప్రతిబ అందరికి ఆనందం కలిగిస్తుంది



యిప్పటివరకు విడుదలయిన చిత్రాలలో యమకింకరుడు పున్నమినాగు ఖైదీ అబిలాష చిరంజీవి విజేత అడవి దొంగ చిత్రాలు చిరంజీవిలో వున్న నటనను ప్రతిబాపంతముగా చూపిన చిత్రాలు విజేత చిత్రంలోని చిరంజీవి నటన అందరిచేత ప్రశంసలు అందుకుంది పాటలో వేసే స్టెప్స్‌లో ప్రత్యేకత వుంటుంది ఎప్పుడూ ఒకే తరహా పాత్రలు పోరాటములు చేయకుండా కటుంబ కథా చిత్రములు పౌరాణిక జానపద చిత్రాలలో కూడా నటించి మంచి పేరు తెచ్చుకుంటె పరిశ్రమలోని వారి నుండి అందరి అబిమానుల నుంచి అబినందనలు అందుకుంటారు రైతు ముదుసలి పూజారి మొదలైన పాత్రలలో నటించేటపుడు ఆ పాత్రకు తగిన ఆహార్యము హావబావాలు తగు రితిలో వుంటె తప్పక విజయం సాదిస్తారు యిప్పటికైనా ఒకే తరహా మూస పాత్రలలో నటించటం మాని అన్నిరకాల పాత్రలలో నటిస్తే అందరి అబిమానాన్ని చూరగొంటారు

కాకరపర్తి సుబ్రమణ్యం మారిసుపేట తెనాలి



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకులకి అగ్ర కథానాయిక జయసుధ సమాధానాలు!



తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలని విశేషంగా చూరగొన్న ప్రముఖ నటిమణి జయసుద ఆంద్రసచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకి సమాదానాలు ఇస్తారని తెలియ చేయటానికి సంతోషిస్తున్నాము త్వరలో ప్రారంబం కాబోయే ఈ శీర్షికకి పాఠకులు అర్దవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం జయసుద ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపినవారికి ఆటోగ్రాప్‌తో ఉన్న ఆమె అందమైన ఫొటో బహుమతిగా లబిస్తుంది ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్‌పాయింట్ పెన్‌తో రాసి తమ పేరు పూర్తి చిరునామాతో సహా జయసుద సమాదానాలు శీర్షిక పేర సంపాదకుడు ఆంద్రసచిత్ర వారపత్రిక, గాంధినగరం, విజయవాడ- 520003 అన్న చిరునామాకి పంపాలి ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి విడిగా రాసి పంపినవి పరిశీలింపబడవు

పాఠకులు ఉత్సాహంతో ఈ అవకాశాన్ని వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము

---

కూపన్

## ఆంధ్రసచిత్రవారపత్రిక

## జయసుధ సమాధానాలు

ప్రశ్న ____________________

____________________

____________________

పంపినవారి పేరు

పూర్తి చిరునామా

# సీరియల్



# మనసుకు సంకెళ్ళు

## ప్రమీలా జనార్దన్

(గత సంచిక తరువాయి)

"రవీ" మేడ మెట్లు దిగి వస్తున్న రవి సుదను చూసి నిశ్చలుడయ్యాడు

ఏమిటలా చూస్తున్నారు? డాక్టరుగారి పర్మిషన్ తీసుకునే వచ్చాను అంది సుద నవ్వుతూ సోఫాలో కూర్చుంటూ

మీ ఆఫీసుకు ఫోన్ చేశాను మీరు ఇంటికివెళ్లారన్నారు ఇంటికి వచ్చాను ఎగ్జిబిషన్‌కు వెళదాము రవి అందుకేవచ్చాను

ఎగ్జిబిషన్‌కా? ఇబ్బందిగా చూశాడు ప్రతిమను ఎగ్జిబిషన్‌కు తసుకెళ్లాలని తను తొందరగా ఇంటికి వచ్చాడు

ప్రతిమ ఈ మధ్య చాలా నీరసంగా వుంటోంది తన ప్రవర్తన ఆమెను మానసికంగా బాధిస్తున్నదేమోనని అతని అనుమానం తను మారాలి సుద ఆరోగ్యం బాగానే వుంటోంది కాబట్టి తను ఇక ఆమె దగ్గరికి వెళ్ళడం తగ్గించాలి ఆ రోజు హాస్పిటల్‌కు వెళ్లకూడదనుకున్నాడు

ప్రతిమా ఇంట్లోకి రాగానే ఎగ్జిబిషన్‌కి వెళదామని చెప్పాలని పిలిచాడు

ప్రతిమ పలకలేదు

అమ్మగారికి ఒంట్లో బాగాలేదు పడుకున్నారు బాబూ నాయర్ లోపలి నుండి వచ్చి చెప్పాడు

ఏమయింది? గబగబ పైకి వెళ్లాడు రవి

**జరిగిన కథ– 7** ఊరి నుంచి వచ్చిన సుధ ఆ రోజే రవికి పెళ్ళైందని తెలిసి కొయ్యబారి పోయింది అతనిని కలుసుకోవడానికి పెళ్లి జరిగిన గీతామందిరానికి ఆమె వెళుతుంది రవి ప్రక్కన ప్రతిమని చూసిన సుదకు మళ్లీ మతి తప్పింది సుదను చూడను హాస్పటల్‌కి వెళ్ళిన రవికి గతం గుర్తుకు వచ్చింది– సుద నాట్యం అంటె రవికి ఇష్టం నాట్య ప్రదర్శన ఇవ్వడానికి సుద విదేశాలకు వెళ్లడానికి నిశ్చయించుకుంది నృత్య ప్రదర్శనలో కాలి ఎముక విరిగిన సుదకు జీవితమే శూన్యమవుతుంది రవి సాహచర్యంలో సుద తిరిగి కోలుకుంటుంది గతం నుండి తేరుకున్న రవి ఇంటికి వచ్చాడు– హాస్పటల్‌కి వెళ్ళినందుకు ప్రతిమకి కోపం రాలేదని తెల్సుకుంటాడు సుద పరిస్థితి రవికి ఆందోళన కలిగిస్తుంది సుద బయంతో హాస్పటల్ నుంచి పార్కుకి పరుగు తీసింది అక్కడ ఆమెకు ఒక యువకుడు తటస్థపడతాడు బయంతో ఆమె అతని చేతులలో స్పృహ కోల్పోతుంది పోస్ట్ గ్రాడ్యుయేట్ చంద్రంకి మానసిక రుగ్మత పూర్తిగా తగ్గిపోయినందుకు డాక్టర్ కిశోర్ ఆనందపడ్డాడు రవి సహకరిస్తే సుదకి మానసిక రుగ్మత పూర్తిగా నయమవుతుందని చెప్తాడు డాక్టర్ రవి అంగికరిస్తాడు సుద చంద్రం స్నేహంగా ఉంటున్నారు సుద తండ్రితో చెప్పి చంద్రంకు ఉద్యోగం ఇప్పిస్తుంది

ఒంటేమి బాగానే వుందా? ప్రతిమ మామూలుగా చెప్పి సమాధానమి అది మనిషి మాత్రం బాగా నీరసంగా వుంది

నిన్ను అడిగితే లాభంలేదు డాక్టర్ని పిలుస్తాను వెంటనే ఫ్యామిలీ డాక్టరుకు ఫోన్ చేశాడు

అతడు కొద్ది సేపట్లో వస్తానన్నాడు

అతడి కోసమే ఎదురు చూస్తూ పైక క్రిందికి తిరుగుతున్న ధని సుద రాకకు విభ్రాంతుడవ్వడమే కాకుండా బయపడ్డాడు కూడా

సుద ఇలా రావడమేమిటి? ఎగ్జిబిషన్‌కు వెళ్ళాలనడమేమిటి? ఏం చెయ్యాలో తోచడంలేదు

కాదంటే ఏమంటుందో రానని చెప్పలేక పోతున్నాడు

నేనిప్పుడే ఆఫీసు నుంచి వచ్చాను

సుద పెద్దగా నవ్వింది

నాకు తెలుసు మీరు వచ్చి చాలాసేపయిందని మీకు బార్య ముందు సమయం చాలా తొందరగా గడుస్తున్నట్లుంది

రవి అచ్చెరువుగా చూశాడు

తనకు పెండ్లయిందన్న విషయం గుర్తొచ్చినా అమె బాగానే వుంది అంటే ఆమెకు పూర్తిగా స్వస్థత చేకూరిందన్న మాట అతడి ఆనందానికి అవదుల్లేకపోయాయి

పెండ్లయ్యాక జీవితమే వేరు ప్రతిమకు ఒంట్లో బాగాలేదు తనకు పెండ్లయిందన్న విషయం గుర్తొచ్చినా ఆమె మామూలుగా వుంది కాబట్టి తను ఆమెతో బార్య గురించి మాట్లాడవచ్చునుకున్నాడు కాని అతడి మాటలను పూర్తి చెయ్యనివ్వలేదు సుద

అయితే మీరు ఆమెగారినే చూసుకుంటూ ఇంట్లో కూర్చోండి సర్రున లేచింది

సుదా రవి నోట మాట రాలేదు ఇంతలో ఈ మార్పేమిటి?

మీరు ఎగ్జిబిషన్‌కు వస్తారని ఆశతో వచ్చాను మతిలేనిదాన్ని మీరు నాతో ఎందుకు వస్తారు? మీ జీవితమే మారింది మీకు ముఖ్యమైన మనుషులున్నారు రుద్ధకంఠంతో అంటూ సుద బైటికి వెళ్ళబోతుంటే సుదా ఏదో నిశ్చయానికి వచ్చినవాడిలా ఆమె చెయ్యి పట్టుకున్నాడు

నేను నిన్ను తీసుకెళ్ళనని అన్నానా?

సుద ముఖంలో విస్మయం

నేనేదో చెబుతోంటే నువ్వింకేదో అర్థం చేసుకున్నావు పద వెళ్దాం అతడు తనతో వస్తుంటే ఆమెకింకా ఆశ్చర్యంగావుంది

మీకు పని వుంటే వద్దురవి కారెక్కాక అతడు బాదగా వుండడం చూసి అంది

అతడు బాదపడుతుంటే తను చూడలేదు

ఏ పని వున్నా నిన్ను కాదని వెళ్ళలేను సుద అన్నాడు రవి

రవి ఆమెని సమయంలోనే జాగ్రత్తగా చూసుకోవాలి ఇక కొద్ది రోజులు గడిస్తే ఆమెకు మనమేం చెయ్యవలసిన అవసరం వుండదు ఆమె మనసుకిప్పుడేదైనా దెబ్బ తగిలితే ఇక చెయ్యగలిగేదేమీ లేదు వారం రోజుల క్రిందట డాక్టరు అదే పనిగా పిలిచి చెప్పిన మాటలు గుర్తొచ్చి అతడు తనతో వస్తున్నాడని ఆమెకు తెలియదు

ఎగ్జిబిషన్‌కు వెళ్ళాలని తొందరగా రమ్మని రవికి చెప్పాలని ఆఫీసుకు ఫోన్ చేస్తే అతడు ఇంటికి వెళ్ళాడన్నారు

ఆ మాట వినగానే ఆమె మనసు బగ్గుమన్నది

తన వాడనుకున్న రవి మరొకరి స్వంతమయ్యాడు ప్రతిమ రూపు మదిలో మెదలగానే నిలవలేకపోయింది

చిన్నపిల్లలు తమ ఆట వస్తువును ఎవరో తీసుకొని ఆడుకుంటుంటే భరించలేని స్థితిలా వుందామె స్థితి

రవి తనను ఇంటికి రమ్మన్నాడని డాక్టరుకు చెప్పి అతడింటికి వచ్చింది

రవి భార్య పేరెత్తగానే అతడు తనను దూరం త్రోసేసినట్లనిపించింది ఆవేశం హద్దులు దాటింది రవి తనను తప్ప మరెవర్ని ప్రేమించగూడదను హృదయంలో ఆరాటం

అతడు తనతో వస్తున్నాడనగానే ఆ ఆరాటం ఏమైపోయిందో! అతడిలో ఏ శక్తి తననిలా అతడి చుట్టూ తిప్పుతోంది? రవి దెస చూసింది

అతడు రోడ్డు వైపు చూస్తున్నాడు

అతడికి తన మీద అభిమానం వుంది లేదంటే భార్య అనారోగ్యంగా వున్నా తనతో వస్తాడా? ఏ తప్పని పరిస్థితుల్లోనే అతడు ప్రతిమను చేసుకొని వుంటాడు

ఆ కారణమేదో అడగాలనిపించినా అతడ్ని చూస్తోంటే ధైర్యం చాలడంలేదు

అతడే ఎప్పుడో చెబుతాడు అనుకుంది

రవి మీరు పెండ్లి చేసుకున్నారన్నా నేను మిమ్మల్ని ద్వేషించలేకపోతున్నాను నాలో అనురాగం నన్నలా చెయ్యనివ్వడంలేదు

తనలో తనే అనుకుంటోంది అతడి సాన్నిధ్యంలో ఆమె ఇదివరకులాగే ఆనందం అనుభవిస్తోంది ఆమె మనసింకా అతడ్ని కోరుతూనే వుంది

రవి ఆలోచనలు వేరుగా వున్నాయి

అతడు శ్రద్ధగా కారు నడుపుతున్నట్లున్నాడు కాని మనసు ఇంటి దగ్గర వుంది

ప్రతిమ అలా వుంటే తను షికారుకు వచ్చాడు ఆమె ఏమనుకుంటున్నదో విసుగు బాధ పెనవేసుకొస్తున్నాయి

తనకు పెండ్లయిందన్న విషయం గుర్తొచ్చి సుధ మామూలుగా వుందని సంతోషించాడు కాని ఆమె మాటలు ఆ ఆనందాన్ని ఎంతో సేపు నిలవనియ్యలేదు సుధలో ఇంకా మార్పు రావాలి ఎంత కాలం ఇలా గడపాలో

గంటన్నర ఆమెతో తిరిగాడు కాని ఏదీ చూసినట్లు లేదు ప్రతిమ రూపు కంట్ల ముందు కదులుతుంటే ఏదీ కనిపించలేదు

సుధ ఏవేవో కొన్నది టీ తీసుకున్నది తనిలోకంలో లేనట్లే తాగాడు

సుధా ఇక వెళ్దామా? మరో పది నిమిషాలు తిరిగాక అడిగాడు అతడ కప్పటికే ఎన్నో గంటలు తిరిగినట్లుగా వుంది

సుధకు అతడితో తిరుగుతుంటే స్వర్గాన్ని చుడుతున్నట్లుగా అనిపిస్తోంటే ప్రతిమ తలపుకే రాలేదు అందుకేనేమో అతడు వెళ్దామనగానే అలాగే అనగలిగింది ఆనందంగా

రవి నా కిలాంటి రోజులెన్నో కావాలి హాస్పటల్ ముందు కారు దిగుతూ ఆమె అన్నమాటలకు రవి కండ్లు చెమ్మగిల్లాయి

సుధనెలా తన మీద ఆశ పెరక్కుండా చెయ్యడం? ఏనాడూ అతడు ఆమెకు దగ్గరవ్వలేదు కాని మనసులు మూగగా మాట్లాడుకున్నాయి ఈనాడు తన మనసు ముడుచుకున్నా ఆమెలో భావాలు ఆమె మనసును మాట్లాడేలాగే చేస్తున్నాయి

మనసెంత దగ్గరైనా మనిషి దూరమే అతడి చూపుల్లో కొంటితనం తనను కవ్వించినా అతడి వ్యక్తిత్వం తనను చొరవ తీసుకోనివ్వలేదెప్పుడూ సుధ తన గదిలోకి వస్తూ అనుకుంది

ఆమెకు అన్నం తినేటప్పుడు కాని ప్రతిమ గుర్తు రాలేదు

రవి తనతో రావడం ఆమెకు కోపం తెప్పించి వుంటుంది ఎందుకో సుధకలా అనుకోగానే సంతోషంగా వుంది

రవి తననే స్మరిస్తుంటాడు ప్రతిమ రవి మాటా మాటా పెంచుకుని అశాంతితో రవి తనను అనుకుంటుంటాడనుకుంటోంది ఆనందపడుతున్నది

* * * *

ప్రతిమ రవిలో సంస్కారాన్ని చూడనట్లయితే సుధ వూహ ఆ రోజు కాదు ఏనాడో నిజమై వుండేది

సుధను అతడు స్నేహితురాలిగా చూస్తున్నాడనుకుంటున్నదే కాని అతడి గతాన్ని తరచి చూడాలన్న ఆలోచనే రాలేదు ప్రతిమకు

రవి రాగానే నేను తప్పనిసరిగా వెళ్ళాల్సి వచ్చింది క్షమించమన్నట్లుగా అంటే మీరు మంచి పని చేసారు అలా వెళ్ళకపోతే ఇప్పుడామె నే స్థితిలో చూడాల్సి వచ్చేదో" అంది భయంగా

ప్రతిమా ఆమె హృదయౌన్నత్యానికి అబ్బురపడ్డాడు రవి

నేనక్కడ తిరుగుతున్నా నీ గురించే దిగులు సుధను హాస్పటల్లో వదలి నేను మన డాక్టర్ దగ్గరికి వెళ్ళి వస్తున్నాను అతడా మాట చెప్పగానే ప్రతిమ ముఖంలో సిగ్గు తెరలు పరుచుకున్నాయి చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి అతడి వైపు చూడలేక ముఖం ప్రక్కకు తిప్పుకోబోతుంటే ప్రతిమా అంటూ చెయ్యి అడ్డు పెట్టాడు రవి

అతడూ ఆమెలాగే ఆనంద తరంగాలలో తేలిపోతున్నాడని అతడి కండ్లలో మెరుపు చెబుతోంది

తనకే వార్త తెలియకపోతే తను దిగులుగానే ఇంటికి వచ్చేవాడు ప్రతిమ



# మనసుకు సంకెళ్ళు

ఏమనుకుంటున్నదోనని ఎంత కలత చెందాడు ప్రతిమ ప్రెగ్నెంట్ అని డాక్టర్ చెప్పగానే కలత భయం అన్నీ పారిపోయాయి

ప్రతిమ తన మీద కోపంగా వుంటుందేమోనన్న ఆలోచన కూడా మాయమయింది

'తను తండ్రి కాబోతున్నాడు మనసు దూదిపింజమే అయింది

ఆమె చాలా బలహీనంగా వున్నారు విశ్రాంతి అవసరం అంటూ తను వ్రాసిచ్చిన మందులేమిటో చెప్పాడు డాక్టరు

ప్రతిమా డాక్టర్ నోట ఆమాట వినగానే నేను చాలా పెద్దవాడినైపోయినట్లనిపించింది రవి పెండ్లయ్యాక భార్యతో అంతఆనందంగా మాట్లాడుతున్నదా రోజే

ప్రతిమ అతడి వంక అలాగే చూస్తోంది

రవికి పిల్లలంటే ఇష్టంలా వుంది

నేను నోచుకోని ఆనందాలన్నీ బాబుకు అందుతాయి వాడికే లోటు రానివ్వను తన్మయంగా మాట్లాడుతున్నాడు రవి

బాబే పుడతాడా? నవ్వుతూ అంది ప్రతిమ

పాప పుట్టినా అలాగే పెరుగుతుంది నేను బాబే కావాలనుకోవడం లేదు అపురూపమైనదేదో అందినట్లుగా వుంది రవికి

డాక్టర్ చెప్పినట్లుగా కొద్ది రోజులు ఆమెను ఏ పనీ చెయ్యనివ్వలేదు తనే దగ్గరుండి ఆమెతో తినిపించడం, తాగించడం చేశాడు మందులు ఇచ్చాడు

బాబు పుట్టాక రవి తనకు దగ్గరౌతాడు అనుకుంది ప్రతిమ కాని ఆమె లేచి తిరగడం మొదలుపెట్టాక మామూలుగా వుండసాగాడు రవి

అతడికి ఆఫీసు పనులు, సుద గురించిన ఆలోచనులు అలసట తెచ్చిపెడుతున్నాయి

ఆపీసుకు వెళ్ళేటప్పుడో ఇంటికి వచ్చేటప్పుడో విధిగా సుద దగ్గరికి వెళ్లాలి ఆ సమయాలుతప్పితే సుద ఫోన్ చేస్తుంది ఆమెను చూస్తుంటే మనసులో బాద, తనను అబిమానించిన వ్యక్తికి తను చేసినదేమిటి? ఈ హాస్పిటల్ పాలు చెయ్యడమా అనిపిస్తుంది

ప్రతిమ మంచంలో వున్నప్పుడు కూడా ఆ ఆలోచన రాకపోలేదు ఆమె అనారోగ్యం ఆందోళన కలిగించడంతో కాస్త అణగద్రొక్కబడింది ఆమె ఆరోగ్యం బాగయిందో లేదో అతడికి తెలియకుండానే అతడికి ఆమె విషయంలో శ్రద్ధ తగ్గిపోయింది మనసు సుద గురించిన ఆలోచన్లతో నిండిపోయింది అతడికి తండ్రినవ్వబోతున్నానన్న ఆనందం వున్నా ఆ ఆలోచన ముందు అది నిలవడంలేదు

అతడి మానసిక సంఘర్షణ నెరుగని ప్రతిమ తన జీవితమింక ఇంతే రవిలో మార్పు రాదు అనుకుంది నిస్పృహగా

* * * *

హలో సుదాదేవిగారూ గది వెలుపలికి వస్తున్న సుదకు ఎదురయ్యాడు చంద్రం

హలో ఏమిటి అంత హుషారుగా వున్నారు? అంది సుద నవ్వుతూ

మీరు మరిచేపోయారా? నిన్ననే చెప్పాను గదండి ఈ రోజు మాకు జీతాలు ఇస్తారని

అయితే అంటూ గది లోపలికి వచ్చి స్టూలు మీద కూర్చుంది సుద

ఏముంది? మొదటి నెల జీతం తీసుకునే వారందరికి కొత్త జీవితం ప్రారంభమైనట్లుగా వుంటుంది చంద్రం ఆమెకెదురుగా కుర్చీ జరుపుకుని కూర్చుంటూ అన్నాడు

అలాగా నవ్వింది సుద

జీతం తీసుకోగానే నాకో బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది వెంటనే అమలుపరిచాను అంటూ చేతిలో ప్యాకెట్ ఆమెకిచ్చాడు చూడండి ఎలావున్నాయో

సుద ప్యాకెట్ విప్పింది

చిన్న చిన్న తెల్ల పూలున్న షిఫాన్ చీర అదే రంగు బ్లౌజు పీసు

ఎందుకివి? అడిగింది సుద

ఎందుకంటారేమిటి? నాకు బ్రహ్మాండమైన ఆలోచన వచ్చిందని చెప్పానుగా అవి మీ కోసం తెచ్చాను

మీరిలా చెయ్యడం నాకు నచ్చడంలేదు బహుమతులివ్వడం మంచి స్నేహానికి గుర్తు కాదు బాధగా అంది సుద

బహుమతులివ్వడం మంచి స్నేహానికి గుర్తు కాకపోవచ్చు కాని ఇవ్వాలని మాత్రం మంచి స్నేహానికి అనిపిస్తుంది మీరు మంచి స్నేహితులని అనిపించకపోతే ఈ బహుమతి ఇవ్వాలనిపించేది కాదు మీ దగ్గరికి రావాలని అంతకన్నా అనిపించేది కాదు మీరి కానుకను కాదనకండి అన్నాడు ప్రాదేయపడుతున్నట్లుగా

తెచ్చాక కాదంటానా? నవ్వుతూ అంది సుద తను కాదంటే అతడు బాదపడతాడని అతడ్ని చూసి తెలుసుకుంది

ఈ చీరేనా? పార్టీ ఏదైనా ఇస్తారా?

పార్టీ ఎప్పుడో ఇవ్వాలనుకున్నది చీర కట్టుకొని రండి వెళదాము అన్నాడు చంద్రం బైటికి వెళుతూ

సుద చీర కట్టుకొని వచ్చింది అతడి ఆనందాన్ని భగ్నం చెయ్యదలుచుకోలేదామె

అతడికి వుద్యోగం ఎంత అవసరమో అతడి ఆనందం చూస్తుంటే అర్థం అవుతోంది

ఇద్దరు హోటలుకు వెళ్ళివచ్చేసరికి హాస్పిటల్ ముందు రవి కారు కనిపించింది

రవిగారు వచ్చినట్టున్నారు అన్నాడు చంద్రం

రండి అతడ్ని కూడా చూసి వెళుదురుగాని అంది సుద

లేదు ఆపీసు నుండి ఇక్కడికే వచ్చాను అమ్మవాళ్ళు ఎదురు చూస్తుంటారు అతడ్ని రేపు కలుస్తానని చెప్పండి చంద్రం వెళ్ళిపోయాడు

చంద్రంగారు పార్టీ ఇస్తానంటే వెళ్లాను సుద గది దగ్గరికి రాగానే అక్కడున్న రవిని చూసి అంది

అతడు ఉద్యోగం వచ్చినందుకు ఎంత సంతోషపడుతున్నాడో! నాకి ప్రెజెంటేషన్ కూడా తెచ్చాడు అంది చీర చూపిస్తూ

వద్దంటే అతడు బాదపడతాడు అందుకే తీసుకున్నాను

మంచి పని చేశావు అబిమానంతో ఇచ్చినదాన్ని కాదంటే బాదగా ఉంటుంది అతడి జీవితంలో మరపురాని మంచి రోజిది బాద అసంతృప్తి మిగలనివ్వలేదు అన్నాడు రవి

(ఇంకా ఉంది)



# తోకచుక్క

BANNU* & పద్మ..

















'నాన్నా' ఖారాకిళ్ళీ మావయ్యగారు వస్తున్నారు' బయట వాకిట్లో తొక్కుడుబిళ్ల ఆడుకుంటున్న పద్మ పరుగున లోపలికి వచ్చి పేపరు చదువుకుంటున్న తండ్రికి ఆ కబురు అందించి, మళ్లీ తుర్రుమని పారిపోయింది

'పార్వతీ' శాస్త్రి మళ్లీ వస్తున్నాడుట చదువుతున్న పేపరు ప్రక్కన పెట్టారు పరందామయ్యగారు

ఆ కబురు తను తిరిగి చెప్పడానికి తన పెద్దకూతురు గౌరి యింట్లోలేదని తెలుసుకున్న పార్వతమ్మ దీర్ఘంగా నిట్టూర్చి, తలుపువారకి చేరింది సంబాషణ యేవిదంగా సాగుతుందో విందామనే ఆతృతతో

పరందామయ్యగారు శాస్త్రికి యీ సారైనా కొంచెం గట్టిగా చెప్పి పంపించాలని నిర్ణయించుకుని కర్చీలో సర్దుకుని కూర్చున్నారు శాస్త్రి అడగబో యేదానికి కళ్లు విరగకుండా, పాము చావకుండా ఎలా సమాదానం చెప్పాలో ఒకటికి రెండుసార్లు మననం చేసుకున్నారు

'ఏమోయ్ యివాళ చాలా చిద్విలాసంగా కన్పిస్తున్నావ్? ఏమిటి సంగతి?' కుర్చీ ముందుకి లాక్కుని తను కూడా కూర్చుంటూ అడిగారు శాస్త్రిగారు

నీ లాంటి స్నేహితుడుండగా నా విలాసానికేం తక్కువ?', అర్థయుక్తంగా నవ్వారు చూస్తున్నాడు!'ఇవాళ ఛస్తే లొంగను' వెధవ దొంక తిరుగుళ్ళు కాకపోతే వచ్చిన పనేదో చెప్పి ఏడవ్వచ్చు గదా?' అని మనసులోనే నాలుగు తిట్టుకుని పైకి మాత్రం చిరునవ్వుతో –'చల్లకొచ్చి ముంత దాచడమెందుకు గానీ యీసారి యే కొంపలు మునిగే అవసరం వచ్చి పడిందో చెప్పవయ్యా అప్పులవాళ్ళు యింటి ముందు 'క్యూ'లో నించున్నారా? లేకపోతే మీ ఆవిడ పట్టుచీర కొనమని పట్టుబట్టిందా? అన్నారు

'కరెక్టుగా ఊహించావనుకో శ్రావణమాసం వస్తోంది కదా అల్లవాళ్ళు కొనుక్కున్నారు వీళ్ళు కొనుక్కున్నారంటూ ఏకరువు పెట్టింది చివరికి యీరోజు కాకనే కాదు కొంటే గాని వీల్లేదని పరంధామయ్యగారు

అది సరేగాని, అబ్బాయికేమైనా ప్రమోషనొచ్చిందా? శాస్త్రిగారి . ప్రశ్నతో పరందామయ్యగారికి అరికాలిమంట నెత్తికెక్కింది

నిజమే! యీనెల గోపాలానికి ప్రమోషనొచ్చింది తను మరో వంద యెక్కువ పంపమనిఉత్తరం రాస్తే గోపాలం ఆరొందలు పంపించాడు దానికి తగ్గ బడ్జెట్ కూడా తయారైంది యింట్లో గౌరి పట్టు లంగా కొనమంది పార్వతి శ్రావణ మాసానికి జరీచీర కొనుక్కుంటానంది పద్మ క్రొత్త జోళ్ళు కొనమంది ఆఖరికి యీ శాస్త్రి కూడా తన బడ్జెట్‌లోనే యిరుక్కుందామని సత్యబామ అవతారం యెత్తేసింది ఆ పరకా యీ పరకా కూడేస్తే ఓ నూటయాభై తక్కువొచ్చేయి ఈసారి కేదో కాస్త సర్ది పెట్టు అబ్బాయికి రాస్తే యేదో సర్దుతాడనుకో గాని వాడికొచ్చే అయిదొందలూ వాడికే చాలడం లేదు పైగా నా ఉత్తరమంది వాడు పంపడానికి టైం లేదు మరోలా అనుకోకు ఒక్క గుక్కలో తన మనసులో మాట బయటపెట్టి ఊపిరి పీల్చుకున్నారు శాస్త్రిగారు

పరంధామయ్యగారు మారు మాట్లాడకుండా లోపలి గదిలోనికి వెళ్ళి బీరువాలో నుంచి డబ్బు తీసి ఒకటికి రెండుసార్లు లెక్క చూసుకున్నారు

'ఏదో సమాదానం చెప్పి పంపక ఏమిటండీ యిది?' తలుపు వార నుండి గమనిస్తున్న పార్వతమ్మ అడ్డు పడింది ఉష్ అని మాట్లాడ వద్దన్నట్టుగా సంజ్ఞ చేసి డబ్బు తీసుకు వెళ్ళి శాస్త్రిగారి చేతిలో పెట్టారు

వస్తాను రా నువ్వు కాదన(లే) వనే నమ్మకంతోనే నీ దగ్గరకు వస్తూ ఉంటాను వస్తాను చెల్లెమ్మా వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోతున్న శాస్త్రిగారి వైపు కోపంగా చూసి కసిగా తలుపు వేసేరు పరందామయ్యగారు

* * * *

పరందామయ్య శాస్త్రి చిన్ననాటి స్నేహితులు శాస్త్రిగారు బడిపంతులుగా రిటైరయేరు ఇద్దరు కొడుకులు ఒక కూతురు పెద్దవాడు మతాంతర వివాహం చేసుకుని కుటుంబం నుండి వేరుపడ్డాడు రెండవవాడు టెంపరరీ ఉద్యోగస్థుడు అమ్మాయి పెళ్ళీడు కొచ్చింది పరందామయ్యగారికి ఒక్కడే కొడుకు యిద్దరు కూతుళ్ళు గోపాలం చదువు పూర్తి చేసి ఉద్యోగం వేటలో తిరుగుతున్న రోజులవి! వెళ్ళిన ప్రతి చోట డబ్బు రికమెండేషన్ యెదురొచ్చాయి ఆ రెండూ గోపాలానికి లేవు రోజు రోజుకి బెంగతో క్షీణించిపోతున్న కొడుకుని చూస్తుంటే పరందామయ్యగారి దిగులు మరింత యెక్కువైంది గోపాలం చివరి ప్రయత్నంగా ఒక కంపెనీకి అప్లై చేసాడు ఇంటర్వ్యూకి వెళ్ళి వచ్చాడు మళ్ళీ మామూలే! పదివేలు "వారం లోపుగా యివ్వగలిగితే ఉద్యోగం వస్తుందిట!" పదివేలు! పది రూపాయలంత తేలికైపోయాయి ఎక్కడి నుంచి వస్తాయి? తాత ముత్తాతలు ఆర్జించిన ఆస్తులేమీ లేవు తన జీతం రాళ్ళు యింటికే సరిపోతున్నాయి పది రూపాయలు కూడా వెనకెయ్య లేకపోతున్నాడు ఆలోచిస్తున్న కొద్దీ పరందామయ్య గారికి పిచ్చెక్కి పోతోంది చెప్పండి నాన్నగారూ పదివేలు మనం యివ్వలేం కదూ? గోపాలం కళ్ళు వర్షించడానికి సిద్ధంగా ఉన్నాయి గబగబా తన గదిలోకి వెళ్ళి తలుపులు మూసుకుని దిండులో తలదూర్చి వెక్కి యేడ్చాడు కొడుకు యే అఘాయిత్యానికి తలపెడతాడోనని పార్వతమ్మ కంగారుగా తలుపులు బాదింది 'గోపి యీ ఒక్కసారికి ఓపిక పట్టరా – ఆవేశపడకు తలుపు తియ్యి అంటూ–



అదే సమయానికి లోపలికి వచ్చిన శాస్త్రిగారు ఏమిటిగా వెళ్లొమ్మ యేదో కంగారు పడుతోంది ' అంటూ ప్రక్కన కూర్చుని స్నేహితుడి భుజం మీద చెయ్యి వేసాడు ఆక్షణంలో శాస్త్రిగారి కాళ్ళు పట్టుకుని 'ఒరేయ్ యీ ఉద్యోగం వచ్చే మార్గం చూడు నాకు ఆ జన్మాంతం ఋణపడి ఉంటానని చెప్పాలనిపించింది కాని శాస్త్రి మాత్రం యేం చెయ్యగలడు? బడిపంతులు పదివేలంటే మాటలా? ఉద్యోగం వివరాలన్నీ గోపాలాన్నడిగి తెలుసుకున్న శాస్త్రిగారు సాలోచనగా ఉండిపోయారు కొంచెం సేపు 'మేనేజరెవరు' వైరామ్మూర్తి అన్నావు కదూ ?'

'అవునన్నట్టు తలూపాడు గోపాలం

'ప్రయత్నిస్తానంటూ లేచి కండువా దులుపుకుని యింటి ముఖం పట్టారు

అతని వల్ల యేదైనా పని జరుగుతుందేమోనని ఆశగా రెండు మూడుసార్లు శాస్త్రిగారింటికి వెళ్ళిన గోపాలానికి 'శాస్త్రిగారు ఊళ్ళో లేర నడంతో నిరాశే యెదురైంది

వారం రోజుల తర్వాత పరుగులాంటి నడకతో వచ్చారు శాస్త్రిగారు పరందామా! ధర్మం, న్యాయం యింకా బ్రతికే ఉన్నాయిరా గోపాలానికి ఉద్యోగం వచ్చింది యిదుగో ఆర్డర్స్ కూడ తీసుకు వచ్చాను చేతిలో కవరు పరంధామయ్య చేతిలో పెట్టారు పరందామయ్య శాస్త్రి కాళ్ళ మీద పడిపోయాడు 'నువ్వు నాపాలిటి దేవుడివిరా నీ మేలు

యీ జన్మలో మర్చిపోను' 

★ ★ ★

నెల రోజులు యిట్టే గడిచిపోయాయి

గోపాలం మొదటి జీతం అందుకుని యింటి కొచ్చాడు నలుగురూ చుట్టూచేరి. అయిదారు వందలు దాకా ఖర్చు పెట్టించారు అక్కడే ఉన్న శాస్త్రి గారు కూడా మధ్యలో కలుగజేసుకున్నారు 'ఒరేయ్ గోపాలం యీ నెల పెన్షను డబ్బులు యింకా అందలేదు యెలాగని ఆలోచిస్తున్నాను సమయానికి అదుకున్నట్టు వచ్చావు ఓ వందరూపాయిలివ్వు 'తర్వాత చూసుకుందాం' తండ్రి కొడుకులు ముఖాలు చూసుకున్నారు ఇవ్వు'న్నట్టు తండ్రి సంజ్ఞ చేశాక గోపాలం వందనోటు తీసి శాస్త్రిగారి చేతిలో పెట్టాడు

'నీకూ–నాకూ మధ్య యిచ్చిపుచ్చుకోవడాలేమిటి? నువ్వే యీ ఉద్యోగం యిప్పించకపోతే వాడి బవిష్యత్తు యేమైయుండేదో తీసుకో ' అన్నారు పరంధామయ్యగారు

డబ్బుతీసుకుని తృప్తిగా యింటిముఖం పట్టారు యేదో దిగ్విజయం సాధించినట్టుగా

నాకు ఉద్యోగం యిప్పించిన నాడే అనుకున్నాను యేదో యెత్తుకి పై యెత్తు వేసి వసూలు చేసుకుంటారని ' గోపాలం ఆవేశపడ్డాడు

నీకు ఉద్యోగం యిప్పించాడంటే పదివేలు సాయం చేసాడనుకో అలాంటి యెన్ని వందలు యిస్తే నువ్వు ఆ అప్పు తీర్చగలవురా ఇలాంటి చిన్న –చిన్నవి లెక్కచేయకు ' మనసులో యేదో మూల కలుక్కు మంటున్నా పరందామయ్య గారు సర్దిపెట్టుకున్నారు

'నా ఉద్యోగానికేం, ఆయన లంచం యివ్వలేదుకదా ఆ మేనేజర్ తన యింట వారాలు చేసుకుని తన దగ్గరే చదువు కున్నాడు కాబట్టి చనువుగా వెళ్ళి అడిగారు ఆ రామ్మూర్తి యితని మీద గౌరవం కొద్దీ 'సరే' నన్నాడు ఆ మాత్రం సాయం మనచేతిలో ఉంటే మనం మాత్రం చెయ్యమా? కుఱ్ఱతనం, అను బవం లేని వయస్సు అతనిని అంతకంటే దూరం ఆలోచించనియ్యలేదు

'ఆ వంద ఉంటే మరో ఖర్చుకి వచ్చేదికదా ' అని పార్వతమ్మ బయట పడలేక లోలోన సణుక్కుంది

అప్పటి నుంచి ప్రతీనెలా యించుమించుగా శాస్త్రిగారు రావడం, యేదో సాకుతో ఎంతో కొంత డబ్బు తీసుకువెళ్ళడం మామూలై పోయింది అప్పుడప్పుడు నెలమధ్యలో వచ్చి 'సినిమా చూడాలని మనసుగా ఉందిరా ఒక్క పది రూపాయలివ్వు' అని కూడా అడిగిపట్టు కెళ్ళేవారు ఎంత ఎదురు తిరుగుదామన్నా శాస్త్రి చేసిన ఉపకారం పరంధామయ్యని నోరు తెరవ నిచ్చేదికాదు పైగా యిద్దరిస్నేహం అలాంటిది!

★ ★ ★

శ్రావణమాసం వచ్చింది

పేరంటానికి వెళ్ళి వచ్చిన పార్వతమ్మ 'ఏమండీ ఆ రోజు శాస్త్రిగారు వాళ్ళావిడకి పట్టుచీర

# "కలుపుమొక్క – కల్పవృక్షం"

కొనడానికి గదూ డబ్బు అడిగి తీసుకుని వెళ్ళేరు ? మరి యీ రోజు ఆవిడ సాదా నేత చీర కట్టుకుని పేరంటానికి వచ్చింది ప్రక్కన కూర్చుని మెల్లిగా కదిపాను ఆ విషయమే 'ఏమండీ వదినగారూ ' నలుగురి దిష్టి తగ్గులుతుందనే పట్టు చీర పెట్టో మూత పెట్టేరా?' అని ఆవిడ పాలా చిన్న బుచ్చుకుంది పాపం

'మరి శాస్త్రి ఆ డబ్బు యెందుకు తీసుకువెళ్ళినట్టు? నాకు తెలిసినంతవరకు శాస్త్రికి దురలవాట్లు కూడా యేం లేవే యింటి ఖర్చుకి చాల్లేదని అడగలేక అలా అడిగి ఉంటాడు ' తాత్కాలికంగా యేదో సర్ది పెట్టుకున్నా పరంధామయ్యలో సహనం రానురాను చచ్చిపోయింది

ఒకరోజు పార్వతమ్మ –'ఏమండీ శాస్త్రిగారి అమ్మాయికి సంబంధాలు చూస్తున్నారుట ఒకవేళ మన గోపాలానికి చేసుకోమని అడుగుతారేమో ముందుగా జాగ్రత్తపడండి పిల్లంటే లక్షణంగా ఉంటుంది గాని 'మీ అబ్బాయికి ఉద్యోగం వేయించాను కట్నం యివ్వ నంటారు మనం మారు మాట్లాడలేము కూడా అంది భర్తతో

'అవును సుమా! నా కసలు ఆ పాయింటే బుఱ్ఱలో లేదు అసలు ఆ ఉద్దేశంతోనే యీ ఉద్యోగం వేయించి ఉంటాడు పైగా పది రోజుల్లె వచ్చినప్పుడల్లా పిల్ల పెళ్ళి విషయం యెత్తి యేదైనా మంచి సంబంధం ఉంటే చూడమం'టున్నాడు ఏదీ స్నేహితుడ్ని కదా అలా అడిగాడనుకున్నాను గాని యింత దూరం ఆలోచించలేదు యింత వరకూ తనకా ఆలోచనే రానందుకు తనకి తానే నిందించుకున్నారు పరంధామయ్యగారు శాస్త్రిగాని ఆ విషయం ప్రస్తావిస్తే తగిన జాగ్రత్తలో ఉండాలని నిశ్చయించుకున్నారిద్దరూ

మరి నాలుగురోజుల తర్వాత అలవాటు ప్రకారం వచ్చిన శాస్త్రిగారి ముఖం సంతోషంతో వెలిగిపోతోంది 'ఇన్నాళ్ళకి నా గుండె బారం దిగిందిరా అమ్మాయి పెళ్ళి కుదిరింది ' ఆ మాటలకి పరందామయ్యగారు అదిరిపడ్డారు ఇంకా శాస్త్రి తన దగ్గరికి వచ్చి తన కొడలిగా చేసుకోమని అడుగుతాడు తగిన సమాధానం చెప్పి పంపిద్దామని యెదురు చూస్తున్నాడు తను

'నాలాగే నా అల్లుడు కూడ బడిపంతులే అంతకంటే పెద్ద సంబంధం నేనెక్కడ నుండి తేగలను చెప్పు? వచ్చే నెల యిరవై రెండున పెళ్ళి రేపు శుక్రవారం తాంబూలాలు పుచ్చుకుంటున్నాం ఈ శుభవార్త చెల్లెమ్మకి కూడా చెప్పు వస్తా యింకా చాలా పనులున్నాయి మరి సమాధానం కోసం యెదురు చూడకుండా వెళ్ళిపోతున్న శాస్త్రిగారి వేపు ఆశ్చర్యార్థకంగా చూస్తుండిపోయారు పరంధామయ్యగారు

★ ★ ★ ★

కాలచక్రం గిర్రున తిరిగింది

రిటైరైన పరంధామయ్యగారు కొడుకు దగ్గర సెటిల్ అయ్యారు గోపాలం పెళ్ళి అయి, యిద్దరు పిల్లల తండ్రి అయాడు రిటైరయేక వచ్చిన సొమ్ముతో పెద్దమ్మాయి గౌరి పెళ్ళి అయిందనిపించారు పరందామయ్యగారు శాస్త్రిగార్లు అడపాదడపా ఉత్తరాల్లు రాస్తుండేవారు

పరంధామయ్యగారి రెండవ అమ్మాయి పద్మ కూడా పెళ్ళిడుకొచ్చింది కాలంతో పాటుగా కట్నం ధరలూ పెరిగాయి పదిహేను, యిరవై వేలు అంటే మాటలా? పదిహేను వందలు కూడా యెక్కడా లేవు కొడుకు చూస్తే 'నా పిల్లలూ యెదుగుతున్నారు యింక నేనేం సాయం చెయ్యలేను ' అని నిర్మొహమాటంగా చెప్పేసాడు పద్మ పెళ్ళి సమస్య పరందామయ్య గారిని మానసికంగా చాలా కృంగదీసింది ఏ సలహా అడగడానికి శాస్త్రిగారు కూడా దగ్గర్లో లేరు నెల రోజులుగా ఒక్క ఉత్తరం కూడా వ్రాయలేదు పోనీ వెళ్ళి ఓసారి చూసి వస్తే? చిన్నప్పటి రోజులు ఆ స్నేహం తలచుకుంటూ ఉంటే ఒక్కసారి పరందామయ్యగారి మనసంతా వికలమైంది

చాల్లెండి ఛాదస్తం మీరూ ఇన్నేళ్ళుగా మిమ్మల్ని బిక్కార్ని చేసి, యిప్పటికేదో వదిలి పెట్టారని సంతోషించక, యింకా ఆయనని చూడడానికి ఖర్చులు పెట్టుకుని వెళ్ళడం కూడాను ఊర్కోండి' పార్వతమ్మ మందలించింది

పరందామయ్యగారికి మనసు ఉండబట్టక పద్మకి యేదో సంబంధం చూడడానికని చెప్పి బయలుదేరారు

★ ★ ★ ★

పరందామయ్యగారిని చూసి శాస్త్రిగారి అబ్బాయి గొల్లుమన్నాడు 'మామయ్యగారు నాన్నగారు నన్నొదిలి వెళ్ళిపోయారం'టూ

శాస్త్రిగారు అలవాటుగా కూర్చునే వాలుకుర్చీ హాలులో బోసిగా ఉంది

తనకు తెలియకుండానే యింతలో యింత ఘోరం ఎలా జరిగింది? పరందామయ్యగారి మనసు వశం తప్పుతూ ఉంటే అరుగుమీదనే కూలబడిపోయారు నాన్నగారికి ఖరీదైన మందులు కూడా యిప్పించలేక పోతున్న నా చేతులారా నాన్నగారిని చంపేసాను విశ్వం వెక్కి వెక్కి యేడుస్తున్నాడు

'విస్సు, నాకు మాట మాత్రంగానైనా రాస్తే డబ్బు పంపేవాడిని కదురా యెందుకిలా చేసావ్?'

'నాన్నగారి పరిస్థితి అంతా వివరంగారాస్తూ, ఒక అయిదు వందలు పంపమని కూడా ఉత్తరం రాసేను నాన్నగారే చెప్పేరు రాయమని కాని మీ దగ్గర్నుంచి సమాధానం లేదు విశ్వం తనకి




కె పి ఆర్–ఇచ్ఛాపురము

నా వయస్సు 25 సం నేను దగ్గేటప్పుడు చిక్కగా బిళ్లలు బిళ్ళలుగా కపము వస్తుంది (కొద్దిపాటి నల్లగా వుంటుంది) రోజుకి ఎన్నిసార్లు దగ్గుతానో నాకే తెలియదు నీరసముగా వుంటాను ఇలా జరగటం రెండు సం కావస్తుంది డాక్టరుని సంప్రదించాను సలహా ప్రకారము రక్త పరీక్ష చేయించాను రక్తములో 8/ ఇస్నోఫిలియా ఉందని పరీక్షలో తేలింది

రక్తపరీక్ష, కఫ పరీక్ష, చాతీ ఎక్స్–రే మొదలయిన పరీక్షలు వైద్యుల సలహా ప్రకారం చేయించవలసి ఉంటుంది ఫలితాల ననుసరించి చికిత్స చెయ్యాలి బ్రాంకి యెక్టేసిస్ అనే రోగం ఉన్న వారికి, క్రానిక్ బ్రాంకైటిస్ ఉన్న వారికి పై లక్షణాలు కనబడుతాయి

సి ఎస్ ఆర్–సికిందరాబాద్

లవంగాలు తింటే శరిరానికి ఏదైనా హాని కలిగిస్తాయా? సంపూర్ణ ఆరోగ్యముగా ఉన్న వ్యక్తి స్త్రీ కాని పురుషుడు కానీ రక్తం తక్కువగా ఉన్నచో (వీరిలో ఎవరైనా) వివాహానికి అర్హులా? అనర్హులా? దాని వలన ప్రాణానికి ఏమైనా ప్రమాదమా'

మోతాదు మించి ఏది తీసుకొన్నా ప్రమాదమే! అధికంగా తింటే కడుపులో పుండు (మంట వల్ల) ఏర్పడవచ్చును రక్తం తక్కువ అనేది ఎందువల్ల ఏర్పడినదీ తెలుసుకోవటం చాలా అవసరం మామూలు కారణాలు అంటే ఇనుప ధాతువు లోపం, అధిక రక్తస్రావం మొదలయిన వాటి వల్ల అంటే తాత్కాలిక కారణాల వల్ల అనీమియా ఏర్పడితే వివాహానికి ఆటంకం కాదు అనీమియా మరీ ఎక్కువగా ఉంటె, దానికి తగిన చికిత్స లభించకపోతే తప్పకుండా ప్రాణాపాయమే!

వి వి జి , గుంటూరు

నా వయస్సు 18 సం లు నా ఎత్తు 5 6 బరువు 55 కిలోలు నేను కొద్దిగా లావుగా ఉంటాను నాకు సుమారు సంవత్సరంన్నర క్రితం నుండి తుంటి క్రింద ఉబ్బెత్తుగా క్రొవ్వు పెరుగుతున్నది నా నడుము చుట్టు కొలత 32 అం లు ఉండగా కేవలము ఒక్కతుంటి క్రింద కొలత 22 అం లు ఉన్నది మా అన్నయ్యలు కూడా లావుగానే ఉంటారు కానీ వారికి ఈ విదంగా లేదు నేను చాలామంది లావుపాటి వారిని చూసాను కానీ ఎవ్వరికి ఈ విదముగా లేదు ఇది ఏమైనా గ్రందుల లోపమా? లేక వ్యాయామము చేసినచో తగ్గిపోవునా?

వ్యాయామం చేసినంత మాత్రాన లావు తగ్గదు ఆహారం చాలామటుకు తగ్గించవలసి ఉంటుంది అన్ని రకాల ఆహారాన్ని చాలా ప్రమాణం తగ్గించవలసి ఉంటుంది అల్లా తగ్గించి వ్యాయామం చెయ్యటం మొదలుపెడితే తప్పకుండా లావు తగ్గుతుంది

డి ఎల్ , మద్రాసు

నా మూత్రికపై గిల్లితే ఏ విదముగా అవుతుందో ఆ విదముగా అయి మంటగా ఉంటుంది మూత్రము పోస్తుంటే కూడా మంటగా ఉంటుంది ఈ విదముగా ఎందుకవుతుంది దీనిని ఏమంటారు ఇది ఏమి చేస్తే తగ్గుతుంది

మీరు లేడీ డాక్టర్ని కలిసి సంప్రదించండి ప్రత్యక్ష్యంగా పరీక్ష చేసిగాని రోగ నిర్ణయం చెయ్యలేము రోగానికి తగిన ఆంటీ బయాటిక్‌లు వాడితే తగ్గిపోతుంది □

ఉత్తరం రాసాడా? మరి తనకి అందలేదేం? తను యింట్లో లేనప్పుడు అందితే డబ్బు పంపమని రాసేడని పార్వతిగాని తనకి చూపించలేదా?

నాన్నగారు మీకు యీ కాగితాలు అందజేయ మన్నారు' విశ్వం యిచ్చిన కాగితాలు అందుకుంటుంటే పరందామయ్య గారి చేతులు వణికాయి

ఒరేయ్ పరందామా ఈ వ్రాయబోతున్న విషయాలన్నీ నేనే స్వయంగా నీ దగ్గరికి వచ్చి, నీకు చెప్పాలనుకున్నాను కానీ బగవంతుడు నాకా అవకాశం యివ్వడేమోననే బయం కల్గి రాస్తున్నాను

డబ్బు చేతికందగానే ఖర్చులు యెవ్వరికైనా కన్పిస్తాయి కాని, వాటిని అదుపులో పెట్టుకుని, పొదుపు చేసుకోవడం యే కొందరికో సాధ్యమవుతుంది పొదుపు లేని మద్య తరగతి కుటుంబాలు యెప్పుడూ వెలితిగానే ఉంటాయి చిల్లు ఉన్న చెంబు నిండా నీళ్ళు నింపాలనుకోవడం మూర్ఖత్వమే కదూ? చిన్నప్పటి నుండి మన మద్య ఉన్న స్నేహపు చనువును బట్టి యిదంతా రాస్తున్నాను మరోలా అనుకోకు

నువ్వు ఒక్కడివీ సంపాదించినప్పుడూ ఒకలాగే ఖర్చు పెట్టేవు గోపాలం ఉద్యోగస్థుడైన తర్వాత కూడా అలాగే ఖర్చు పెట్టేవు ఎప్పటిదప్పుడే అనుబవించాలి! ఈ రోజు మళ్ళీ రేపు రాదనే మనస్తత్వం నీది తింటూ కూర్చుంటే కొండలైనా తరిగిపోతాయి నీకు చూస్తే ఆస్తిపాస్తులేం లేవు ఆస్తి అన్నది యెక్కడి నుంచో రాదు యీ రోజు మనం కూడబెట్టినదే రేపు మన పిల్లలకి ఆస్తి అవుతుంది ఈ రోజు కొడుకు, నువ్వు సంపాదిస్తున్నామని ఖర్చు పెడితే ముందు ముందు నీ కూతుళ్ళ పెళ్ళిళ్ళు బాద్యతలు యెలా తీరుతాయని ఆలోచించేవా? ఇప్పుడు పంపుతున్న డబ్బు గోపాలం ఎల్లకాలం పంపగలడా? వాడికీ పెళ్ళి అవుతుంది బార్యా , పిల్లలు బాద్యతలు పెరుగుతాయి నువ్వు రిటైరవుతావు వచ్చిన డబ్బుతో పెద్దమ్మాయి పెళ్ళి కానిచ్చినా పద్మ పెళ్ళి నీకు సమస్యగ తయారవుతుంది అందుకే నెలనెలా నీ దగ్గర యేదో సాకుతో డబ్బు తీసుకుని అదంతా పోస్టాపీసులో జమకడుతూ వచ్చాను క్రిందటి నెలలో ప్రైజు స్కీము క్రింద నీ ఎకౌంట్‌కి పదివేలు ప్రైజు వచ్చింది అది కూడా అందులోనే, జమ చేసాను మాటి మాటికి డబ్బులడిగి మీ దగ్గర యెంతో హీనంగా ప్రవర్తించినా, ఎప్పటికైనా నా యీ పని నీకు ఉపకార మవుతుందనే తృప్తి నాకుండేది

రోజురోజుకి నా ఆరోగ్యం కూడా దెబ్బతింటోంది ఆ బగవంతుడి పిలుపు కోసం యెదురు చూస్తున్నాను

మీకు తెలియకుండా యీ విదంగా చేసినందుకు నువ్వు , చెల్లెమ్మ

ఉత్తరం అంతా యెప్పుడో రాసినా చివరి పంక్తులు యీ మద్యనే రాసినట్లుగా, అతికినట్లు గున్నాయి ఉత్తరం అసంపూర్తిగా వదిలేసారు పాస్‌బుక్ తెరిచారు మొత్తం 18620 రూ లు!

'శాస్త్రి నువ్వు నువ్వు నిజంగా నా పాలిటి దేవుడివే!' రెండు చేతులూ యెత్తి పైలోకంలో ఉన్న శాస్త్రి గారికి నమస్కరించారు పరందామయ్య గారు

ఇన్నాళ్ళుగా కలుపు మొక్కగా కనిపించినది యిప్పుడు కల్పవృక్షముగా ప్రత్యక్షమైంది?

పరందామయ్య గారి కంటి నుండి కారిన రెండు కన్నీటి చుక్కలు చేతిలో ఉత్తరం మీద పడి జారిపోయాయి □

## వ్యక్తిగతం



నేటి సుప్రసిద్ధ సితార్ విద్వాంసులలో మేటి అయిన శ్రీ నిఖిల్ బెనర్జీ (55) జనవరి 27న కలకత్తాలో హృద్రోగంతో మరణించారు. ఈయన అకాల మృతి దేశంలోని సంగీత విద్వాంసులు, రసజ్ఞులకే కాక విదేశాలలోని ఎందరికో తీరని దుఃఖాన్ని కలిగించింది ఆయనకి భార్య ఇద్దరు కుమార్తెలు ఉన్నారు సితార్ విద్వాంసుడైన తమ తండ్రి జితేంద్రనాద్ బెనర్జీ దగ్గరే శ్రీ నిఖిల్ తొలి శిక్షణని పొందారు తొమ్మిదేళ్ల ప్రాయంలోనే ఉజ్వల భవిష్యత్తుగల వర్ధమాన కళాకారుడిగా గుర్తింపు పొందారు తదుపరి శిక్షణ కోసం ఆయన శ్రీ కిశోర్‌రాయ్ చవుదరివద్ద చేరారు 16 ఏళ్ల వయసులో ఉన్నత శిక్షణ కోసం ఉస్తాద్ అల్లాఉద్దీన్ ఖాన్ శిష్యుడిగా చేరి ఏడేళ్ల పాటు అవిశ్రాంతమైన కఠోర శిక్షణ పొందారు 1954లో తొలి సారిగా గురువుగారి ఆశీస్సులతో కలకత్తాలో జరిగిన తాన్‌సేన్ ఉత్సవాలలో సితార్ వాయించారు అనంతరం దేశవిదేశాలలో ఎన్నో సితార్ కచేరిలని చేసి ప్రముఖుల ప్రశంసలందుకున్నారు అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని అమెరికన్ సొసైటీ ఫర్ ఈస్టర్న్ ఆర్ట్స్ వేసవి స్కూలులో సితార్ బోధకుడిగా పనిచేస్తూ కొన్నేళ్లపాటు సంవత్సరానికి కొన్ని నెలలు అమెరికాలో ఉంటూ ఉండేవారు 1968లో పద్మశ్రీ 1974లో సంగీత నాటక అకాడెమి అవార్డులు ఈయనకి లభించాయి నిశ్చలమైన కర్తవ్య దీక్ష నిర్విరామకృషి ఈయనని గత నాలుగైదు దశాబ్దాలలోని సితార్ విద్వాంసులలో అగ్రగామిని చేసాయి శ్రీ నిఖిల్ నిరాడంబరత వినయ సంపద ఆయనతో పాటే పెరిగి ఆయన వ్యక్తిత్వానికి మరింత పరిపూర తని చేకూర్చాయి



చండీఘర్‌ని పంజాబ్‌కి, అందుకు బదులుగా పంజాబ్‌లోని హిందీ ప్రాంతాలయిన ఫజిల్‌కా, అబోహార్‌లలోని కొన్ని గ్రామాలని హర్యానాకి బదిలీ చెయ్యడంలో న్యాయమూర్తి శ్రీ కె. కె. మాత్యూ అధ్యక్షతన నియమించబడిన సంఘం విఫలమైంది......

## వారఫలం

**21-2-1986 శుక్రవారం మొదలు 27-2-1986 గురువారం వరకు**

★ **మేషం** :'సాటివారి పోటిలో నెగ్గనాం' అనే ఆనందం చేకూరుతుంది. అనుకూలమైన గ్రహ సంపద గలదు. భారీ వ్యాపారమయినా, గ్రంథ విక్రేతలయినా, పత్రికా నిర్వహణమైనా, చలనచిత్ర రంగానుభవం గలవారైనా ఈ వారం మీ అభీష్టం నిశ్చయంగా నెరవేరగలదు. స్త్రీలకు : బంధువుల రాక, వారికి ఉపచారాలు చేయటంతో వారం గడచిపోతుంది.

★ **వృషభం** :ఎంతో కాలంగా మీతో సహకరించి, ఉపకారం చేసే మిత్రులు హటాత్తుగా దూరమవుతారు ఆ కారణాన చికాకు కలుగుతుంది మీలో ఉద్రేకత పెరుగుతుంది చుట్టూ చేరిన వారి వలన చికాకు అధికమవుతుంది అనుకోకుండా ఒకానొక రంగాన సదవకాశాలు లభ్యం కానున్నవి ఒకవేళ అది కళారంగం కావచ్చు స్త్రీలకు వృత్తియందు పెంపు స్వల్పంగా దనలబ్ధి

★ **మిధునం** :ఎంతో కాలంగా ఆశించిన కార్యనిర్వహణ ఈ వారం సానుకూలం కాగలదు అనుకొన్న విదంగా డబ్బు చేతికి రావటం అప్పులు వసూలు కావటం గమనించగలరు ఈ మాత్రం దనాదాయం చేకూరటం ఎంతో మేల ని గ్రహిస్తారు స్త్రీలకు ఇటీవల వస్తువులు మతిమరపు వలన పోగొట్టుకొన్నారుగా! వాటిని సేకరించుకోగలుగుతారు ఉద్యోగ రీత్యా హెచ్చరిక

★ **కర్కాటకం** నూతన వ్యక్తులతో పరిచయం ఏర్పడుతుంది హితులున్నారు సమయంలో ఆదుకొంటారు అనే నిశ్చయం ఏర్పడుతుంది కొందరు రాజకీయంగా చేసిన యత్నాలు సఫలం కాగలవు గ్రంథ రచన యందు పత్రికా నిర్వహణ మందు ప్రావీణ్యత గల వారికి అనుకూల వారం దనాదాయమున్నది స్త్రీలకు వైజ్ఞానికంగా వృత్తి రీత్యా అనుకూలం గ్రహించండి

★ **సింహం** :క్రితం కొన్ని వారాల కన్న స్థితి యందు కొంత మెరుగు కన్పిస్తుంది 'ఎవరో వస్తారు ఏదో చేస్తారు అని నమ్ముకొన్న కాలం యిక నుండి తొలగిపోతుంది. మీ కాళ్ళ మీద నిలబడే అవకాశాలు లభ్యం కాగలవు. 'ఇంట శుభం జరుగుట నిశ్చయం' అని గ్రహిస్తారు. స్త్రీలకు : శుభకార్యాలో చన, స్వల్పాదాయం.

★ **కన్య** :చాల కాలంగా 'యిదా అదా' అనుకుంటూ 'మీనం, మేషం' అంటూ కాలయాపన చేసిన వ్యవహారం ఈ వారం సర్వానుకూలం. అన్ని రంగాలలో కలసి రాగలదనే నిశ్చయం ఏర్పడగల అవకాశం, స్వల్పంగా ఆదాయం చేకూరుతుంది. స్త్రీలకు : ప్రయాణాలు తగులుతాయి, సాగించుట వలన మేలున్నది. విద్యాభివృద్ధికి యత్నించే వారికి మేలే.

★ **తుల** :'ఉపకారులెవరో, అపకారులెవరో' అని ఊహించుకోలేక వారమంతా తికమక పడుతారు. 'ఇచ్చిన డబ్బు యితరుల చేతి నుండి రాలేద'ని ఆవేదన పడుతారు. దైవకార్య నిర్వహణమునకు కొందరు ఉద్యుక్తులవుతారు కాని సాగించలేకపోతారు. స్త్రీలకు : గృహ నిర్వహణా భారంతో వారం గడచిపోతుంది.

★ **వృశ్చికం** :ఏది ముందు, ఏది వెనుక, అని నిశ్చయించుకో లేకపోతారు. చేసే వ్యాపారంలో కూడా ఎదురు దెబ్బ తినవలసిన అగత్యముంటుంది. గమనించాలి మనో నిబ్బరంతో వాకచక్యంతో కొన్ని యిబ్బందులు తప్పించుకోవచ్చు వయసు మిరిన వారి ఆరోగ్యం బాగా చెడిపోయే సూచనగలదు మంత్రతంత్ర ఔషద సేవ అవసరం స్త్రీలకు మూవిషయం ఉద్యోగ విషయం చికాకునకు దారి తీస్తుంది గ్రహించి మెలగండి

★ **ధనుస్సు** కొందరు భూమిని విక్రయించవలసిన పరిస్థితులుంటాయి కొందరు అనవసర ప్రయాణాల వలన నష్టపోతారు వెనుకుముందు లాలో చింపని వ్యవహారాలన్నీ యింతే జాయింటు వ్యాపారమైతే మరి హుషారు అవసరమని చెప్పనక్కరలేదు స్త్రీలకు అలవాటుగా చేసే వృత్తియందు ఏదో లోపం కనిపిస్తుంది గ్రహించండి

★ **మకరం** :అన్నివిదాలా గ్రహానుకూలత గల వారం వ్యాపార విస్తరణకు అనుకూలం వ్యవహారం ఏదయినా ఉంటే పరిష్కరింపబడగలదు అనుకూలమో కాదో గాని మనశ్శాంతికి ఆకరం కాగలదు సమయానుకూలంగా మెలగటం నేర్చుకోవాలి స్త్రీలకు దనదాన్య వస్తువాహన సంపత్తి కొందరకు ఆనందదాయకం కాగలదు

★ **కుంభం** ఆటపాటల్లో పోటీలలో పాల్గొనే వారికి సంగీత సాహిత్య సభలందు పాల్గొనే వారికి పత్రికా వ్యాసంగాన శ్రమించే వారికి చలన చిత్రరంగాన అనుభవం గడించిన వారికి వారమంతా యోగదాయకమే దనలబ్ధి కూడ చెప్పదగిన అంశమే. స్త్రీలకు : ఆశించినంత కన్న మిన్నగ ధనలబ్ధి, వృత్తియందు వికాసం.

★ **మీనం** :దూరపు ప్రయాణాలు కొందరకు లాభిస్తాయి. సాగించటం శ్రేయస్కరమే. కొందరకు వారమంతా శ్రమకరం. అంతేగా, ఆశించిన వ్యవహారం అనుకూలం కానపుడు, చికాకునకు గురి కావలసిందే. శుభ వ్యవహారాలు కూడా కలిసి రావని, వారాంతంలో గ్రహిస్తారు. స్త్రీలకు : నూతనోద్యోగ ప్రాప్తి కొందరకు, ప్రభుత్వ పరంగా అందవలసిన పైకం అందటం కొందరకు చెప్పదగిన ముఖ్యాంశాలు.

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



# ఫెమినా
# వంటసామాగ్రి
# నా సమయం మరియు
# పని సమస్యను
# తీర్చివేసింది

# ఫెమినా
## వంట సామాగ్రి
## ఆధారపడదగ్గ సులభమైన వంట సహాయకారి

ఎంత చేసినా తరగనట్లుండే వంటపని
మరియు పరిమితమైన సమయం
ఫెమినా ఈ రెండింటిమధ్య దూరాన్ని తొల
గించింది ఇపుడు ఇక చపాతీలు, పుల్కాలుగాని
పూరీలుగాని నిమిషాలలో పని....
అతిధులకు తరచుగా రుచికరమైన కాఫీలుగాని
పండ్లరసాలుగాని సెకండ్లలో
ఫెమినా వంటసామగ్రి తీరికలేని భారతీయ
గృహిణికోసం ప్రత్యేకంగా తయారు చేయ
బడినవి.
అవి భారతదేశపు అన్నిప్రాంతాల వంటరుచు
లను ఇంటిలో సంతృప్తి పరుస్తాయి






ఆంధ్రప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు



**మహావీర్** ఎంటర్‌ప్రైజెస్

ఫోన్స్: 221198
34361

కాంచన్‌జంగ కాంప్లెక్స్, కింగ్ కోఠి [illegible] దరాబాద్-1

సీరియల్

## ఎస్. భారతీ దేవి



# ప్రేమసాగరం

(గత సంచిక తరువాయి)

రమణరావు గారు పక్షవాతంతో మంచానపడిన దగ్గర్నుంచి కూతురుకూ భార్యకూ ఎదురు చెప్పటం మానేసారు తన అభిప్రాయాన్ని వాళ్ళు గౌరవించరన్న విషయం ఆయనకు తెల్సు అందుకే వాళ్ళ అభిప్రాయాలతో ఏకీభవిస్తుంటారు

మోహినిని జయరాం రహస్యంగా ఎవరికి తెలియకుండా గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు

మోహినికిప్పుడు ఏడో నెల జరుగుతుంది ఆఫీసులో వాళ్ళు తనను గురించి హేళనగా మాట్లాడుకోవటం నవ్వుకోవటం చూసి ఆ బాధ భరించలేక నెల తప్పగానే ఉద్యోగం మానేసింది వాళ్ళ కుటుంబాన్నంతటిని జయరామే భరిస్తున్నాడు

రోజూ అతనికి వీలయినప్పుడల్లా వీలయినంత ఎక్కువ సమయాన్ని మోహినితో గడుపుతున్నాడు జయరాం

ఎనభయ్యో నెంబరు నేత చీరలు కట్టే పరలక్ష్మి ఇప్పుడు అయిదారు వందలు చేసే వెంకటగిరి వెండి జరి చీరలు కడుతుంది పసుపుతాడు తప్ప ఏనాడూ చిన్నం బంగారం కూడా పెట్టని ఆమె ఇప్పుడు బంగారు సూత్రపు గొలుసు రెండు చేతులకూ బంగారు గాజులు వేసుకుంటుంది

పచ్చడి చారుతో రెండు పూటలా భోజనాలు ముగించే వాళ్ళు ఇప్పుడు పూటకు మూడు రకాల కూరలతో భోంచేస్తున్నారు

మంచంలో ఉన్న రమణరావుగారు అన్ని చూస్తూ ఎప్పటిలాగే మౌనంగా ఉంటున్నారు ఆయన కష్టమున్నా లేకపోయినా కూతురు తెచ్చి పెడుతున్న మందులను బలవంతంగా మింగుతున్నారు

మోహినికి ప్రెగ్నెంట్ వచ్చింతర్వాత ఆమె చీరలకయితేనేం నగలకయితేనేం దాదాపు యాభయి వేల రూపాయలు ఖర్చు పెట్టాడు జయరాం

జయరాం వచ్చిన అలికిడి విని మోహిని లోపల్నుంచి వచ్చి గుమ్మంలో నిలబడింది

ఏడో నెల కూడా నిండబోతుండటం వల్ల శరీరాన్ని ఆవరించిన నిండుతనం చూపుల్లో సహజంగా వెల్లివిరిసే మెరుపుకు తోడు మాతృత్వాన్ని పొందబోతున్నానన్న గర్వపు రేఖలు కూడా తొంగి చూస్తున్నాయి

ఇంతాలస్యంగానా రావటం? అన్నట్టుగా అలవోకగా చూసింది అతని వైపు

అతను తలుపులు మూసి ఆమెకు దగ్గరగా వచ్చాడు అతని ముఖ కవళికలు గమనించిన ఆమె దూరంగా జరుగుతూ అమ్మో! ఇప్పుడా? ఊహు అంది మత్తు కళ్ళతో గోముగా

నాకిప్పుడే కావాలి ఆమె భుజాల వెనకగా చేతులువేసి గాఢంగా గుండెలకు హత్తుకున్నాడు

ఆమె కనురెప్పల కదలికల్లో అతని రూపం ఆమె పెదవులలో అతని పెదవులు ఆడుకుంటున్నాయి ప్రేమానురాగాలకు కోరిక తోడయింది రెండు శరీరాలు ఏకమయ్యాయి అలసటగా ఊపిరి పీలుస్తూ పడుకుంది మోహిని

బాధగా ఉందా? ముంగురులు సరిచేస్తూ అడిగాడు

నవ్వుతూ చూసింది అతని వైపు

బాధగానే ఉంటుంది అంటూ ఆమెకు కొంచెం యివతలకు జరిగి ఆమె కడుపుపై చెయ్యి వేసి మృదువుగా రాస్తూ చెప్పు మోహినీ! బాధగా ఉందా?

ఆమె చేతిని పట్టుకుని గుండెల మీద పెట్టుకుని వ్రేళ్ళు మృదువుగా నిమురుతూ డెలివరీ అయ్యేవరకూ నిన్ను బాధపెట్టను అన్నాడు

దేశంలో ఆడవాళ్ళందరూ భర్తలతో కాపురం చెయ్యడంలేదా? పిల్లల్ని కనడంలేదా? అంది నవ్వుతూ

అందరి సంగతి ఏమో నాకు తెలియదు తండ్రిని కావాలన్న కోరిక నాకీ జన్మలో తీరదనుకున్నాను ఆ కోరిక తీర్చుతున్నావు నువ్వు డాడీ అన్న పిలుపు కోసం నేనెంత తపించిపోతున్నానో నీకు తెలియదు నువ్వు కానీ నా బిడ్డగానీ ఎప్పుడూ బాధపడకూడదు సిటీలో మంచి పేరున్న నర్సింగ్‌హోమ్‌లో ట్రీట్‌మెంట్ ఇప్పిస్తున్నాను నొప్పులు లేకుండా కాన్పు జరుగుతుందనుకుంటే కాన్పు కోసం నిన్ను అమెరికా అయినా తీసుకు వెళతాను

**జరిగిన కథ– 5** స్వప్నంటే రఘునాద్‌కి ప్రేమ కానీ స్వప్న జయరాంను ప్రేమించి పెళ్ళి చేసుకుంది రఘునాద్ తండ్రి తల్లి చనిపోయారు రఘునాద్‌కి బిజినెస్సులో బాగా కలిసి వచ్చింది స్వప్నకు మతి భ్రమించింది మెంటల్ హాస్పటల్‌లో స్వప్నకు గతం గుర్తుకు వచ్చింది పెళ్ళయి మూడేళ్ళయినా జయరాం స్వప్నలకు సంతానం కలుగ లేదు స్వప్న గర్భసంచిలో గడ్డ ఉన్నందువల్ల ఆపరేషన్ చేసి గర్భసంచిని తొలగిస్తారు స్వప్న జీవితంలో తను తల్లి కాలేనని తెలుసుకుని కృంగిపోతుంది జయరాం తన ఆఫీసులో పని చేసే మోహిని అనే అమ్మాయితో ప్రేమాయణం సాగిస్తున్నాడని తెలుసుకున్న స్వప్న తండ్రి ఆస్థి అంతా కూతురిపేర రాసేస్తారు అది స్వప్నకు నచ్చదు స్వప్న భర్త అసలు స్వరూపం తెలుసుకుంటుంది స్వప్న తండ్రి తల్లి మరణించారు జయరాం ప్రియురాలు మోహిని గర్భవతయిందని రఘునాద్ స్వప్నకు చెపుతాడు జయరాంకు విడాకులు ఇచ్చేయమని చెపుతాడు స్వప్నకు తను అండగా ఉంటానంటాడు అతనికి తనపై ఉన్న ప్రేమకు చలించి పోతుంది స్వప్న

ఇంకా నయం నా బదులు మీరు పురిటి నొప్పులు పడతాననలేదు అంది కలకల నవ్వుతూ

వీలయితే ఆ పని అయినా చేసేవాడిని అన్నాడు ఆమె బుగ్గ మీద చిటికె వేస్తూ

చేస్తారని నాకు తెల్సు అంది గర్వంగా నవ్వుతూ

చాలా టయమయింది ఇక వెళ్ళనా?

నాన్నగారి మందులు అయిపోయాయి ఇంట్లో కూడా సరుకులు లేవని చెప్పింది అమ్మ

ఎంత కావాలి?

ఎంతో కొంత ఇవ్వండి

ఎంత కావాలో చెప్పు మోహినీ

నేనడిగినంత ఇస్తారా?

ఇవ్వనని ఎప్పుడయినా అన్నానా?

నాకో పాతిక వేలు కావాలి అంది అతని షర్టు గుండీలు సరిచేస్తూ

పాతిక వేలా? అంత డబ్బెందుకు?

ఎంతడిగినా ఇస్తానన్నారుగా? పాతిక వేలివ్వటానికే ముఖం ఆముదం తాగినట్టు పెట్టారు అంది చిరు కోపంగా

ఎందుకు అని అడిగానే అంతేగాని ఇవ్వను అనలేదు అన్నాడు జయరాం ఆమెకు కోపం వచ్చిందేమో అని భయపడుతూ

డబుల్ కాట్స్ వాటి మీద పరుపులు దిళ్ళు, బెడ్‌షీట్స్ అన్నీ అయిదు వేలు అవుతాయి మీరొచ్చే దాకా వంటరిగా ఉండాలంటే బోర్‌గా ఉంది పదివేలయినా సరే మంచి కలర్ టి వి. టేప్‌రికార్డర్ కొనుక్కోవాలనుకుంటున్నాను ఇంటి పనంతా చేసుకోలేక అమ్మ బాధపడుతుంది మిక్సీ, గ్రైండర్‌కొంటే ఆమెకు బాధ ఉండదు ఇవన్నీ కావాలంటే కనీసం పాతిక వేలు అవుతాయి నేనేం దుబారాగా ఖర్చు చేసి నగలూ చీరలూ కొనాలనుకోవటం లేదు ఇంటి కవసరమైన వస్తువులు కొనాలనుకొంటున్నాను మీకిష్టమయితే ఇవ్వండి లేకపోతే లేదు అంది మూతి సున్నాలా చుట్టి

రేపు సాయంత్రం నువ్వడిగిన డబ్బిస్తాను నీకిష్టమయినవి కొనుక్కో

నాకు తెల్సు మీరా మాట అంటారని అంది గోముగా

నీ చూపు నా మీద సమ్మోహనాస్త్రంలా పని చేస్తుంది ఆమె నుదుటి మీద ముద్దు పెట్టుకుంటూ అన్నాడు వెళ్ళబోతూ జేబులో నుంచి వెయ్యి రూపాయలు తీసి ఇంటి ఖర్చులకు ఉపయోగించు అంటూ ఆమె కందించాడు

* * * *

రఘునాద్ దగ్గర్నుంచి వచ్చిన దగ్గర్నుంచి లాన్‌లో కూర్చునుంది స్వప్న గంటలు గడిచిపోతున్నాయి సూర్యుడు అస్తమించాడు ఆకాశ వీదుల్లోకి చంద్రుడు విహారానికి బయలుదేరాడు కుర్చీకి అంటుకుపోయినట్టుగా, కూర్చున్న చోటు నుంచి కదలకుండా అలాగే కూర్చుంది

జయరాం! జయరాం ఎందుకిలా చేస్తున్నావు? నేనెలా బ్రతకాలనుకున్నావు? అని ఆక్రోశిస్తుంది ఆమె మనసు తన దురదృష్టానికి తనను తానే నిందించుకుంటుంది

తనకు అత్యంత ప్రియమయిన, అపురూపమయిన జయరాం నుంచి తను వేరయిపోతున్నట్టుగా, బాధతో మనస్సు విల విలలాడిపోయింది

తన ప్రాణమయిన భర్తను పదిలంగా మళ్ళీ తను దక్కించుకోగలదా? అది సాధ్యమా?

తన సర్వస్వాన్ని కోల్పోయినట్టుగా, తనకీ ప్రపంచంలో ఇంకేమీ మిగలనట్టుగా అన్పిస్తోంది

తనకి జరుగుతున్న సంఘటనలతో మతి పోయేలా ఉంది

ఏం చెయ్యాలి? రఘునాద్ అన్నట్టుగా రేపు, ఆమెనూ ఆమె బిడ్డనూ ఈ ఇంటికే తీసుకొస్తే?

భగవాన్! ఎందుకు నన్నిలా శిక్షిస్తున్నావు? నేనేం నేరం చేసాను? ఎవరికి ఏం అపకారం చేసాను?

ఆలోచనలతో ఏడ్చి ఏడ్చి రోజంతా భోంచెయ్యక పోవటం మూలంగా అలిసిపోయిన స్వప్న కుర్చీలో వెనక్కు వాలి కళ్ళు మూసుకుని మగతలాంటి నిద్రలోకి జారిపోయింది నిద్రపోతోందో కల గంటుందో ఆమెకే తెలియటంలేదు.

కళ్ళు తెరవాలని ప్రయత్నిస్తుంది సాధ్యం కావటంలేదు

స్వప్నా! జయరాం ఆమెను పిలుస్తూ ఆమెనలాగే పొదివి పట్టుకుని గుండెల కదుముకున్నాడు ఆమె నుదుటి మీదా కను రెప్పల మీదా మెద వంపులో ముద్దు పెట్టుకున్నాడు

నేను, నేనెక్కడున్నాను? బలవంతంగా కనురెప్ప లెత్తి చూస్తూ అడిగింది

నేను స్వప్నా! నువ్వు నా దగ్గర ఉన్నావు ఎందుకలా ఏదో వాగుతున్నావు? ఏదయినా కలగన్నావా? అనునయంగా అన్నాడు కళ్ళు విప్పార్చుకుని అతన్నే చూస్తుంది అతని కళ్ళలో ప్రేమ తొణికిసలాడుతుంది

హిస్టీరియా వచ్చిన దానిల్లా మీరుక్షణం పెద్దగా ఏడ్చిరిద్ది ఆపు టుట్టూ



# ప్రేమసాగరం

చేతులు పెనవేసి పొదివి పట్టుకుని బయంతో ఏడుస్తున్న చిన్న పాపను తల్లి అనునయిస్తూ గుండెల్లో దాచుకున్నట్టుగా ఆమె తలను గుండెల కదుముకున్నాడు

మీరు లేకపోతే నేను బ్రతకలేను చచ్చిపోతాను ఈ మరణయాతన నేను బరించలేనండీ అతన్ని అల్లుకుపోయి ఏడ్చింది స్వప్న ఆమె బాద చూస్తుంటే అతనిమీద అతనికే అసహ్యం కలిగింది మనస్సును కెలికనట్టనిపించింది

అతనికి స్వప్నంటే ఎంతో ప్రేమ సహజంగా అతనికి పిల్లలంటే చాలా ఇష్టం మోహన్నీ, అతని పిల్లల్ని చూసినప్పుడు మనకంటూ మన పిల్లలుండాలి అని అప్పుడప్పుడు అతను అనటం, క్లబ్ కెళ్ళినా ఎక్కడి కెళ్ళినా అతని ఫ్రండ్స్ చాలా టయమయింది పిల్లలెదురు చూస్తుంటారు అంటూ వాళ్ళు క్లబ్‌నుంచి హడావుడిగా వెళ్ళిపోవటం ఇవన్నీ కలిపి, అతని మనస్సులో అంతర్గతంగా పిల్లలు కావాలన్న కోరికను, అదికం చేసాయి

దానికి తగట్టుగా మోహిని అందం ఆమె చూపులతో మాటలతో కవ్వించటం అనుకోకుండా ఒకరోజు పిల్లలు కోసం అతను పడుతున్న ఆతృత స్వప్నకు తల్లయే అవకాశం లేకపోవటం అతని మనస్సులోని బాద ఆమెకు చెప్పటం జరిగింది

అతనికి పిల్లలు కావాలన్న కోరిక ఎంతదికంగా ఉందో ఖరీదయిన జీవితాన్ని గడపాలన్న కోరిక మోహినికి అంత అదికంగా ఉంది డబ్బున్నవాడు జయరాం అతనికి ఉంపుడుగత్తెగా ఉన్నా రాజబోగాలు అనుబవించవచ్చు అనుకుంది అతన్ని కవ్వించి ప్రోత్సహించి రెచ్చగొట్టి ఆమె వలలో పడేలా చేసుకుంది

జయరాంకు తండ్రిని కాబోతున్నానని మనస్సులో ఎంత సంతోషం ఉందో దేవతలాంటి స్వప్నకు చెయ్యకూడని అన్యాయం చేస్తున్నానన్న బాదా వేదనా అంతకంటే ఎక్కువగా ఉంది

అతనికి మోహినంటే వ్యామోహం తప్ప ప్రేమ అంతగా ఉండేదికాదు మొదట్లో ఇప్పుడు తను తండ్రిని . చేస్తూ తనకు వంశాంకురాన్ని అందిస్తుందన్న కృతజ్ఞతాబావంలో నుంచి ప్రేమ కలిగింది

స్వప్నమీదన్న ప్రేమలో వందో వంతు కూడా అతనికి మోహిని మీదుండదు

స్వప్నా! స్వప్నా అని పిలుస్తూ ఆమె తలను అలాగే గుండెల కదుముకుని తలమీద ముద్దుపెట్టుకున్నాడు అతని కళ్ళనుంచి రాలుతున్న కన్నీటి చుక్కలు ఆమె తలమీద పడుతున్నాయి

నువ్వు క్షమించానని చబితేగాని నాకు మనశ్శాంతి లేదు స్వప్నా

మిమ్మల్ని మరో ఆడదానితో నేను పంచుకోలేనండీ అంది పెద్దగా ఏడుస్తూ

పిల్లలమీదున్న కోరికతో నేని తప్పు చేసాను అంతేగాని నిన్ను మోసం చెయ్యాలన్న ఆలోచన నాకేకోశానలేదు నన్ను నమ్ము

నాకంటే మీకు పిల్లలే ముఖ్యమా?

కాదు

మరెందు కిలా చేసారు?

స్వప్నా! ఆ కోరికతో తప్పు చేసాను. నిన్ను క్షమించమని అడిగే అదికారం కూడా నాకు లేదు

కలలాంటి భ్రమలాంటి ఆ స్థితి నుంచి తేరుకున్న స్వప్న అప్పుడే స్పృహలోకి వచ్చినదానిలా అతనివైపు చూసింది

నను ..మించలేవా?

చా .. ..టి తర్వాత ఇప్పుడేం చెయ్యాలనుకుంటున్నారు? అంది

ఏమి .. ..ప్నా?

అదే ..హి మోహో మీకు బిడ్డ కూడా పుట్టబోతున్నాడుగా?

నా బిడ్డ . బిడ్డ కాదా?

ఎలా అవుతాడు? ఆ బిడ్డ మీ రక్తం పంచుకుని పుడుతున్నాడు గానీ నా రక్తం పంచుకుని పుట్టటం లేదుగా?

ఆ అదృష్టం నాకు లేదు

లేనిది నాకు

నేనేం మాట్లాడితే నువ్వేం అపార్థం చేసుకుంటావో అని నీ ముందు మాట్లాడటానికే బయంగా ఉంది నాకు

నేనడిగిందానికి సమాదానం చెప్పండి?

ఏమిటి స్వప్నా?

అదే మీ బార్యనూ, మీ బిడ్డనూ ఆ ఇంట్లోనే, ఉంచాలనుకుంటున్నారా?

వాళ్ళు నీకు దూరంగా ఉండటమే మంచిది

ఎందుకని, నా నీడకూడా మీ బిడ్డమీద పడకూడదా ?

అందుకే స్వప్నా! నువ్విలా బాదపడతావనే నీ ముందు నోరు తెరవటానికూడా బయంగా ఉంది నాకు నేనూహించేది ఒకటయితే నువ్వాలోచించేదొకటవుతుంది పరాయి ఆడదాని నీడ నా మీద పడితేనే సహించలేని నువ్వు నాతో కాపురం చేసిన ఆడదాన్ని ఇంట్లో నీ కళ్ళముందు చూస్తూ బరించగలవా? ఇప్పటికే మానసికంగా కుమిలిపోతూ నువ్వు ఎటువంటి గుండె మంటను బరిస్తున్నావో నాకు తెల్సు ఇంకానిన్నెలా బాద పెట్టను?

నేను గొడ్రాలినికదా? మీ బిడ్డమీద నా నీడ సోకగూడదని అలా






అంటున్నారేమో అనుకున్నాను."

"నీ ఇష్టమొచ్చినట్టు ఆలోచించుకో. నా మాటమీద, నామీదా నీకు నమ్మకం పోయింది. నేనేం మాట్లాడినా, అది నీకు తప్పుగానే కనిపిస్తుంది" బాధగా అన్నాడు.

చాలాసేపు మవునంగా కూర్చుంది స్వప్న. ఆమెను చూస్తూ అతనూ అలాగే కూర్చున్నాడు.

"ఆమెనింటికి తీసుకురండి."

పక్కలో బాంబు పడినట్టుగా ఉలికిపడ్డాడు జయరాం. అతని పెదవులనుంచి "స్వప్నా" అన్న మాట స్పష్టంగా వెలువడింది.

"మీ రక్తం పంచుకుని పుట్టిన బిడ్డ, తండ్రి ఉండీ, తండ్రికి దూరంగా పెరగటం ఎందుకు? పెద్దయింతర్వాత అతన్ని, మీ తండ్రెవరని అడిగితే గర్వంగా చెప్పలేక సిగ్గుతో తలవంచుకునే స్థితికి తీసుకురావటం ఎందుకు? మీకు దూరంగా, సమాజంలో గౌరవం లేకుండా, ఆమె మాత్రం మీ ఉంపుడుగత్తెగా చెలామణి కావటం ఎందుకు?

ఆమె చేతుల్లో పెరిగే మీ బిడ్డకు మాత్రం గౌరవం ఉంటుందా? ఆలోచించండి? క్షణికమయిన ఆవేశం, జీవితమంతా ఆవేదనగా మారకూడదు. ఈ ఆస్తి ఐశ్వర్యం అన్నీ నా తర్వాత ఎలాగూ మీ బిడ్డకు చెందేవేగా? అవన్నీ నేను పోయింతర్వాత అనుభవించినా నేను చూడనుకదా? నేను బ్రతికుండగానే అనుభవించనియ్యండి. అదీగాక, మీకూ మనశ్శాంతి కరువవుతుంది. ఇక్కడున్నప్పుడు అక్కడి కెళ్ళాలన్న ఆలోచన అక్కడున్నప్పుడు ఇక్కడకు రావాలన్న ఆలోచనా ఇవన్నీ ఎందుకు చెప్పండి. ఆవిడను ఇక్కడకు తీసుకురండి" అంటూ లేచి లోపలి కెళ్ళిపోయింది స్వప్న.

ఆమె నడిచిన నేలకు పూజ చెయ్యాలనిపించింది జయరాంకు ఆమె మాటలు విన్న తర్వాత.

ఆమె ఆలోచనలకు, అతనికే ఆశ్చర్యమనిపించింది. ఆమె వ్యక్తిత్వం హిమాలయాలంత ఎత్తుకు ఎదిగినట్టు, ఆమె ఎదుట నిలబడటానిక్కూడా తనకు అర్హత లేనట్టు అనిపించింది. ఆమె పట్ల తను ప్రవర్తించిన తీరుకు పశ్చాత్తాపంతో అతని కళ్ళు వర్షించాయి.

* * * * * * *

స్వప్న చెప్పినా, మోహినిని ఇంటికి తీసుకు రావటానికి జయరాంకు ధైర్యం చాలలేదు.

మోహినికి నెలలు నిండాయి. ఎన్ని పనులున్నా రెండు రోజుల కొకసారి ఆమెను కారులో హాస్పటల్‌కు తీసుకెళ్ళి డాక్టరుకు చూపించి తీసుకొస్తున్నాడు.

రమణరావుగారి ఆరోగ్యం దెబ్బ తింది. ఆయన్ని కూడా హాస్పటల్‌లో చేర్పించాడు జయరాం.

వరలక్ష్మి భర్త దగ్గర హాస్పటల్‌లో ఉంటుంది. మోహిని చేసుకోలేదని వంట మనిషిని కూడా పెట్టాడు.

ఉదయాన్నే నడుములో నొప్పనిపించింది మోహినికి. జయరాంకు ఫోన్ చేసింది. అతనువెంటనే కారు తీసుకొచ్చి ఆమెను నర్సింగ్‌హోమ్‌కు తీసుకెళ్ళాడు.

పెయిన్స్ రావటం మొదలయ్యాయి. ఆమెను, లేబర్ రూములోకి తీసుకెళ్ళారు.

జయరాం వరండాలో ఉన్న ప్రేము కుర్చీలో కూర్చునున్నాడు. దాదాపు అయిదు గంటలనుంచి అలాగే కూర్చునున్నాడు. లేబర్ రూములో ఏం జరుగుతుందో తెలియదు. చాలా నర్వెస్‌గా ఉందతనికి. పైన సీలింగ్ ఫ్యాన్ తిరుగుతున్నా వళ్ళంతా స్వేదబిందువులతో తడిసిపోతుంది.

అది ప్రయివేట్ నర్సింగ్‌హోమ్. ఆ నర్సింగ్‌హోమ్ ధనవంతులకు తప్ప, మధ్య తరగతివాళ్ళకు అందుబాటులో ఉండదు. డాక్టరు జయప్రద సిటీలో మంచి పేరున్న డాక్టరు. అయినా జయరాంకు ఒకటే ఆందోళన. శిశువు పొజిషన్ ఎలా ఉందని అప్పటికి డాక్టరును వందసార్లయినా అడిగుంటాడు.

జయరాం, డాక్టర్‌కు బాగా తెల్సు. ఉదయంనుంచి, అతనడిగే ప్రశ్నలకు చిరునవ్వుతో సమాధానం చెబుతూ, పది నిముషాల కొకసారి, మోహినికి పల్స్ చూస్తుంది. బి.పి. చూస్తుంది.

జయరాం ఉదయంనుంచి, భార్యకోసం పుట్టబోయే బిడ్డకోసం పడుతున్న

# ప్రాచీన విజ్ఞాన సర్వస్వాలు



## ధర్మపథం

మన ప్రాచీన సాహితీ వేత్తలు వాఙ్మయాన్ని మూడు తెగలుగా విభజించారు కొన్ని ప్రభు సమానాలు కొన్ని మిత్ర సమానాలు కొన్ని కాంతా సమానాలు వీటిలో వేదశాస్త్రాలు ప్రభుసమానాలు ప్రభువువలె అవి "ఇలా చెయ్యాలి అలా చెయ్యాలి" అని ఆజ్ఞాపిస్తాయి అలా చెయ్యవలసిందే 'ఎందుకు అలా చెయ్యాలి?' అని ప్రశ్నించే అవకాశం లేదు పురాణేతిహాసాలు మిత్రసమానాలు అవి మిత్రుని వలె సున్నితంగా హితాహితాలను బోధిస్తాయి దుర్మార్గులు వారి దుష్ప్రవర్తన వల్ల ఎలా చెడిపోయారో, ఉత్తమ శీలం కలవారు ఎలా కీర్తి ప్రతిష్ఠలు పొందారో ఉదాహరిస్తూ మంచి మార్గానికి మళ్లిస్తాయి కావ్యాలు కాంతా సమానాలు అవి యువతి వలె తమ అభిప్రాయాలను మాటలతో కాక, చేతలలో నే చూపిస్తాయి. కావ్యాలు చదివి మంచి చెడ్డలను, మనం ఊహించుకోవలసినదే!

దీనిని బట్టి పురాణాలు, మానవులు ఎలాప్రవర్తించాలో, వేటికి దూరంగా ఉండాలో స్పష్టంగా తెలుపుతూ ఉంటాయని తెలుస్తున్నది పురాణాలలోని చాలా కథలు వాస్తవానికి చాలా దూరంగా ఉంటాయని, అందువల్ల వాటిపయి ప్రామాణిక బుద్ధి ఉండదనీ చాలామంది అభిప్రాయ పడతారు ఆ మాట కొంత వరకూ వాస్తవంగా తోచవచ్చు కాని పురాణాలలో కథలకు కాక, వాటి వల్ల తెలిసే నీతికే ప్రాధాన్యం ఉంటుంది కథాచ్ఛలేన బాలానాం నీతి స్తదిహ కథ్యతే అని ఎద్దల మాట ఉండనే ఉన్నది కథల సంగతి ఎలా ఉన్నా, అందరూ తెలుసుకోవలసిన సృష్టిక్రమం, పూర్వపు రాజుల చరిత్రలూ తెలుసుకోడానికిపురాణాలే మనకు ఆధారం భౌగోళిక విషయాలు వాటివల్లనే తెలుస్తాయి అగ్ని పురాణంలో అన్ని శాస్త్రాలూ సంగ్రహంగా తెలుపబడినవి మరణానంతరం జీవుని పరిస్థితి, పరలోకప్రయాణాదులు గరుడ పురాణంలో వివరంగాచెప్పబడినవి మానవుల జీవిత విధానం వాటి వల్లనే తెలుసుకొనుటకు సాధ్యమవుతుంది ఈ విధంగా అనేక విషయాలు మన అష్టాదశ పురాణాల వల్ల మనకు తెలుస్తాయి అందువల్ల పురాణాలు మన ప్రాచీనులు సమకూర్చిన విజ్ఞాన సర్వస్వాలని గ్రహించవలసియున్నది వాటిని తేలికగా త్రోసివేయరాదు

—బులుసు వేంకటరమణయ్య

## ప్రేమసాగరం

బాధ చూస్తుంటె అటువంటి భర్త చేతుల్లో మరణించటం కూడా జాల్కు అనుభూతిగా ఆనందంగానే ఉంటుందనిపించింది డాక్టర్ జయప్రదకు

సాయంత్రం నాలుగు గంటలయింది ఇంకా కాన్పు కాలేదు పెయిన్స్ వచ్చినప్పుడు గిలగిల్లాడిపోతుంది ఆ బాధ భరించలేక ఏడుస్తుంది

లేబరురూము తలుపులు తెరుచుకుని డాక్టరు జయప్రద బయటకు వచ్చింది ఆమె వంక ఆతృతగా చూసాడు జయరాం

ఆమెకు అనుకోని కాంప్లికేషన్స్ వచ్చాయి వెంటనే ఆపరేషన్ చెయ్యాలి అంది

కరెంటు షాక్ తిన్నట్టు కొయ్యబారిపోయాడు తేరుకుని ఆపరేషనా? అన్నాడు భయంగా

అవునన్నట్టుగా తలూపింది

తప్పనిసరిగా చెయ్యాలా?

మిష్టర్ జయరాం నేను డాక్టర్ని అవసరం లేకుండా ఆపరేషన్ ఎందుకు చేస్తాను? ఎందుకలా భయపడుతున్నారు? మి భార్యనూ మి బిడ్డనూ క్షేమంగా మి కప్పగించే బాధ్యత నాది

అతను నరాలన్నీ కూడదీసుకుని ధైర్యం తెచ్చుకున్నాడు

ఈ పుస్తకంలో సంతకం పెట్టండి అంది వణుకుతున్న వ్రేళ్ళతో ఆమె చెప్పినట్టు చేసాడు

మోహినికి ఆపరేషన్ చెయ్యటం పూర్తి అయ్యేసరికి నాలుగు గంటల టయిము పట్టింది

ఉదయంనుంచి ఒకేవిదమయిన టెన్షన్ఉన్న జయరాంకు ఇంకొక్క రోజు అదే టెన్షన్లో ఉంటే పిచ్చి పడుతుందేమో అనిపించింది డాక్టర్ అతనికి దగ్గరగావచ్చి తల్లీ బిడ్డా క్షేమంగా ఉన్నారు అంది

ఆమాట అతని మనస్సుకు అమృతసోనలా తాకింది

థాంక్యూ డాక్టర్ గుండెలమీదనుంచి వంద టన్నుల బరువును తొలగించినట్టుగా ఉంది అతనికి తను తండ్రి అయ్యానన్న సంతోషంతో ఆకాశానికి ఎగిసిపోతున్నట్టుగా అనిపించింది

ఈ ఆపరేషన్తో ఆమె రెండో సారి తల్లి అయే అవకాశాన్ని కోల్పోయింది సారి అంది బాధగా డాక్టరు

మా అదృష్టం అంతవరకే ఉంది మీరు మాత్రం ఏం చెయ్యగలరు? అన్నాడు వంశాంకురం పుట్టాడు తన వంశం నిలిచింది అంతే చాలు అనుకున్న అతనికి ఆ విషయం అంత బాధనిపించలేదు

పది నిముషాలలో ఆమెను స్పెషల్ రూములోకి తీసుకొస్తారు వెళ్ళి మి భార్యను బిడ్డనూ చూసుకోండి అంటూ చిరునవ్వుతో వార్డు వైపు వెళ్ళింది డాక్టర్ జయప్రద

(ఇంకా ఉంది)

శ్రీరస్తు - శ్రీ త్రిపురసుందరీ వరశివాభ్యాంనమః

త్వరలో వెలువడుతుంది

త్వరలో వెలువడుతుంది

# ఆంధ్రపత్రిక

## శ్రీ క్షయ నామ సంవత్సర పూర్ణశాస్త్రీయ పంచాంగము



'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,

'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణించబడినది.

ఆంధ్రపత్రికా కార్యాలయము — ప్రతి 1-కి రూ. 5-00

గాంధీనగరం, విజయవాడ - 3. — బషీర్‌బాగ్, హైదరాబాద్-29

# మాతృస్పర్శ

_ఆశ

బాల్య స్మృతులు అమూల్యమైనవి తల్లి జోకొడుతూ పాడిన పాటలు గంధర్వగానాలు గోరు ముద్దలు తినిపిస్తూ చెప్పిన కథలు చెరగని ముద్రలు తండ్రి మెడలెక్కి స్వారీ చేసిన క్షణాలు గర్వ కారణాలు తండ్రి మెచ్చి తెచ్చిన కానుకలు మదిలో పదిలాలు తల్లి గర్వాతిరేకంతో మురిసి కురిపించిన ముద్దుల వర్షాలు పన్నీటి జల్లులు

బిడ్డలకు తల్లిదండ్రుల అండ కొండంత హామీ వారు చూపించే ప్రేమ వెల్లువ కాగా ఆ వెల్లువలో ధైర్యంగా సాగే చుక్కాని లేని కాగితం పడవలో ఎల్లలు ఒరిగిపోతే సరి చేస్తూ దరి జేరితే మధ్యకు నెడుతూ ఆట పాటలతో కొనసాగే బాలల జీవిత యానానికి సారధులు తల్లిదండ్రులు జీవిత శిఖరాల్ని అధిరోహించడానికి నిచ్చెనలు వేసి తొలి మెట్టు మలి మెట్టు ఎక్కడం నేర్పించే ప్రధమ గురువులు

అందుచే ఎన్నెన్నో స్మృతులు ఎంతెంతో మధురమైనవి ఐతే అందుకు నోచుకోని దురదృష్టవంతులు అనేక మంది

అట్టి దురదృష్టానికి లోనై పుట్టుకతోనే తల్లిని పోగొట్టుకున్న కోవకు చెందినవాడు- నారాయణ

నారాయణ తండ్రి ఆరు నెలలు తిరక్కుండా మళ్ళీ పెళ్ళి చేసుకున్నాడు ఆ వచ్చిన యిల్లాలితో నారాయణ మీద ఆప్యాయత వుండదు ఉండబోదని అతడికి ముందే తెల్సు తెలిసినా చేసుకున్నాడంటే అది అతడి అవసరం స్వార్ధం అనేస్తారుగాని ఆ మాట తప్పు ఐతే భర్త పోయిన స్త్రీ మళ్ళీ పెళ్లాడితే ఒప్పా? అని ఎవరడిగినా ప్రస్తుత సమాధానం తప్పేగాని బావిలో ఒప్పు అనక తప్పని రోజులు వస్తాయి ఇప్పుడిప్పుడే కొన్ని సందర్భాలలో కొందరు ఒప్పుగా అంగీకరిస్తూనే వున్నారు ఒకప్పుడు సతి సహగమనం ఒప్పు ఈనాడది తప్పు ఇది ఆ మాదిరే అలాగే సాంఘిక న్యాయ పరిధిలోకి రాక తప్పదు

కంటికి మెల్ల అందం కళ్ళు గుడ్డిదయినా మెల్ల మేల్లే గుడ్డిలో మెల్ల నారాయణకొక మేనమామ

మరుసటి తల్లి పోషణలో బిడ్డకి బ్రతుకు ఎగుడు బాటను నడవక తప్పదని గ్రహించి నారాయణని సానుభూతితో తానై తనింటికి తెచ్చుకున్నాడు

నారాయణ బ్రతుకులో అదొక మలుపు

శ్రీహరి భార్య అతడికి స్వయానా మేనమామ కూతురు నారాయణని ఆప్యాయంగా అందుకుంది

విశాల నేత్రాలూ అందమైనవే మెల్లకి తోడు వైశాల్యం మరింత అందం శ్యామల శ్రీహరికి స్వయానా మేనమామ కూతురే కావటం నారాయణకి దురదృష్టంతో పాటు దొరికిన అదృష్టం

అతడి బాల్యం ఎగుడు బాట నుండి మళ్ళీ ఆహ్లాదకరమైన దిగుడు బాట నుండి సాగకపోయినా సాఫీగా సాగటం అదృష్టమే మరి

శ్రీహరికి శ్యామలకు పిల్లలు తమకి వుండనే వున్నారు బాధ్యతగా నారాయణ బరువు నెత్తిన వేసుకున్నా తమ పిల్లలకు పంచి యిచ్చే ప్రేమలో నారాయణకి సమవాటా ఏనాడూ పంచి యివ్వలేకపోయారు అది సహజం అంటే యింతో ప్రేమ చూపేవారు అదీ నారాయణకి జరిగిన మేలు

తనకెంత మేలు జరిగింది ఆ పెరుగుతున్న పసి వాడైన నారాయణకి అవగాహన కాలేదు పసి మనసుకు వెలితి స్పష్టంగా గోచరించేది తేడా తేటతెల్లంగా కనిపించి బాధించేది మామయ్య తనకయితే మిఠాయి తేడు అడిగినా తేడు గౌరికైతే ఏడిస్తే చాలు పొట్లాం!

అత్తయ్య తనకైతే రవంత పెడుతుంది గౌరికైతే పొట్లం పొట్లాం!

యిలాటి తారతమ్యాలనేకం పసి మనసు వూహ శక్తిని పెంచాయి

నారాయణకి తన తల్లి ఎవరో తెలీదు కాని తనకి



ఓ తల్లి వుండేదనీ ఇప్పుడు లేదనీ తెల్సిపోయింది చచ్చిపోయిందనీ తన వద్దకెప్పుడూ రాదనీ తెల్సిపోయింది తండ్రి ఎప్పుడైనా వచ్చే వాడు కనుక తండ్రంటూ ఒకడున్నాడనీ ఎప్పుడైనా ఓసారి వస్తుంటాడనీ తెలుసు

వచ్చినపుడల్లా మిఠాయి తెచ్చేవాడు తండ్రి పొట్లాం పొట్లామే యిచ్చేవాడు తనకి కానీ తనకే కాదు గౌరికి, నాగుకి యింకా పెద్దవాళ్ళయిన రాముడికి రంగడికి కూడా తలో పొట్లం తెచ్చేవాడు

మామయ్య అలా తేడెందుకు?

నాన్నయినా అన్నీ తనకివ్వడెందుకు?'

ఎందుకో తెల్సేది కాదు నారాయణకి ఎంతయినా నాన్న మంచి అనిపించేది నాన్న కోసం ఆ పసి కళ్ళలో నిరీక్షణ వుండేది

నీతో వచ్చేస్తా నాన్నా! అనేవాడు తండ్రి వచ్చినపుడల్లా తండ్రి నిట్టూర్చి- ఇపుడొద్దులే బాబూ! ఈ మాటు వచ్చినపుడు తప్పక తీసుకెళ్తాగా అనేవాడు ఎప్పటికప్పుడు ఆ మాటలనేటపుడు ఎత్తుకుని ముద్దాడి బుజ్జగించేవాడు నాన్న కళ్ళల్లో నీళ్ళు చూసేవాడు నారాయణ

ఏడుస్తాడెందుకు? అనుకునేవాడు తన కళ్ళల్లోనూ నీళ్ళు తిరిగేవి ఎందుకో? ఏడుపుకాదది- ఏమిటో తెల్సేది కాదు అందుకే అది తెలియకే- ఏడుస్తావెందుకు? అని ఏనాడూ నాన్నని అడగలేక పోయేవాడు



నాగు మారాం చేయడం చూసేవాడు నారాయణ మారాం చేస్తే మామయ్య వాడడిగింది తెచ్చి యిచ్చేవాడు

–నాకూ ఒక బంతి మామయ్యా' అన్నాడు నారాయణ

వాడికి తెచ్చాగా' దాంతో నువ్వూ ఆడుకో అన్నాడు మామయ్య

ఊఁ ఊఁ నాకూ ఒకటితే మారాం చేశాడు నారాయణ– అలాగేగా నాగూ చేశాడు'

చీ నోర్ముయ్ వెదవాయ్' దాంతో నే ఆడుకోమని చెప్పడంలా? కసిరి పారేశాడు మామయ్య

ఉలిక్కి పడ్డాడు మామయ్య అది మామయ్య కోపమని తెలుసు అత్తయ్యని రాముణ్ణి రంగణ్ణి అలా కసిరినపుడు చాలాసార్లు చూశాడు

ఐతేనేం ధైర్యం తెచ్చుకున్నాడు నారాయణ

ఊఁ ఊఁ నా కొక బంతి కావాలీ దీర్ఘం తీశాడు

చెళ్ళు మంది చెంప

ఝల్లు మంది గుండె

చప్పున కళ్ళల్లోకి నీళ్ళొచ్చాయి

పోనిద్దురూ పసివాడు అంది అత్తయ్య ఎందుకందో యింకా కన్నీళ్ళొచ్చాయి– అత్తయ్య ఆ మాట అన్నాక ఏమనుకున్నాడో మామయ్య వచ్చి వూరుకోరా చెప్పిన మాట వినాలి మరి అని దగ్గర్కి తీసి తల నిమిరాడు అప్పుడైతే మరి పెద్దగా ఏడు పొచ్చేసింది ఎందుకో– తెలియలేదు మామయ్య నాన్న కాదుగా అని మాత్రం జ్ఞాపకం వచ్చింది

ఆ తర్వాత తండ్రి వచ్చినపుడు నేనూ నీతో వచ్చేస్తా అని మారాం చేశాడు నారాయణ మామూలుగా తండ్రి రాజయ్య ముందు వద్దన్నాడు ఊఁ ఊఁ వచ్చేస్తా మారం చేశాడు నారాయణ మామయ్యగాదుగా నాన్న అనే ధైర్యం కొట్టడు అనే నమ్మకం

కొట్టలేదు రాజయ్య మారాం చేయగా చేయగా సరే నన్నాడు సంబరపడిపోయాడు నారాయణ అక్కడ పిన్నితో అలాగుండాలి యిలా గుండాలి అని ఎన్నెన్నో చెబుతున్న తండ్రి మాటలు అసలు వాడి చెవినే పడలేదు

రాజయ్యతో పాటు వచ్చిన నారాయణని చూడగా రాజయ్యకి కనిపించకుండా మూతి విరిచింది కనకం మి ఎన్నిరా' అంటూ పరిచయం చేస్తున్న తండ్రితో నాన్నా' పిన్ని మూతి వంకరా?' అన్నాడు అమాయకంగా

కొంతానికి రావటాన్కి నవ్వొచ్చింది గాని, అంతర్యం గ్రహించిన రాజయ్య కళ్ళు జేవురించేసర్కి ఆమె కొచ్చిన నవ్వు అణగారిపోయి ఆరి బడవా' అని మనసులో క్రోదంగా మారిపోయింది

రాజయ్య అటు గడప దాటగానే బడవా' నా మూతి వంకరటరా? అంటూ నారాయణ బుగ్గలు పొడిచింది

నీ మూతి వంకరగా కనబడితేనూ బిక్కమొహమేశాడు నారాయణ బుగ్గలు

# మాతృస్పర్శ

నొప్పెట్టాయి మరి

నోర్ముయ్' దొంగ సచ్చినోడా' ఆ యిల్లు తుడువ్ – అంటూ చేతికి చీపురిచ్చింది

ఇల్లెపుడూ తుడవలేదు నారాయణ కానీ అత్తయ్య రోజూ తుడవటం చూస్తూనే వున్నాడు గదా! అందులో నేర్చుకోవాల్సిందేముంది?అందుకని రాదు అనకుండా యిల్లు తుడిచాడు

తరక తరకలుగా మిగిలిపోయిన తుక్కుని చూసి చిన్న గది తుడవడంకూడా రాదురా నీకు? అంది

ఎపుడూ తుడవలేదు పిన్నీ సంజాయిషీ చెప్పుకున్నట్లు చెప్పాడు

అంట్లు తోమడమొచ్చా'

రాదు పిన్నీ'

అల్లాగ్గా! తినడమొచ్చా? నొక్కి పలికింది కనకం వ్యంగ్యాన్నర్థం చేసుకునే వయసు కాదు నారాయణది

ఎందుకు రాదూ– వచ్చు' అనేశాడు

ఐతే తిందువు– తిందువులే వుంతు అంటూ ఓ మొట్టు మొట్టింది కనకం

పిన్ని ఎందుకలా మొట్టిందో తెలీలేదు నారాయణకి ఏడుపూ వచ్చింది దాంతో బయమూ వేసింది ఎందుకో? ఎడుపు అణుచుకుంటూంటే ఏడవకూడదబ్బాయ్' యిపుడేవన్నానని" ఏమైంది?మి నాన్నొచ్చాక లేనిపోని మాటలుగాని చెప్పావా చీపురు తిరగేస్తాను జాగర్త' అని హెచ్చరించింది

హడలి పోయాడు నారాయణ

కనకం ఒక్కొక్క చేష్ట ఆ హడలును పెంచింది

ఆ హడలు పెరిగి యింతై అంతై ఒకే ఒక్కమాటని పించింది నాన్న దగ్గర– నే మామయ్య దగ్గర కెళ్ళిపోతా అన్నాడు నారాయణ

మూడు రోజులకే వీడికి మొహం మొత్తిందన్నమాట అంతేలే' సవత్తల్లన్నాక అంతేమరి అనుకున్న రాజయ్య తిరిగి శ్రీహరికి అప్పగించాడు నారాయణని

ఎండలోంచి నీడలో కొచ్చినట్లనిపించింది నారాయణకి

నలుమూలలా సిరా పూసుకుని వచ్చిన కొర్దందుకుని ఏవండోయ్ అంటూ గావుకేక పెట్టింది శ్యామల శ్రీహరి కంటూ దగ్గరి వాళ్ళెవరూ లేరుగాని తన కిద్దరు చెల్లెళ్ళున్నారు

ఏవిఁటోయ్ ఆ ఖంగారు? అంటూ వచ్చిన శ్రీహరి ముక్తసరిగా మూడు ముక్కల్లో వ్రాసివున్న రాజయ్య మరణవార్త చదివి పాపం' రాజయ్య పోయాడట' అన్నాడు

రాజయ్య అయినవాడే అయినా, తాను బయపడ్డ దుర్వార్త గాదు శ్యామల మనసు కుదుట పడ్డది అక్కడే వున్న నారాయణని చూసి జాలిగా పాపం'నష్ట జాతకుడు అంటూ తల నిమిరింది

అంటే? అన్నాడు నారాయణ అమాయకంగా

మి నాన్న చచ్చిపోయాడురా' విశదీకరించాడు శ్రీహరి

పోయాడట అన్నపుడు అర్థం కాలేదు ఎనిమిదేళ్ళ నారాయణకి

చచ్చిపోయాడు అన్నాక తెల్సింది

నాన్న చచ్చిపోయాడా? అంటూ బావురుమన్నాడు

ఆ తర్వాత స్కూల్లో వేశారు నారాయణని

పగిలిన పలక, విరిగిన బలపం బరువనిపించలేదు మొదట శ్రీహరికి

వాచకం కొనమన్నారు మేష్టారు అని నారాయణ చెప్పినపుడు పాత దేదైనా దొరుకుతుందేమోనని యిల్లంతా వెదికాడు అటకమీద బోషాణంలోనూ వెదికాడు పంతులు కొట్టాడనీ పుస్తకం లేకపోతేబళ్ళోకి రావద్దన్నారనీ ఏడుస్తూ నారాయణ చెప్పినపుడు– చదువు ఖర్చుతో కూడినపని అని అర్థమైంది

ఏం చదువులో ఏం పాడో? అంటున్న శ్రీహరితో –

వాడికి చదు వెందుకు లెద్దురూ' అంది శ్యామల మరేం చేద్దాం'

వున్న నాలుగు గొడ్లనీ వీడు తోలుకు మేపుకు రాలేడా? మద్య పాలెగాడెందుకు? దండగ' అంది శ్యామల

శ్యామలా' అన్నాడు శ్రీహరి నొచ్చుకున్నాడు

శ్రీహరిని గమనించిన శ్యామల– అదిగాదండీ అని ప్రారంభించి వాక్యం పూర్తి చెయ్యకుండానే ఆగిపోయింది

గొర్రెతోక బెత్తెడు అన్నట్లు ఎదుగు బొదుగులేని సంసారం శ్రీహరిది మరో దురుద్దేశ్యంతో అనలేదు శ్యామల ఆ మాట ఆ విషయం అర్థం చేసుకున్న శ్రీహరి– అంతేలే– అంతే– అలాగే జేద్దాం' అనేశాడు

ఆ మాట లాలకిస్తూ అక్కడేవున్న నారాయణ నేను గొడ్లని మేపుకొస్తా మామయ్యా' అనేశాడు ఎందుకంటే ఎక్కడికి వెళ్ళినా ఒంటరివాడుగా అనుభూతి పొందేవాడు నారాయణ నలుగురు చుట్టూ వుండికూడా ఒంటరిగా మిగలడం మహాకష్టం మానవజాతిలో ఎదుటివాడిలో సమానతలు వెదకడం పైకి కనిపించని ఒక నైజం

నారాయణ బళ్ళో చేరినా తనలాంటి వాడు తన కింకొకడు తటస్థపడలేదు

నీకు అమ్ముందా? నాన్నున్నాడా? అని అందర్నీ అడిగేవాడు నారాయణ ఏ ఒక్కడైనా లేదు అనాలని నారాయణ కోరిక ఎందుకో ఆఁ' వున్నారు అన్న సమాదానమే వినేవాడు తను తనలాటి అనాద ఏ ఒక్కడూ లేనందున బళ్ళోనూ ఒంటరిగానే వుండేవాడు నారాయణ అంతేగాక మేష్టారు అందరిమీద ఒక రీతిగానూ తనమీద మరో రీతిగానూ చెలాయించడం నారాయణకి నచ్చేదిగాదు ఐన పనీ, కాని పనీ నారాయణకే చెప్పి మరి ముఖ్యంగా ఒరే నారి' కాస్త కాళ్ళొత్తరా'

అన్నప్పుడు మాత్రం చిన్నతనం అంటే ఏమిటో సరిగా తెలియకపోయినా చిన్నబోయేవాడు నారాయణ అందుచేత ఒంటరివాడు నలుగురి మద్యా వుండి ఒంటరిగా మిగిలేకంటే ఒంటరిగా ప్రకృతిలో మిగిలిపోవటం మేలనుకున్నాడో ఏమో- పశువుల్ని కాసుకురావడాన్కి మామయ్య అడగక ముందే ఒప్పేసుకున్నాడు ఎంచక్కా చెట్లూ చేమలతో ఆడుకోవచ్చు అనుకున్నాడో ఏమో!

తనకున్న నాలుగు పశువులో కొత్త గనుక నానా తంటాలూ పడుతూంటే పాతిక పైచిలుకు పశువుల్ని కూడా పళ్ళేసి పెట్టింది- తనకంటే ఓ చిన్నఎల్ల

కొత్త అబ్బాయా ? అంటూ

ఊఁ!

నీకు అమ్మా అయ్యా లేరా?

లేరు!

నాకూ లేరు అదేదో సంతోష వార్తలా కనులు పెద్దవి చేసి చెప్పింది

నిజం! సంతోషవార్త విన్నట్టే అడిగాడు నారాయణ

నిజం నొక్కి చెప్పిందా ఎల్ల

నీ పేరు?

లచిమి నీదో?

నారాయణ

ఈ నాలుగ్గొడ్లేనా?

ఊఁ

ఒకింటివా రెండిళ్ళవా?

మా మామయ్యవి!

సొంత మామయ్యవా?

ఆఁ

ఏవిత్తాడూ?

ఏవిఁస్తాడేంటి?

డబ్బులివ్వడా?

ఊహూఁ

బువ్వయినా పెడతాడా?

ఆఁ!

కడుపు నిండా పెడతాడా?

ఆఁ!

ఎట్టెట్టా? అని ఆశ్చర్యపోయింది లక్ష్మి- నాలుగిళ్ళ వాళ్ళూ నాలు గింతలు పెట్టినా ఎన్నడూ కడుపు నిండని లక్ష్మి

స్వంత మామయ్య లక్షిమి! అని మొదలు పెట్టి తన కథంతా చెప్పుకున్నాడు నారాయణ

తన కథా మొదలుపెట్టి టూకిగా చెప్పుకుంది లక్ష్మి

అమ్మెవరో అయ్యెవరో, అసలెలా గుంటరో నాకు తెలీనే తెలీ దబ్బయా! నువ్వేనయం నీ బాబుని సూడనైనా సూశావు ఎవురో ముసలమ్మ నన్ను పెంచిందట ఆ ముసిలిది గుర్తు నేదు నాకు

ఎవురో చెప్పడం అలాగని ఆ ముసల్దానికి నేను చెత్త డబ్బాలో దొరికానంట ఆ ముసిల్ది సచ్చేనాటికి నాకు నాలుగు మాటలొస్తన్నాయంట దయతలసి ఆయమ్మింత ఈయమ్మింత కూడెడితే దానిమీద బతుక్కొచ్చానంట

నాకు గేపకమున్నగాడికి ఆ యింటా ఈ యింటా అడుక్కుతినడమే గేపకం ఒక రోజేమో సాయిత్రమ్మగోరు కేకేసి ఒసే లచ్చిమి! యిట్టా అడుక్కోపోతే నాకు నాలుగ్గొడ్లున్నాయి మల్లేసుకు రాలేవంటే! ఇంత కూడిస్తా అనింది

మల్లేసు కొత్తా తల్లీ! అన్నా అంతే ఆ ఎనకనే ఎంటింటనే సుభద్రమ్మగోరు మాలచ్చవమ్మగోరు కూడా ఆల్ల గొడ్లని మల్లేసుకురమ్మని ఆల్లూ యింత కూడేత్తా వన్నారు ఆ రోజునుంచి ఆ నాలుగిళ్ళలో మిగులూ, తగులూ యింత పెడితే అది తిని పాతా సాతా యిస్తూంటే కట్టుకుంటున్నా!

అయితే పప్పేసి చారేసి అన్నం పెట్టరా?

మి అత్తయ్య అలా పెడతదా?

ఆఁ! నెయ్యికూడా అప్పుడప్పుడేస్తది తెలుసా!

అబ్బా!

ఆలోచనలో పడ్డాడు నారాయణ

మానవుడు మానవుని అసహాయతను ఎందుకుంటాడు అని నారాయణ కేం తెల్సు పాలికాపుకి ప్రత్యేకించి పది రూపాయలు జీతమిచ్చేకంటే దిక్కులేని లక్ష్మి కింత మిగులూ తగులూ పడేసి, పాతాసాతా యిస్తే పుణ్యానికి పుణ్యమూ దక్కుతుంది లాబానికి లాబమూ వుంటుందనుకునే సావిత్రమ్మల్లాంటి వారుంటారని నారాయణకేగాదు లక్ష్మికి మాత్రం ఏం తెలుసు?

ఆరోజంతా ఎన్నెన్నో కబుర్లు చెప్పుకున్నారు నారాయణ లక్ష్మి ఏవిటో గాని యిద్దరికీ సంతోషంగా గడిచింది కాలం

రేపు కూడా యిటే పేరా అబ్బాయా అని ఏడిపోయేటపుడు కోరి యిటు కోసే రావాలి తెల్సిందా? అని రెట్టించింది కూడా లక్ష్మి

అలాగే హామి యిస్తున్నట్టు చెప్పాడు నారాయణ

నారాయణది పట్నాన్నానుకుని వున్న పల్లెతే లక్ష్మిది పట్నం రాను బోను ఆరుమైళ్ళైనా వుంటుంది తిప్పట నారాయణ కంత బాదలేదు

పట్నమొచ్చెయ్య కూడదా అబ్బాయా! అక్కడ నలాంటోళ్ళకి ఏ పని చేసి పెట్టినా డబ్బులిత్తారు అన్నదొకసారి లక్ష్మి వివరాలడిగితే కొన్ని చెప్పింది బిందెడు నీళ్ళు మోసి పెడితే పావలా యిస్తారన యింటిచాకిరి చేసి పెడితే `డబ్బులిత్తారనీ తనకయితే అన్ని తెలియవుగాని పట్న మొస్తే అన్ని నీకే తెలుస్తాయనీ చెప్పింది దాంతో నారాయణకి పట్నమెళ్ళి తనూ సంపాదించుకోవాలనే కోరిక కలిగింది మామయ్య ఒప్పుకుంటాడా? ఒప్పుకోడని అనుమానం- మరైతే ఎలాగ?

ఎలాగని మంతనాలాడాడు లక్ష్మితో

నాకో ఉపాయం తట్టిందబ్బాయా?

ఏంటది?

పొద్దుటేలే యింత తినొత్తావుగా? రాంగానే నీ గొడ్లన్నీ నా గొడ్లల్లో కలిపెయ్ నేం జూసుకుంట ఒక్కురుకున పట్నెల్లు ఎంతసేపు? అరగంట పట్న వెరుగుదునన్నావుగా! నాలు గదులూ తిరుగు నీ బోటి పిలగాళ్ళు రకరకాల పన్లు సేతూ అగపిత్తరు అలాంటోళ్ళని ఎవుర్నొ ఒకర్నడుగు - పని సూపెట్టమని ఆల్లే సూపిత్తారు నీ అదృష్టం మరి పెందరాళే వొచ్చెయ్- లేపోతే నీ గొడ్లు! అని నవ్వింది న్నాల్రోజులు తిరిగావంటే ఎదో ఒకటి దొరుకుద్ది అని ముగించింది

బలే, లక్షిమి బలే! నీ మాట పెకారం దొరకాలే గాని మనిద్దరం కలుసుందాం అనేశాడు నారాయణ ఆ మాటల్లో నిజమైన కోరికుంది లోతులేదు

మరినా గొడ్లో!

ఇంకా ఈ గొడ్లెందుకు? నేను తెచ్చి పడేత్తే నువు వండి పడేత్తావ్!

మొగుడూ పెళ్ళాలాట ఆడుకుందామా! అమాయకంగా అడిగింది లక్ష్మి ఆ ఆట అనేక మంది ఎల్లలు ఆడు కోగా చూసి తనూ ఆడాలని ఎంతగా ఉబలాట పడినా తన నెవ్వరూ జేరనిచ్చేవారు గాదు

ఆఁ- అదేననుకో అనేశాడు నారాయణ- అంత



# మాతృస్పర్శ

అమాయకంగానూ

* * *

దేవకమ్మ వితంతువు

భర్త వదిలి వెళ్ళిన వ్యాపారాన్నే తాను చేపట్టింది అదొక చిన్న హోటలు భర్త రీతిగా కాక ఉదారంగానూ గాక సజావుగా సిబ్బంది జీతాల్ని పెంచింది శుచికి రుచికి ప్రాదాన్యత నిచ్చింది దాంతో ఆ హోటలుకి మంచి పేరొచ్చింది అదిగాక కౌంటరు మీద దేవకమ్మ ఓ ఎట్రాక్షను!

దేవకమ్మకి ఒక్కతే కూతురు – ఐదేళ్ళ మాదవి

దేవకమ్మకి అనాద పిల్లంటే జాలెక్కువ అంచేత హోటలు తన ఆద్వర్యంలోకి రాగానే ఖాళీ ఏర్పడ్డప్పుడల్లా అనాదుల్ని వెదికి ఆఖాళీని భర్తీ చేస్తూ వచ్చింది ఏ అనాధైనా వచ్చి పనికోసం యాచిస్తే ఖాళీవుంటే వెంటనే పన్లోకి తీసుకునేది లేకుంటే వాడి కెంతో కొంత యిచ్చి వేళను బట్టి యింత టిఫినో బోజనమో పెట్టి మరొకసారి రమ్మనీ ఖాళీవుంటే తప్పక యిస్తానని చెప్పి సాదరంగా పంపేది

ఏముహూర్తాన బయల్దేరాడో గాని నారాయణ ఆరోజే దేవకమ్మను కలవడం జరిగింది వెళా విశేషమేమిటో గాని ఆరోజు ఓ క్లీనర్ పని ఖాళీగా వుంది నారాయణ పంట పండింది కాపి, టిఫినూ రెండు పూటలా తిండి పెట్టి పది రూపాయలు దాకా యిస్తాననే సరికి పొంగిపోయాడు నారాయణ

లక్ష్మి కూడా పొంగిపోయింది– ఆ మాట వినగానే

మామయ్యతో ఈ మాట చెప్పగానే సరేనన్నాడు ఆపది పదిలంగా తెచ్చి నాకివ్వాలి అని కూడా అన్నాడు సరే అనక తప్పిందిగాదు నారాయణక

మరి తాను లక్ష్మికి యిచ్చిన మాటో!

న మాటకెలాగని నారాయణ బాద పడ్తుంటే– నామాట కేం లెద్దూ! ముందు నీకు దారిదొరికిందంతే చాలు నా గొడ్లు నాకున్నాయిగా! అంది

నారాయణక లక్ష్మిమిద ఎంతో సానుభూతి ఏరిగింది దినమంతా శ్రమపడి చివరికి ఎంగిలాకులు తినడం దుర్దశ అనే బాద ఆ ఎసవాడిలో కలిగింది

శ్రద్ధగానూ నమ్రతగానూ పనిచేసి అనతికాలంలోనే యిష్టుడయ్యాడు దేవకమ్మకి నారాయణ ఒకనాడు సాహసించి ఆమె వద్ద బయట పడ్డాడు అమ్మగారూ! మా లక్ష్మిక ఏధైనా పనియివ్వరా? అని అర్ధించాడు

అతడి కదంతా వినివున్న దేవకమ్మకి ఆ లక్ష్మి ఎవరో అర్ధంకాలేదు

ఎవర్రా ఆ లక్ష్మి!

చెప్పకు పోయాడు నారాయణ

వింటున్న దేవకమ్మ కళ్ళల్లో తిరిగిన నీళ్ళని నారాయణ గమనించనే లేదు కదంతా విన్నాక లక్ష్మని చూడాలన్న తపన ఆమెలో కలిగించని వాడిక తెలియదు కథ ముగించి–

అమ్మగోరూ! అని ఆగాడు అర్ధోక్తిగా

వెంటనే వెళ్ళి లక్ష్మని తీసుకురా నారాయణా! అంది

ఈ ఏళప్పుడు ఎక్కడో గొడ్లకాడుంటుందమ్మగోరూ! రాత్రిక గాని తిసుకురాలేను

అలాగే రాత్రికే ఈ రాత్రికే తీసుకురావాలిసుమా! తప్పదన్నట్లు చెప్పింది దేవకమ్మ

* * *

జీవి దొరవయసులో దేనినో కోరుతుంది కోరడమే గాదు కోరిన దానిని పొందడానికే వురకలు వేస్తుంది

మానవులందుకు అతీతులు కారు

కృత్రిమ సాంఘిక జీవనంలో బిడ్డలకు కోరికలు వెర్రి తలలు వేయరాదని చెప్పినా తప్పటడుగు వేస్తారనే బయంతో సకాలంలోనే పెళ్ళి చెయడానికే పూనుకుంటారేగాని– పెళ్ళవగానే సవాలక్షా సమస్యలు కులం గోత్రం ఆస్థ అంతస్తు– ఇలా ఎన్నెన్నో!

పెళ్ళి చేసుకునేది ఎల్లలయితే – చెయించేది పెద్దలు!

ఎల్లల్లో వుండే తహతహ పెద్దలు పసగట్టలేరు నాబిడ్డ బుద్ధిమంతుడు లేక బుద్ధి మంతురాలు అని ధైర్యంతో అవీ యివి బేరిజు వేస చూడడంలో కాలయాపన చేస్తారు అనవసర తాత్సారం చేస్తారు

వాస్తవానిక దెవకమ్మ తండ్రిక అలా తాత్సారం చెయ్యాల్సిన అవసరం లేదు ఒక్కగానొక్క బిడ్డ కావాల్సినంత ఆస్థ

ఏవేవో వెదుకుతూ మోతాదుని మించిన తాత్సారం చేశాడాయన ఆ లోగా జరగరానిది జరిగిపోయింది ఆ తప్పు దిద్దుకోడాన్కి మూడే మూడు మార్గాలు అందుకు కారకుడైన వాడు సై అంటే వాడితో ముడిపెట్టడం మొదటి మార్గం కాని నూటికి తొంభై తొమ్మిది మంది సై అనరు ఒక వేళ అన్నా మరో కారణమేదో అడ్డు తగుల్తుంది కులమో అంతస్తో! రెండోది భ్రూణ హత్య యిది మహా పాపమనే బయమే గాక అందుకు తొడ్పడే వారు బహు తక్కువ తోడ్పడ్డా పెద్ద ప్రాణిక అపాయం కలగవచ్చు మూడో మార్గం గుట్టు చప్పుడు కాకండా కని పారెయ్యటం

పెద్దప్రాణి ఆత్మహత్య చేసుకునే సందర్భాలనేకం అలాంటి సందర్భంలో సమస్యే లేదు చేసుకోనప్పుడే వచ్చే చిక్కల్లా

దేవకమ్మ అందుకు సాహసించలేదు కలిగిన వారి బిడ్డ కావటాన తిట్టినా కొట్టినా చివరిక బిడ్డను కడుపులో పెట్టుకున్నారామె తల్లిదండ్రులు కన్నబిడ్డను మాత్రం పారేయమన్నారు– తప్పదన్నారు– పారేసింది దేవకమ్మ– ఆడ బిడ్డను కని అది కడుపులో నిత్యాగ్ని మవుతుందని ఆక్షణాన అంతగా గుర్తించలేదు

శోకాల్లోకెల్లా విశిష్టమైన శోకం గర్భశోకం ఆరని చిచ్చు కట్టెను పారేయడానికే విలవిల్లాడే తల్లి –



చిత్రంలో (కుడి నుంచి) శ్రీ ఎ కె ఎస్ రావు, శ్రీమతి జయసుధ, శ్రీ ఎల్ ఎం కోట, శ్రీ శర్మ

## కొత్త ఫార్ములాతో గోద్రెజ్ వారి "బెస్టో"

ప్రముఖ సినీనటి శ్రీమతి జయసుద సోమవారంనాడు గోద్రెజ్ కంపెనీ వారి 'బెస్టో నీలి డిటర్జెంట్ పౌడరును మార్కెట్‌లోకి విడుదల చేశారు

తొలుత గోద్రెజ్ కంపెనీ దక్షిణప్రాంతపు సేల్స్‌మేనేజరు శ్రీ ఎ కె ఎస్ రావు బెస్టో పౌడరు వైశిష్ట్యాన్ని వివరిస్తూ - పూర్తిగా కొత్త ఫార్ములాతో తయారు చేసిన ఈ పౌడరులో అపాయకరమైన రసాయనాలేవీ వాడలేదు కాబట్టి చేతులు మండడం మొరటు తేలడం నానబెడితే బట్టలు చెడిపోవడం వంటి సమస్యలు లేకపోగా - దరలు ఆకాశాన్నంటుతున్న ఈ రోజుల్లో అతితక్కువ దరకు - అంటే కిలో గ్రాము ఒక్కింటికి రూ 8 25 కే (పన్నులతో సహా) ఈ పౌడరును విక్రయిస్తున్నట్లు తెలిపారు

కార్యక్రమానికి అద్యక్షత వహించిన ప్రముఖ తెలుగు రచయిత్రి డాక్టర్ సి ఆనందారామం తన ప్రసంగంలో - మన్నికకు మారు పేరు గోద్రెజ్ అనీ - కాబట్టి గోద్రెజ్ వారి ఏ ఉత్పత్తినైనా కొనడానికి వెనుకాడవలసిన పని లేదనీ అన్నారు

శ్రీ ఎల్ ఎమ్ కోట సేల్స్‌సూపర్‌వైజరు గోద్రెజ్ తరపున వందన సమర్పణ గావించారు

కార్యక్రమం చివరలో ఏర్పాటు చేసిన ఏమిక్రీలో ధ్వన్యనుకరణ సామ్రాట్ శ్రీ నేరెళ్ళ వేణుమాదవ్ సుమారు అరగంట సేపు వివిద నాయకుల సినీనటుల గాయకుల స్వరాలను అనుకరించి శ్రోతలను నవ్వుల్లో ముంచెత్తారు □

## మాతృ స్పర్శ

ప్రాణంతో వున్న బిడ్డని పురిట్లోనే పారేయాలంటే అది బయంకరానుబవం అనుబవించిన వారే గాని యితరులు వూహించలేని అనుబవం అంతటి శోకాన్ని బ్రతుకు మీది తీపితో దిగమింగి ఎలాగో బిడ్డను చెత్తడబ్బాలో వుంచగలిగింది దేవకమ్మ ఆమె చేతులు ఒణికాయి ఆక్షణాన్న దు ఖాన్ని దిగమింగిందే గాని అది నిత్యం కడుపులో మండే మంటనీ దాన్నెవరూ చల్లార్చలేరనీ తానై ఎంత ప్రయత్నించినా చల్లారదనీ గ్రహించలేక పోయింది తర్వాత పడిన బాద తనకే తెలుసు

పాపిష్టి చెతులతో నిష్కపటి యైన చేతులతో పసిపాపను కడపటి సారిగా కటిక చీకటిలో కళ్ళకానించి చూసుకుని తృప్తితీరా తడివి చూసుకుని హృదయానికి హత్తుకుని ముద్దులు కురిఎంచి వణుకుతున్న చేతులతో విడవలేక పాపను కుండీలో దిగవిడచిన క్షణాన తాను చేస్తున్నది హత్యను మించిన పాపమనిపించింది ఉరితీసేవాడు ఎలా నిర్వికారంగా ఉరితీస్తాడో అంత నిర్వికారంగా ఉరితీయలేక పోయింది చట్టం విదించిన శిక్షను అమలు జరిపేవాడికి తన పాపానికి వేరొకరిని శిక్షించడానికి తేడావుంది ఉరిశిక్ష అమలు జరిపేవాడు హత్య చేసినట్లుగాదు కన్నబిడ్డను ప్రాణాలతో పారవేయడం నేరమని ఏ చట్టాల్లోనూ వ్రాయబడి లేదు

లాంచన ప్రాయంగా ఒక ప్రాణిని ఉరితీయబోయే ముందు దోషమంట కుండా వుండాలని ఆ చోట ప్రార్ధనలు జరుపుతారు ప్రభుత్వం వారు కూడా

దేవకమ్మ కూడా ప్రార్ధించింది పాపను వదిలేస్తూ - బగవంతుడా! సంమ కట్టు బాట్లను అదికమించింది నేనైతే నాకు పడాల్సిన శిక్షను తప్పించుకోటానికి ఈ బిడ్డకు శిక్ష విదిస్తున్నాను మొదట నన్ను క్షమించు ఈ బిడ్డను నీచేతిలో పెట్టానన్న నమ్మకంతో వెనుదిరుగుతున్నాను ఈ బిడ్డను రక్షించి తల్లివీ తండ్రివీ నీవైనన్ను రక్షించు! నీదయ తండ్రీ! నీదయ అంటూ దు ఖం పెల్లుబకుండా కొంగు నోట్లో కుక్కుకుని మనసులో నే ప్రార్ధించి తన బాద్యత తీర్చుకుంది

బర్త శశికాంత్ చనిపోగానే దేవకమ్మలో కొత్త ఆశ తలెత్తింది ఎనిమిదేళ్ళుగా కడుపులో దావాగ్ని దాచుకో గల్గింది గాని యిపుడది లావాగా సుళ్ళు తిరుగుతోంది ఇపుడు తాను స్వతంత్రురాలు అన్నగలది తన బిడ్డ ఎక్కడున్నా వెదికి తెచ్చుకుని ఏదో వంకన తన వద్దనే వుంచి పెంచుకుంటే ఇపుడు ఆక్షేపించే వారు ఎవరూ వుండరు ఎవరి బిడ్డ? ఏమిటి సంగతి? అని ఒక వేళ ఎవరైనా అడిగినా ఏదో సమాదానం యివ్వొచ్చు

గానీ ఎక్కడుంది తన బిడ్డ? ఎక్కడున్నట్లు? ఎక్కడని వెదకాలి? ఏ స్థితిలో వుందో?

తన బిడ్డని పోల్చుకోడానికి ప్రతి తల్లీ ఒక ఆనవాలు పెట్టుకుంటుంది ఏనాటి కైనా తన బిడ్డను తిరిగి కలుస్తానేమో, లేక ఆ భగవాన్ కలుపుతాడేమో అనే ఆశతోనే తన బిడ్డ వీపు మీద కుడి భుజం క్రిందుగా వున్న పుట్టుమచ్చను పదిలంగా మనసులో గుర్తుంచుకుంది దేవకమ్మ. బిడ్డకై అన్వేషిస్తూ వెనక్కి నడిచింది. క్షణక్షణానికి మారిపోతున్న ఈ ప్రపంచంలో ఆ నాడక్కడ వున్న కుండీ ఈ నాడక్కడ లేకపోవడంలో ఆశ్చర్యం లేదు.

ఒకప్పటి కాలవ ఒడ్డు ఇపుడు పార్కుగా రూపొందడంలోనూ ఆశ్చర్యం లేదు. నిరాశ ఎదురైంది దేవకమ్మకి అనాదలను ఆ దరించడంలో ఆమె ఆంతర్యం -ఏనాటికైనా అదృష్టముంటే తద్వారా తన బిడ్డ తనకు నేరుగా దొరకవచ్చు లేదా తన బిడ్డ ఆచూకేమైనా దొరకవచ్చు ననే ఆశ

తన ఆశ పక్వానికొచ్చిందో ఏమో నారాయణ చెప్పిన వివరాల్లో చెత్తకుండీలో దొరికిన పిల్ల లక్ష్మి అన్న మాట వినగానే, అనుమానం లేదు లక్ష్మి తన బిడ్డే అయ్యుంటుందని ఆక్షణాన్నే నమ్మింది దప్పిగొన్న వాడు ఎండమావిని చూసి భ్రమించినట్లు భ్రమించింది ఎందరో తన స్థితిలో చెత్తకుండీల నాశ్రయిస్తారని తెలియక కాదు తెల్సినా తన కూతురేనా లక్ష్మి ఆ పుట్టుమచ్చ చాలు రుజావుకి అని బావించింది

రాత్రి తొమ్మిది గంటలపుడు దీప కాంతిలో చింపిరి తలతో చిరిగిన దుస్తుల్లో తన ఎదుట నిలచిన లక్ష్మిని చూసి తృళ్ళిపడింది దేవకమ్మ బగవాన్ అంటూ ఒకంత తడవు మూసిన కళ్ళు తెరవలేదు

అంత చింకిగావున్నా లక్ష్మిలో సుస్పష్టంగా మాదవి పోలికలు ' విషయాన్ని వెంటనే గ్రహించేసిన దేవకమ్మ పరిస్థితి తలక్రిందులైనందుకు తట్టుకో లేక కళ్ళు మూసుకుంది అనుమానం లేదు - లక్ష్మి శశికాంత్ కూతురే

ముమ్మూర్తులా తండ్రిని బోలిన కూతురు మాదవి ముమ్మూర్తులా ఆ మాదవినే పోలివున్న ఈ లక్ష్మి? అనుమానం లేదు శశికాంత్ కూతురే- అంటే! అంటే ఎవరో అబాగ్యురాలిని శశికాంత్ వంచించాడన్న మాట!

బడబాగ్నిని స్త్రీ గర్భానికే అంకితమిచ్చి పురుష బుజాలికే బాదనూ లేకుండా ఎందుకు చేశావు తండ్రీ! అంది బగవంతుడ్ని ఉద్దేశించి దేవకమ్మ

అమ్మగారూ లచ్చిమి! అంటున్నాడు నారాయణ

తన బిడ్డ ఈ బిడ్డ?

ఈ బిడ్డ తన బిడ్డ?

ఏదో ధ్వని పెద్దదై మార్మోగుతోంది

ఎక్ష్మి! అంటూ ఆ బిడ్డను తన బిడ్డగా తన హృదయానికి హత్తుకుంది దేవకమ్మ

హత్తుకుంటూ ప్రశ్నించింది-

ఇన్నాళ్ళుగా ఈ ప్రార్ధన నీ చెవులకు సోక లేదుటయ్యా? అని

తానే దానికి సమాదానం చెప్పుకుంది ఔనుగదూ! నీవు దేవుడివి నీవూ పురుషుడివే గదూ! అని లక్ష్మికి మాతృస్పర్శ కొత్తగా వుంది □

## రిపబ్లిక్ దినోత్సవం -

జంటనగరాలలో రిపబ్లిక్ దినోత్సవం వైభవోపేతంగా జరిగింది గవర్నర్ శ్రీమతి కుముద్ బెన్ జోషి సికందరాబాద్ పెరేడ్ మైదానంలో సైనిక వందన స్వీకారం తర్వాత రాష్ట్ర ప్రజలకు సందేశమిస్తూ కులమత ప్రాంతాల పేరుతో దేశాన్ని విచ్ఛిన్నం చేయ తలపెట్టిన దుష్ట శక్తుల ఎడల జాగరూకతతో ప్రవర్తించాలని హెచ్చరించారు ప్రజలు జాతీయ సమైక్యాన్ని దేశ సమగ్రతను రక్షించడానికి నిరంతరం సమాయత్తులై ఉండాలని కోరారు స్వాతంత్ర్యానంతరం దేశం రాష్ట్రం ఎంతో ముందంజ వేశాయని రాష్ట్రప్రభుత్వం అన్ని రంగాలలోను ప్రగతి సాధిస్తున్నదని అనావృష్టి సమస్యను పరిష్కరించడానికి శాయశక్తులా కృషి చేస్తున్నదని ఆమె అన్నారు ముఖ్యమంత్రి శ్రీ ఎన్ టి రామారావు పెరేడ్ మైదానానికి గవర్నర్ రాగానే స్వాగతం చెప్పి సీనియర్ రక్షణ శాఖాధికారులను రాష్ట్ర ప్రభుత్వాధికారులను పరిచయం చేశారు

## దేవరస్ ఉద్బోధ -

రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ సర్ సంఘ్ చాలక్ శ్రీ బాలాసాహెబ్ దేవరస్ జనవరి 25 న నిజాం కళాశాల మైదానంలో జరిగిన సంఘ్ విన్యాస సందర్భంలో ప్రసంగిస్తూ హిందువులు తమ ఆదిక్యాన్ని గట్టిపరచుకొనడానికి సమైక్యంతో ప్రవర్తించాలని కోరారు ఈ విన్యాసాలు ఆర్ ఎస్ ఎస్ అరవై సంవత్సరాలుగా చేసిన సేవను పురస్కరించుకొని జరిగాయి దేశంలో హిందువుల సంఖ్య అత్యధికం కాబట్టి దేశాన్ని హిందూ రాజ్యంగా ప్రకటించడం సముచితమని కేంద్రప్రభుత్వం ఈ విషయంలో వెనుకాడరాదని ఆయన అన్నారు దేశ రాజ్యాంగంలో హిందూ ధర్మశాస్త్రం ప్రధాన భాగమైనప్పుడు దేశాన్ని హిందూ రాజ్యంగా ఎందుకు ప్రకటించరాదని ఆయన ప్రశ్నించారు హిందూ అనే పదం అత్యంత గౌరవ వాచకమని నిర్దిష్ట జాతిని పేర్కొంటున్నదని ఆయన వివరించారు మతాతీతత్వ మనేది హిందువుల రక్తంలోనే వుందని కాని ఆ పదాన్ని (సెక్యులరిజంను) వక్రీకరిస్తున్నారని ముస్లిం దేశాలలో ముస్లిమేతరులను నిర్బంధంగా ముస్లిం సంప్రదాయాలను అనుసరించేటట్లు చేస్తున్నారని ఆయన అన్నారు కేంద్ర ప్రభుత్వం అల్పసంఖ్యాకులకు తలకు మించిన విశేషాధికారాలు ఇస్తున్నదని ఆయన విమర్శించారు రామకృష్ణ మఠం అధ్యక్షుడు స్వామి రంగనాథానంద ప్రసంగిస్తూ యువకులు సంఘంలోని అస్పృశ్యత కుల భేదం వంటి అసమానత్వాలను రూపుమాపి నవభారత్ నిర్మాణానికి నడుం కట్టాలని ఉద్బోధించారు నవయువకులు దేశాన్ని మత సంస్కృతుల మేలు కలయికగా తీర్చిదిద్దాలని ఆయన కోరారు ప్రారంభంలో ప్రాంతీయ కార్యనిర్వాహకులు శ్రీ ఎం మల్లిరెడ్డి స్వాగతం చెప్పారు

# హైదరాబాద్ నోట్‌బుక్

## వ్యోమగాములకు పులావు –

స్పేస్ కమిషన్ అధ్యక్షుడు ప్రొఫెసర్ యు ఆర్ రావ్ జనవరి 24న పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ముచ్చటిస్తూ భారతీయ వ్యోమగాములు పులావ్ నాన్‌రొట్టె చపాతీలు హల్వా తీసుకుని వెళ్లవచ్చుని ఇలాటి ఏర్పాటు ఇదే ప్రథమమని అన్నారు రక్షణశాఖ ఆహార పరిశోధన ప్రయోగశాల 12 రకాల ఇండియా వంటకాలను ఎన్నుకుందని వాటిని పరిశీలించిన పిదప నాసా (నేషనల్ ఎయిరో నాటికల్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్) ఆమోదిస్తుందని ఆయన అన్నాడు సెప్టెంబర్‌లో జరుగబోయే అంతరిక్ష యాత్రకు ఎన్నికయిన 300 మంది వైజ్ఞానికులలో ఒకరు చివరిసారిగా ఎన్నుకోబడుతారని అతడు అంతరిక్ష యాగంలో యోగాసనాలతో సహా వివిధ ప్రయోగాలు చేస్తాడని ప్రొఫెసర్ రావు అన్నాడు 300 మందిలో ఇద్దరు భారతీయులు– డాక్టర్ పి రాధాకృష్ణ నాయర్ డాక్టర్ ఎన్ సి భట్ ఉన్నారని ఆయన తెలిపారు ఇంతకు ముందు అంతరిక్షయానం చేసిన శ్రీ రాకేశ్ శర్మ ద్రవాహారం వెంట తీసుకు వెళ్లాడు ఇప్పుడు వెళ్లేవారు పులావు చపాతి హల్వాలు తీసుకు వెళ్లవచ్చు

## రోడ్ల పేరు మార్పు:–

నగరంలోని 25 రోడ్ల పేర్లు మార్చడానికి రాష్ట్ర ప్రభుత్వం నగరపాలక సంఘానికి అనుమతి నిచ్చింది సనత్‌నగర్– అమీర్‌పేట రోడ్డును పరిశ్రమ మార్గ్ అని అమీర్‌పేట– పంజగుట్ట జంక్షన్ వరకు అలియావర్ జంగ్‌మార్గ్ అని, పంజగుట్ట జంక్షన్ నుంచి విశ్వేశ్వరయ్య శిలావిగ్రహం వరకు విశ్వేశ్వరయ్యా మార్గ్‌అని మాసాబ్‌టాంక్ నుంచి సరోజినీదేవి కంటి ఆస్పత్రివరకు మాసాబ్‌మార్గ్ అని, లక్డీకాపూల్ నుంచి అంబేద్కర్ విగ్రహం వరకు పొట్టి శ్రీరాములు మార్గ్ అని అంబేద్కర్ విగ్రహం నుంచి బషీర్‌బాగ్ జంక్షన్ వరకు అంబేద్కర్ మార్గ్ అని బషీర్‌బాగ్ జంక్షన్ నుంచి ఆబిడ్ సర్కిల్‌వరకు లాల్ బహదూర్ మార్గ్ అని ఆబిడ్ సర్కిల్ నుంచి నాంపల్లి స్టేషన్‌వరకు పట్టాభిమార్గ్ నాంపల్లి స్టేషన్ నుంచి సంజీవయ్య విగ్రహం వరకు విశ్వాసమార్గ్ సంజీవయ్య విగ్రహం నుంచి ప్రకాశం విగ్రహం వరకు ప్రజామార్గ్ ఆ విగ్రహం నుంచి ఏ జి ఆఫీస్ రోడ్డును ప్రకాశం పంతులుమార్గ్ అని లక్డీకాపూల్ నుంచి బషీర్‌బాగ్ జంక్షన్‌వరకు రామానందతీర్థమార్గ్ మాసాబ్‌టాంక్ జంక్షన్ నుంచి బంజారావాల్స్‌వరకు తారకరామా మార్గ్ అని కవాడిగూడ జంక్షన్ నుంచి ముషీరాబాద్ వరకు బూర్గుల రామకృష్ణారావు మార్గ్ అయోధ్యా హోటల్ నుంచి బజార్‌ఘాట్ జంక్షన్ వరకు మెహదీనవాబ్‌జంగ్ మార్గ్ ఆబిడ్స్ సర్కిల్ నుంచి కోఠి వరకు రుద్రమదేవి మార్గ్ అని యూనివర్శిటీ రోడ్‌ను విజ్ఞానమార్గ్ అని బోట్స్‌క్లబ్ జంక్షన్ నుంచి సంజీవయ్యాపార్క్ వరకు సంజీవయ్యా మార్గ్ అని అంబేద్కర్ విగ్రహం నుండి వెళ్లే ట్యాంక్‌బండ్ రోడ్డుకు విహారమార్గ్ అని చార్‌మినార్ క్రాస్ రోడ్ నుంచి యూనివర్శిటీరోడ్ జంక్షన్ వరకు సూరవరం ప్రతాపరెడ్డిమార్గ్ అని మార్చుతారు

## ఉపశ్రుతి.–

కవులలో బేధాలేమిటి?– అని ప్రశ్నించాడు ఉపాధ్యాయుడు హాహాకార కవులు, స్వాహాకార కవులు మహాకార కవులు– అని సమాధానం చెప్పాడు ఒక విద్యార్థి అదేమిటోయ్ కొత్త నిర్వచనం?– అని నివ్వెరపోయాడు ఉపాధ్యాయుడు వహ్వా హా! హా! అని శ్రోతల ప్రశంసలు పొందేవారు హాహాకార కవులు, పంపిన డబ్బును స్వాహా చేసి, కవి సమ్మేళనాలకు రానివారు స్వాహాకార కవులు కేవలం ఆకార పుష్టేకాని కవితలో పసలేనివారు మహాకార కవులు– అని విశదీకరించాడు విద్యార్థి

## పొరపాటు

జనవరి 17వ తేదీ సచిత్ర వారపత్రికలో సంస్కృతం హరికథ శీర్షికలో కొన్ని పొరపాట్లు దొర్లాయి కథకురాలు కుమారి ఉమామహేశ్వరి శ్రీమతి కాదు కథ డిసెంబర్ మొదటివారంలో జరిగింది మూడవ వారంలో కాదు ఈ సంస్కృత కుమార సంభవం హరికథ రచించిన వారు శ్రీ రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి హరికథా పాఠశాల కపిలేశ్వరపురం తూ గో జిల్లా

– తిరుమల రామచంద్ర

Printed and Published for Nageswara Rao Estates Private Ltd , by S Nageswara Rao at
the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada 3, Editor S Radhakrishna
Phones Business 61247, 61248, Editorial 75667



పరమేశ్వరి ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్ ప్రారంభోత్సవంలో బ్రిటీష్ దర్శకురాలు శ్రీమతి నికిత్ శ్రీ సుబ్బరామిరెడ్డి శ్రీ దాసరి నారాయణరావు శ్రీ మిదున్ చక్రవర్తి శ్రీ కె భాగ్యరాజ్

## పరాజిత

కొడుకు కోసం భర్తను త్యాగం చేసి ఆఖరికి కొడుకును కూడా దక్కించుకోలేక జీవితంలో ఓటమి పొందిన పరాజితగా జయసుధ నటన పరాకాష్టనందుకుంది ఆమె దుష్టుడైన భర్తగా చరణ్‌రాజ్ కొడుకుగా ఆనంద్‌బాబు కోడలుగా తులసి నటించారు జనవరి 10వ తేదితో షూటింగ్ ఫినిష్ చేశాం, అన్నారు ప్రతి చిత్రంలో వైవిధ్యం చూపించడానికి కృషి చేసే తాతినేని ప్రసాద్ ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో అనిల్‌కుమార్ తిరుపతిరాయుడు నిర్మించే లక్ష్మి పద్మావతి ఫిలిమ్స్ పరాజిత చిత్రంలో రంగనాథ్ వీరభద్రరావు ఝాన్సి పి జె శర్మ జయమాలిని తక్కిన నటవర్గం పూసల సంభాషణలు చక్రవర్తి సంగీతం నవకాంత్ ఛాయ గూనా సహదర్శకత్వం కె రామలింగేశ్వరరావు శిల్పం సాహుల్ సాహసాలు పి వెంకటేశ్వరరావు కూర్పు వీరేంద్ర చౌదరి నిర్వహణతో తాండవ కృష్ణ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ □









## వారిచే మహిళా లోకానికి
## సరిక్రొత్త కానుక.

500 గ్రా రుచికరమైన బాంబినో
వెర్మిసెల్లిని ప్యాకెట్లు ఉచితం.




IS 1485
ISI

నేడే బాంబినో వెర్మిసెల్లిని కొనండి
రుచికరమైన పకోడా, వడ, కట్‌లెట్లు
రుచికరంగా చేసుకొని, ఖాళీ
ప్యాకెట్లు దాచి వుంచండి
ఎందుకంటే మీరు 11 ఖాళీ 250 గ్రా
ప్యాకెట్లును లేదా 6 ఖాళీ 500 గ్రా
ప్యాకెట్లును డీలరుకు వాపసు ఇస్తే
మీకు 500 గ్రా బాంబినో ప్యాకెట్లు
మా డీలరు ఉచితంగా ఇస్తారు

ఖాళీ ప్యాకెట్లును దాచుకోవడంలో
కూడా ఆనందం ఉంది కదా!




**బాంబినో వెర్మిసెల్లిని**

తీపైనా ఖారా అయిన బాంబినోతో రుచే రుచి

గుర్తుంచుకోండి. ఈ సదవకాశం
31-3-86 వరకు మాత్రమే.

